తాత్పర్యము.

పెద్దల యొద్దనుండి వారల సేవ చేసినవాఁడు, మంచి కాంతి గలవాఁడు, మితముగ మాటలాడువాఁడు, మామగారికిఁ బ్రియుఁడగువాఁడు, నాకు ముద్దుమఱఁది యగు లక్ష్మణుఁడు మేమెంత కష్టకార్యము చెప్పినను నాచేతఁగా దనక చేయువాఁడు. ఎంతటిదైన నోర్చి తెచ్చువాఁడు. ఆయన యుండుటచే శ్రీరాముఁడు తన తండ్రి లేఁడాయె నని తలఁపకున్నాఁడు. దాక్షిణ్యస్వభావముగలవాఁడు. దయ గలవాఁడు. నిర్మలమై, మృదువైన మనస్సు గలవాఁడు. ఎట్టి దోషములేనివాఁడు. శ్రీరామచంద్రునకుఁ బ్రియసోదరుఁడు, అట్టి లక్ష్మణుని సేమ మడిగితి నని నీవే చెప్పుము. ఎట్లు చెప్పిన శ్రీరామచంద్రమూర్తి యిప్పటికి వచ్చునో యట్లు సర్వము చెప్పుము.

క. నా వంత లంత మెఱుఁగఁగఁ, బ్రోవఁగ నను ప్రాణవిభుఁడు • పూనుట యెట్లో
యా విధిఁ గార్య మొనర్పఁగ, నీవె ప్రమాణంబు సుమ్ము వ•నేచరనాథా! ౬౫౨

తాత్పర్యము.

వానరేంద్రా! నాదుఃఖములు తుదముట్టవలె. ఇది నాకుఁ గావలసిన కార్యము. దానికై నామగఁ డేమి ప్రయత్నము చేసిన నన్ను రక్షింపఁగలఁడో యది యంతయు నాయనచేఁ జేయింపవలసిన వాఁడవు నీవే. ఆ భారము నీయం దున్నది.

ఉ. నా కెటు చెప్పవయ్య కపి•సత్తమ! నే నిఁక నొక్కమాస మే
తీరున నైనఁ బ్రాణములు • దేహమునన్ ధరియించుదాన, నా
పై రఘుచంద్రమా! నిజము • ప్రాణము నిల్వదు, ము న్నధోభువిన్
జేరిన కౌశికిన్ హరిని • చేర్చిన రీతి సముద్ధరింపుమీ. ౬౫౩

తాత్పర్యము.

ఆంజనేయా! యీ మాట మాత్రము గట్టిగఁ బలుమాఱు నా మగనికిఁ జెప్పుము. ఎంత కష్టమైన సహించి యింకొకనెల ప్రాణము బిగఁబట్టి యుండఁగలను. రామచంద్రా! యామీఁదట నేను నిలుపవలయు ననినను ప్రాణము నిలువదు. పూర్వ మింద్రుని రాజ్యలక్ష్మిని నింద్రుని చేర్చిన ట్లుద్ధరింపుము. తన నాత్మను దాను గాపాడుకొను మని చెప్పుము.

ఇంకను రావణుఁ డిచ్చిన గడువు రెండు నెలలకు మించి యుండఁగా నెలకే ప్రాణములు విడిచెద ననె నేల?

ఇది పదునాలుగవ సంవత్సరము ఫాల్గున మాసము. సీతా రామ లక్ష్మణు లయోధ్య విడిచినది చైత్ర శుద్ధ చవితి. పదునాలుగు సంవత్సరములు పూర్తి యగుటకు పందొమ్మిది దినములే కొఱఁతె యున్నది. పదునైదవ సంవత్సరము మొదటి దినము నీవు రాకున్న నే నగ్నిని బ్రవేశించెద నని భరతుఁడు శపథము చేసెను. రామచంద్రమూర్తి దాని నామోదించెను. కావున నేఁటి కిరువదవ నాఁడయోధ్యలో

30)

వలన హనుమంతునకు సీతారాముల యందున్న సమానమైనట్టి భక్తి కొంచెము సీతవైపు ప్రాలెనేమో యని చెప్పవలసియున్నది.

క. సంతసమునఁ బొంగెడి కపి, శాంతుఁడు దేహంబు సీత • కడ నుంచియుఁ దా
స్వాంతంబున రఘురాముని, జింతించుచు నుండె నతని • జేరఁగఁ జనఁగన్. ౯౪౭

తాత్పర్యము.

ఇచ్చినకార్యము నిర్విఘ్నముగ నెఱవేఱె నని సంతోషించు హనుమంతుఁడు దేహమును సీతయొద్ద నుంచినను మనస్సు రామచంద్రమూర్తి యొద్దనుంచి యాయనను జూడఁ ద్వరపడుచుండెను.

చ. అతులిత మై మహార్హ మయి • యా జనకాత్మజచే మహానుభా
వత ధృత మైన యమ్మణిఁ బ్ర•భావమునం గొని పావమాని మా
రుతమునఁ గంప మొందియును • రూపయి కోల్కొను పర్వతంబుఁ బోలి హృ
ష్టమతి యై చనం దలఁచె • శ్రీరఘురామునిఁ జేర సంతసన్. ౯౪౮

అర్థములు. అతులితమై=అసమానమై, మహార్హమయి = మిక్కిలి యుత్తములు ధరింప యోగ్యమై; మహానుభావతన్=మాహాత్మ్యముచే, ధృతమై=ధరింపబడినదై, ప్రభావమునన్ = తన మహిమచే; పావమాని = ఆంజనేయుఁడు; కోల్కొను=కుదుటఁబడిన. స్యమంతక మణివలె నీ మణి నందఱు ధరింప యోగ్యులు గారు.

తాత్పర్యము.

అసమానమై, యుత్తములు మాత్రము ధరింప యోగ్యమై, సీతాదేవిచే నామె మాహాత్మ్యముచే ధరింపఁబడినదైన చూడామణిని హనుమంతుఁడు తన బుద్ధిబలముచే గ్రహించినవాఁడై పెద్దగాలికిఁ జలించి మరలఁ గుదుటఁబడిన కొండవలె మొదట సీతాదేవి శోకావేశమును గని మిగుల వ్యాకులపడియును పిమ్మట స్వస్థచిత్తుఁడై సంతోషించి రామచంద్రమూర్తి యొద్దకుఁ బోవ నాలోచించెను.

( ౩౯ వ-సర్గము. సీతాదేవి తన్ను గుఱించి శ్రీరామునికిఁ దెలుప హనుమంతుని వేఁడుట. )

ఉ. జానకి రత్న మిచ్చి కపి • సత్తమునితో ననుఁ వానరోత్తమా!
దీనిని గుర్తెఱుంగు రఘు • నీనుఁ డెంతయు లెస్స, దీని నా
మానధనుండు కన్గొనిన • మాత్రన నా జననిన్ ననున్ ధరా
జానిని నాజనిం దలఁచు • సంశయ మింతయు లేదు నమ్ముమీ. ౯౪౯

అర్థములు. జననిన్ = నా తల్లిని; ధరాజానినిన్ = రాజును; ఆజనిన్=దశరథుని.

తాత్పర్యము.

సీతాదేవి హనుమంతునకు చూడామణి నిచ్చి యిట్లనెను. వానరేంద్రా!

ఈ సుగుణుడు రామచంద్రమూర్తి చక్కఁగా నేలుఁగాక. కీనిని వాపినంతనే నా తల్లిని, నన్ను; దశరథమహారాజును స్మరించుము.

వివాహకాలంబున దీనిని జనక మహారాజు తన చేతి కీయఁగా నాయన భార్య, దశరథుఁడు రాముఁడు చూచుచుండ నాకు సీతాదేవి తలలో నలంకరించెను. కావున మేము తప్పక జ్ఞప్తికి వత్తుము. జనని యనఁగా కౌసల్య యని కొందఱం దురు. కన్యాదానవేళ కన్న తల్లిదండ్రులు దానము చేయఁ బెండ్లికూఁతుతో నుందురు గాని వరుని తల్లితోఁ బనిలేదు. కావున కౌసల్యవివాహవేదిని నొద్ద లేదు. దశరథుఁడు మాత్రమే సుమాంపులతోడ నుండెను. అదియును గాక ౧౮౧౦ వ పద్యమున తేఁన్మితమాధవను మామామగారు ప్రేమమున నుద్వాహవేళ నిరమం దిది నూర్పనని వాక్యమువలన కౌసల్యాప్రసక్తికిఁ గారణము లేదు. కన్య నలంకరించునది కన్యతల్లి దండ్రులది గాని వరుని తల్లిదండ్రులది గాదు. కావున జనని యనఁగా కౌసల్యగాదు.

ఇప్పటి యాఁడువారు ధరించు పచ్చబిళ్ళవంటిది ఈ జడబిళ్ళ, ఇప్పటివారు గాజుబిళ్ళను చుట్టు జవకట్టించి ధరింతురు. సీతాదేవి జడబిళ్ళ అంతయు రత్నమే. అనఁగా వంత పెద్ద కెంపు కావుననే యనులితము, మహార్హమని చెప్పఁబడెను.

క. నీవు సముత్సాహముఁ గొను, నా విధిఁ బ్రేరించితిక్ వ•నాటచరేంద్రా!
 నీవే యీ పని యుఁకవిగాఁ, జే విధి ఘటియింపవలయు•నెంచుము దానిన్. ౯౫౯

తాత్పర్యము.

నీ కుత్సాహము గలుగుటకై నెట్లు చెప్పవలయునో, యెంత చెప్పవలయునో యు ట్లంతయుఁ జెప్పితిని. తరువాతికార్య మెట్లు చేయవలయునో యని నీవే యాలో చించుము.

క. నీవే గతి యీ కార్యం, బో వానరవర్య! ఫలము • నొందఁగఁ జేయన్
 నీ వే విధి నైనను నా, వావిదుఃఖంబుఁ బాప•వలయుం జుమ్మీ. ౯౬౦

తాత్పర్యము.

స్పష్టము.

క. కావున నే మార్గంబున, ధావిభుఁడు మదీయదుఃఖ•మును బోనడచున్
 నీ వా యుపాయ మంతయుఁ, బావని! యూహింప నీక•భారము సుమ్మీ. ౯౬౧

తాత్పర్యము.

స్పష్టము.

క. అన నల్ల చేయువాఁడను, వనితామణీ! యని ప్రతిజ్ఞ • వచియించి మరు
 త్తనయుఁడు పయనం బైనను, గని జానకి యిట్లు లనియెఁ • గనుఁగొనుచున్.

తాత్పర్యము. స్పష్టము.

క. వినుమమా కుశలం బడిగితి, ననుమా శ్రీరాముఁ డమ్ము • నా ప్రణయమునున్
 దినకరసుతుఁ గపివృద్ధుల, హనుమా! ధర్మోక్తి నేమ • మడిగితి ననుమా. ౯౬౩

తాత్పర్యము.

ఆంజనేయా! నీవు మన సైన్యంబో యుంచియున్నావు. నేను చెప్పునది వినుము. శ్రీరామచంద్రమూర్తిని, ఆయన తమ్ముని, ఆయనకును, వనకు ముఖ్యులైన వారితోఁ గూడిన సుగ్రీవుని, వానరులందఱు పెద్దవారిని, ధర్మపద్ధతిని క్షేమము విచారించితి ననిచెప్పుము.

తే. ఆ మహాబాహుఁడైన శ్రీ • రామచంద్రుఁ, డెట్లు తరియింపఁజేయు న • న్నీ దురంత
శోకవారాశినుండి యా • కొంచు నెఱిఁగి, యట్లు సమ్మతిపలుపుమా • యతులకీర్తి.

అర్థములు; దురంత శోక వారాశినుండి = అంతములేని దుఃఖసముద్రమునుండి, అతులకీర్తి = అసమానమైన కీర్తి గలవాఁడా.

తాత్పర్యము.

మహాబలవంతుఁడైన శ్రీరామచంద్రమూర్తియే విధముగఁ బారము లేని యీ దుఃఖ సముద్రమునుండి నన్ను దాటించునో, యా విధము దెలిసికొని యా విధముగనే తరాయనను సమ్మతింపఁ జేసి కీర్తి వహింపుము.

క. నా చేశోవిధుఁ డేగతిఁ, బ్రోచున్ నే మేను విడక • పూర్వమె నన్నున్
ధీచతుర! యట్లు పలుకుము, వాచాపుణ్యంబుఁ గలుగు • వానరవర్యా! ౯౬.౫

అర్థములు. చేశోవిధుండు = మగఁడు, వాచాపుణ్యము = మాటచెప్పుట వలనఁ గలుగు పుణ్యము, కర్త కెంత పుణ్యమో ప్రేరించు వానికి; జేయించు వానికి నంతే పుణ్యము గలదు కదా. "వష్టి భాగురి రల్లోప మవాప్యోరుపసర్గయోః। ఆపం చైవ హలంతానాం యథా వాచా నిశా దిశా॥" అని వాచాశబ్దము ఆకారాంత స్త్రీలింగము గలదు.

తాత్పర్యము.

నేను దేహము విడవక ముందే నన్ను నా మగఁ డెట్లు చెప్పిన రక్షించునో యట్లు బుద్ధి చమత్కారము గల నీవు చెప్పి ప్రేరకుడవు నచ్చు పుణ్యంబు పొందుము.

క. సత్సాహసికాగ్రణి విచి, కిత్సామాత్రోక్తి నీవు • కెరలుచుఁ బలుకన్
బ్రోత్సాహము గొని నను నా, పత్సాగరమున దరింపఁ • బతి యొనరించున్.

అర్థములు. సత్ + సాహసికాగ్రణి = మంచి సాహసము చేయువారిలో మొదటివాఁడవు. విచికిత్సామాత్రోక్తిన్ = సందేహము లేని మాటలతో, కెరలుచు = ఉత్సాహముతో విజృంభించి.

తాత్పర్యము.

మంచి సాహసవంతులలో మొదటివాఁడా! నీవు సందేహమున కెడ మీయని మాటలతో నుత్సాహమున విజృంభించి పలికితివేని ప్రోత్సాహము గొని నా భర్త నన్ను నాపత్సముద్రమునుండి తరింపఁజేయును. అటుగాక నీవు [illegible] మరలుచు లంక చాల దూరమున్నది. మఱి పెద్ద సముద్రము. దాని దాటుట కష్టము. దాటి

నను రావణుఁడు బలవంతుఁడు. ఎట్లగునో, యేమో-యని యిట్లు చెప్పుకొనుటతోఁ జెప్పుచున్నాను. రామచంద్రా ! లే లెమ్ము. సీతాదేవిని నా దుష్టుఁడు చాల బాధ పెట్టుచున్నాఁడు, మనము పోవునంతకు బ్రదుకునో, బ్రదుకదో. రావణుఁ డనఁగా నెంత ? లే లెమ్ము. నిమిషములోఁ బోయి లంక ధ్వంసము చేసి రావణుని బట్టి ఖండించి సీతను దీసికొని వత్తము. ఆఁడుది దిక్కు-లేక యుండ దల్లాడుచుండఁగా నిందయము మగవారము పరాక్రమవంతుల మూరకుండ వచ్చునా, లే లెమ్ము పోద మని యిట్లు చెప్పుము.

క. నా సందేశయుతం బగు, నీసూక్తుల నాలకించి ♦ నిజపౌరుషమున్
కౌసల్యాతనయుఁడు క్రూ,రాసురపంక్తులపైఁ జూపు ♦ నాహవమందున్. ౯౩౭

అర్థములు. నా సందేశ యుతము = నేను చెప్పిన వార్తతోఁ గూడినది. ఆహవమందున్ = యుద్ధమందు.

తాత్పర్యము.

నేను చెప్పిన మాటలతోడ నీవు ననుసరించియనుకూల వాక్యములు చెప్పితివా తన పౌరుషమును రాక్షసులపై రామచంద్రమూర్తి చూపును.

సీ. అనవుడుఁ బవమాన♦తనయుఁ డిట్లను దేవి ! శ్రీరామభద్రుండు ♦ శీఘ్రముగను
వానరభల్లూక ♦ వారసంయుతుఁ డయి, చనుదెంచి యిచ్చటి ♦ శత్రుసమితి
హరియించి నీ దుఃఖ♦మపనయించును దేవ, మనుజనాగార్కయ♦మప్రభృతులుఁ
బర్జన్యుఁ డైనను ♦ భగ్నులై నీ కయి, రాముండు తోడర నిం♦కేమి పలుక !

ఆ. జలధివేష్టితోర్వి ♦ శాసింపఁగలవాఁడు, రామచంద్రుఁ డతిపరాక్రమమున
నలరి విజయమునకు ♦ నంబుజలోచన, నీవె కారణతము ♦ నిశ్చయముగ. ౯౩౮

అర్థములు. అపనయించును = పోఁగొట్టును; తోడరి = ప్రయత్నించెనేని; జలధివేష్టితోర్విన్ = సముద్రమను వస్త్రముచేఁ జుట్టఁబడిన భూమి; శిరోవేష్టము. ఇత్యాదులందు వేష్టము వస్త్రపర్యాయము. ద్రావిడులు సాధారణముగ నాయిక యందును కట్టువస్త్రము పర్యాయముగ వేష్ట శబ్ద ముపయోగింతురు.

తాత్పర్యము.

సీతాదేవి యిట్లు చెప్పఁగా హనుమంతుఁడు "దేవి ! శ్రీరామచంద్రమూర్తి వానరులతోను, భల్లూకములతోను శీఘ్రముగా నిచ్చటికి వచ్చి శత్రు సమూహముల సంహరించి నీ దుఃఖమును బోఁగొట్టును. రామచంద్రమూర్తి యుద్ధప్రయత్నము నీకయి చేసెనేని దేవతలు, మనుష్యులు, పన్నగులు, ఇంద్ర సూర్య యములు లోనగు వారెవ్వ రడ్డమైనను చచ్చినవారే. ఇట్లు జయించి సముద్రముచేఁ జుట్టఁబడిన భూమండలములను బరిపాలింపఁగలఁడు రామచంద్రమూర్తి పరాక్రమమును వర్ణించుచున్నానే కాని యీయన విజయమునకు మూలకారణము నీవే. చచ్చిన సత్యవంతుఁ డెట్లు బ్రతికెను. సావిత్రి సత్యవంతున కేవిధ మావిధముగ నీకు నే నని నీవే చెప్పి

పెద్ద సందేహము నన్ను బాధించుచు నా కన్నులయెదుట మూర్తీభవించి నిలిచి యున్నది.

చ. హరివర ఋక్షసైన్యములు • నా నృపవర్యతనూజ లేని దు
స్తరజలరాశి దాఁట నెటు • చాలుదు రన్న ? తలంచి చూడఁగా
గరుడుఁడు నీవు మారుతుఁడుఁ • గాక మహోత్తరు భూతకోటిలోఁ
బరవసు మొప్పు దాఁటఁగల • వారలు గానఁగ రారు మారుతీ! ౨౫

అర్థములు. పరవసము = ధైర్యము.

తాత్పర్యము.

వానరేంద్రా! ఎలుఁగుల సేనగాని, రాజకుమారులుగాని దాఁట సాధ్యము గాని సముద్రము నెట్లు దాఁటుదురయ్యా! మారుతీ! ఈ భూతకోటిలో గరుత్మంతుఁడు, వాయుపుత్రుఁడ వైన నీవు, వాయువుతప్ప మఱియెవ్వరును నీ సముద్రమును దాఁటఁ గలవారు లేరని నా యభిప్రాయము.

క. కనుఁగొలఁది నసాధ్యం బా, పని యనుచుం దోఁచె; గార్య•పద్ధతులను నీ
కననియది లేదు, దీనికి, హనుమా! నీ వనుము విన స•మాధానంబుల్. ౨౬

తాత్పర్యము.

నే నాలోచించుకొలఁది వారందఱు అవ్వలికి వచ్చుట యసాధ్యకార్య మని తోఁచుచున్నది. అయినను కార్యము చేయుమార్గములందు నీ వాలోచింపనిది లేదు. దీనికి నీ వేమి సమాధానము చెప్పెదవో వినఁగోరెదను.

క. నీ వొకఁడవె యీ కార్యము, పావని సాధింప శక్తి•పరుఁడవు ధరపై
నీ వొకఁడవె యీ కీర్తి, చే విలసిల్లఁగఁ గలవు • శిక్షితవైరీ! ౨౭

తాత్పర్యము.

ఎట్లు సాధింపఁగలవో యేమో, నాఁకు తెలియదు గాని దీనిని సాధింపఁగల వాఁడవు నీ వొకఁడవే. ఈ కీర్తి పొందఁగలవాఁడవు నీ వొక్కఁడవే. మఱియొకఁ డీ కార్యము చేయను లేఁడు, కీర్తిని సంపాదింపను లేఁడు. కాని నీ విట్లు చేయుట నాకుఁ గీర్తికరము గాదు.

క. బలములతో నిచటికి రఘు,కులతిలకుఁడు వచ్చి కలనఁ • గూల్చి దశాస్యున్
గెలు పొంది నన్నుఁ దనపురి, కలవునఁ గొనిచనిన నాకు • యశ మది మాన్యన్.

అర్థములు కలనన్ = యుద్ధమున; అలవునన్ = బలముచే, నాకు = వీర్యశుల్క- నగు నాకు ఏవఁడుగా మించువాఁడుగదా నా సుమార్తేశ్వరుఁడు అని తండ్రి చాటించెను.

తాత్పర్యము.

అట్లైన నీ కేది కీర్తికర మందువా ? రామచంద్రమూర్తి సేనలతో నిచటికి వచ్చి యుద్ధమందుఁ దనబల పరాక్రమములు జూపి రావణుఁ జంపి నన్ను నయోధ్యకు

తీసికొనిపోయినా,యది నాకు కీర్తికరము. అప్పుడు నేను వీరపత్నియను బిరుదమునకు దగిన దాన నగుదును. ఇది రామునకు సాధ్యముకాని కాకపోని, ఆయనకుఁ గీర్తికరముకాని కాకపోని మఱి యే యుపాయ మైనను నాకుఁగీర్తికరము గాదు. కావున నే నంగీకరింపను.

పరమభక్తులు, ప్రపన్నులు భగవంతుఁడు స్వయముగ వచ్చి తమ్ముఁ దీసికొని పోవఁ గోరుదురు గాని దూతలచేఁ దీసికొనిపోవుట కూడ సహింపరు. "పర దేహావసానే మాం త్వత్పాదం ప్రాపయ స్వయమ్" అనియే వారు కోరుదురు. అట్లు గాకేని మహారాజు నాశ్రయించుట, వాని భృత్యు నాశ్రయించుట రెండు సమానము లగును. అది రాజునకు, వాని యాశ్రితునకు నిరువురకు నవమాన కరమె.

క. ప్రాకటశితనారాచా, నీకంబున లంకఁ జలిపి ♦ నీఱుగఁ గడిమిన్
గైకొని న న్నేగినచోఁ, గాకుత్స్థున కదియె తగిన ♦ కార్యము సుమ్మీ. ౯౨౯

అర్థములు. ప్రాకట శితనారాచానీకంబునన్ = ప్రసిద్ధములై, పదును గలిగిన బాణముల గుంపులచే; నీఱుగన్ = భస్మముగ; కడిమిన్ = బలముచే; కాకుత్స్థునకున్ = దేవతలకుఁ దోడై రాక్షసుల వధించి కీర్తి సంపాదించిన కకుత్స్థుని వంశమునఁ బుట్టిన వానికి.

తాత్పర్యము.

నేను చెప్పిన యుపాయము కీర్తికరము నాకు మాత్రమే కాదు. ప్రసిద్ధము లైన వాఁడి ములుకులచే లంకను భస్మము చేసి తన బలమున నన్నుఁదీసికొని పోవు టది తనకుఁ,దన వంశమునకుఁ గూడఁ గీర్తికరము. కావున నా నిమిత్తమై గాకున్నఁ దన నిమిత్తమై యైన నేను చెప్పినట్లు చేయవలెను.

దీని వలన భక్తి ప్రపత్తుల శ్రేష్ఠత్వము సూచింపఁ బడెను. ఉపాయము గొప్పదైన నుపేయము గొప్పదే. ఉపేయము గొప్పదైనప్పుడు దాని సాధన మగు నుపాయము గొప్పదిగానే యుండవలెను. ఉపేయము రామచంద్రమూర్తి, దాని సాధన ముపాయము, రామచంద్రమూర్తియే వచ్చుట.

తే. పరమవీరుండు రాముండు ♦ సమరమందు
నతని మగఁటిమి కనురూప ♦ మైనదాని
యోజన యొనర్చి చెప్పుమీ ♦ యోజనీయ
వనచరకులావతంస! నీ వనుచు నడుగ. ౯౩౦

అర్థములు. సమరమందున్ = యుద్ధమందు. అనురూపము = తగినది.

తాత్పర్యము.

ఆంజనేయా! యిది యోజనాదాన మైన నా యాలోచన విధము; నీవును శ్రీరామచంద్రుఁడు యుద్ధమందు మిగుల శూరుఁడు; అటువంటి వానికిఁ దగిన దర్య యేదియో యాలోచించి చెప్పుము అని యడుగఁగా.

క. ఘనహితము హేతుయుతమును, ననఘార్థోపహిత మైన • యవనిజసూక్తుల్
విని యంజనవరతనయుం, డనిరాన్ వక్తవ్యశేష • మాదట నిట్టుల్. ౧

అర్థములు. ఘనహితము = గొప్ప మేలు కూర్చునది, హేతుయుతము = యుక్తియుక్తము, అనఘ = దోషరహితమైన, అర్థ + ఉపహితము = అర్థముతోఁ గూడినది. వక్తవ్య శేషము=చెప్పవలసిన దానిలో నింత వఱకుఁ జెప్పఁగా మిగిలినది.

తాత్పర్యము.

మిగుల హితమైనవి, యుక్తియుక్తమైనవి, నిర్దోషమైనవి, ప్రయోజనముతోఁ గూడినవి యగు సీతాదేవి చెప్పిన మంచి మాటలనువిని,హనుమంతుఁడు చెప్పవలసిన దానిలో మిగిలిన దాని నిట్లు చెప్పెను.

—• హనుమంతుఁడు సీతాదేవి సందేహము దీర్చుట. •—

ఉ. దేవి! కపీంద్రభల్లుకతతి•ప్రభువర్యుఁడు నిశ్చయించె సు
గ్రీవుఁడు నీ నిమిత్తము ప్ర•కృష్టబలంబులతోడఁ దోడ్పడం
గా, నెస వత్తు రాతనికిఁ • గైవసమై యసమాన విక్రముల్
దేవనిభుల్ మనోజవులు • దిగ్గగనాటులు శత్రుమర్దనుల్. ౨

అర్థములు. కపీంద్ర = వానర శ్రేష్ఠుల యొక్కయు, భల్లుకతతి = ఎలుగుల సమూహము యొక్కయు, ప్రభువర్యుఁడు = గొప్పప్రభువు, ప్రకృష్ట బలంబుల తోడన్ = గొప్ప సేనలతో, కైవసమై = స్వాధీనపడి, మనోజవులు = మనసువంటి వేగము గలవారు, దిక్ + గగనాటులు = దిక్కులయందు, నాకాశమందు సంచరించువారు.

తాత్పర్యము.

దేవి ! వానరభల్లూకరాజగు సుగ్రీవుఁడు నీ నిమిత్తమై గొప్ప సేనలతో రామచంద్రమూర్తికి సహాయపడ నిశ్చయించినాఁడు. ఆయనకు లోఁబడినవారై యసమానపరాక్రమము గలవారును, దేవతలతో సమానులును, మనోవేగము గల వారును, దిక్కులందు నాకాశమందు, సంచరించువారును, శత్రుసంహారకులు నగు వారు శీఘ్రముగ వత్తురు.

క. ఎంత గడుసుఁబని నైన న,నంతయు నెత లేక సలుప • నగు వారలు వి
క్రాంతులు సాబ్ధిధరావని, గంతున వలనొనెడివారు • గగనాధ్వగులై. ౩

అర్థములు. గడుసుఁబని = కఠిన కార్యము. స+అబ్ధి = సముద్రములతోను, ధర = పర్వతములతోను గూడిన, అవనిన్ = భూమిని, గంతునన్ = దాటుటను, వలనొనెడివారు = ప్రదక్షిణించువారు; గగనాధ్వగులై = ఆకాశమార్గమున సంచరించువారై.

తాత్పర్యము

నా కెటువంటివారని తలంచితివో యేమో, ఎంతకష్టమైన పనియైనను రవంత

నైన బలిష్ఠులే చేయఁగలవారు, పరాక్రమము గలవారు, సముద్రములతోను పర్వతములతోను గూడిన భూమండలమును ఆకాశమార్గమునఁ బ్రదక్షిణము చేసి రాఁగలవారు. అట్టివారికి సముద్రము దాఁటుట యెంతటి కార్యము.

క. నాకంటె గొప్పవారును, నాకున్ సరివారుఁ గలరు • వనచరు లధటన్
నాకంటె హీనుఁ డొకఁడున్, శ్రీకాంతా! లేఁడు తీక్ష్ణ•కరసుతు నొద్దన్. ౯౮౬

తాత్పర్యము.

వానరులలో సముద్రము దాఁటఁగలవాఁడు నేనొకఁడనని తలఁచితివి. అదిపొరపాటు. సుగ్రీవు నొద్ద నా కంటె గొప్ప వారును; నాకు సమానులు నగువారును గలరే కాని నా కంటెఁ దక్కువ వాఁ డను మాత్రి యొకఁడైన లేఁడు. వారికి ప్రక్క రాలేదు. కనుక నిన్నుఁ జూడలేదు. నే నీ ప్రక్క వచ్చితిని. నా పుణ్యము కొలఁది చూచితిని. ఈ మాత్రమున వానరుల యందఱిలో నేనే మొనగాఁ డని యెట్లు నిశ్చయించితివి.

క. నేనే నినుఁ గాంచితి నట, యూ విస్తృతబలుల కేమి • యనవలయు నోహో
మానవపతి భూరిగుణా,హీనులఁ బంపండు పంపు • నితరుల మొదలన్. ౯౮౭

అర్థములు. భూరిగుణహీనులన్ = గొప్ప గుణములచే గొప్పయగు వారిని, ఇతరులన్ = గుణహీనులను.

తాత్పర్యము.

వానరవీరుల యందఱిలోఁ గడపటివాఁడ నగు తక్కువ శ్రేణిని నేనే నిన్నుఁ జూడఁ గలిగితి నట. ఇఁక నసమాన బలు లగు వారి నే మనవలయును. రాజనీతి వినుము. నీకుఁ దెలియనిది గాదు. రాజు శత్రువుల యొద్దకుఁ బంపునపుడు గుణహీనులను దొలుతఁ బంపును గాని, గుణోత్తములను మొదటఁ బంపఁడు. ఏల? వా రక్కడఁ జిక్కుపడి నేని తనకు బలము తగ్గును. కావున నందఱిలో హీనుఁడ నగుటచేతనే సుగ్రీవుఁడు నన్నుఁ బంపెను గాని యుత్తముఁ డగుటచేఁ గాదు.

ఇది యుక్తియుక్తమైనను సత్యము మాత్రము గాదు. అయినను నిట్టియసత్య మసత్యముగాదు, ఇందు సీతాదేవికి ధైర్యము చెప్పి జీవింపఁ జేయవలయు నను సదుద్దేశము గలదు గాని దురుద్దేశములేదు. కావున నసత్యదోషము లేదు. పుణ్యపాపములు భావాధీనములు. అటుగాక సముద్రలంఘనము మాత్రమే సీత యుద్దేశముగ నేని నిది సత్యమే. ఆకుంచితేహము సముద్రము దాఁటి యున్నాఁడు గాఁగల రనిరే కదా. బలమున హనుమంతు డెక్కుడైనను, వేగమున నంగద నీలాదులు సమానులే.

సీ. కావున నీవు శోకంబు మానుము తల్లి! దుఃఖకాలం బెల్లఁ • దొలఁగిపోను
నిక్క మోయి నే చెప్ప• ముదిగుణ శ్రేష్ఠులు, వచ్చెద రొక్క గంతు•నైచి యాటకు
నా వీఁపుపై నెక్కి • భూవిభుల్ శశిభాస్కరులపోల్కి శ్రీమోల • నిలుచువార
లిట వచ్చి యాలంక • నెల్ల నాయకములఁ, దుత్తుమురుగఁ జేయఁ•గలుగువారు

ఆ. రామచంద్రవిభుఁడు • రణరంగమం దింక, సబలుఁ బంక్తికంఠు • సంహరించి
నిన్నుఁ దోడుకొనుచు • నెమ్మి నయోధ్యకుఁ, బోవువాఁడు పువ్వుఁ•బోణి నిజము.

అర్థములు. ముదితులు = సంతోషించిన వారు, సాయకములన్ = బాణములచే.

తాత్పర్యము.

ఈ కారణముచే నీవు రామలక్ష్మణు లెట్లు రాఁగలరను సందేహము గాని, రానను శోకముగాని వదలుము. నీ దుఃఖకాలము పోయినది. నేను పోయి చెప్పఁగానే వానరు లొక గంతునఁ బైచి సంతోషముతో నిటకు వత్తురు. రామలక్ష్మణులు సూర్యచంద్రులవలె నా వీఁపుపై నెక్కి వచ్చి నీ యెదుట నిలువఁ బడుదురు. ఇచ్చటికి వచ్చి బాణములచే నీ లంక నంతయు పొడిపొడిగాఁ జేయుదురు. యుద్ధమందు రామచంద్రమూర్తి రావణుని సేనలతోఁ జంపి నిన్నయోధ్యకుఁ దోడుకొనిపోవును.

క. కాలమున కెదురు చూడుము, బాలా! తూర్ణముగ రాము • వహ్నివలెఁ గనం
జాలెద వాతఁడు నీ వ్యథఁ, బాలార్చును నసురగతిని • బరికింపు మిఁకన్. ౯౭౭

అర్థములు. తూర్ణముగన్ = త్వరగా; వహ్నివలెన్ = అగ్నివలె, పాలార్చును = నశింపఁజేయును.

తాత్పర్యము.

అమ్మా! మే మెప్పుడు వత్తుమా యని మా రాక కెదురు చూచుచుండుము. ఈ లోపల నీ వేమియు సాహసము చేయఁబోకుము. రామచంద్రమూర్తిని మండుచున్న యగ్నిహోత్రమువలె నీవుఁ జూడఁగలవు. ఆయన నీ దుఃఖము మాపును. రాక్షసుఁ డింక నేగతి పట్టునో చూడుము.

చ. కొడుకులతోడ బంధుజన•కోటులతోడ నమాత్యపంక్తితోఁ
గడచని రాక్షసేశ్వరుఁడు • శస్త్రస్థలిఁ బ్రేల్వఁగ నీవ చూచి నీ
యుడుగని దుఃఖసాగరము • నోడను దాఁటి శశాంకు రోహిణీ
జలజదళాక్షి చందమున • సమ్మతి మీరఁగఁ గూడె దంగనా! ౯౭౮

అర్థములు. అమాత్యపంక్తితోన్ = మంత్రుల సమూహముతో, కడచని = చచ్చి.

తాత్పర్యము.

అమ్మా! కొడుకులతోఁ, జుట్టములతో మంత్రులతోఁ జచ్చి రావణుఁడు నేల బడఁగా నీవే చూచి నీ దుఃఖసముద్రముయొక్క యొడ్డును చేరఁగలవు. మఱియు రోహిణి చంద్రునిఁ గూడినట్లు నీ మగనిని నీవు సంతోషముతోఁ గూడుకొనఁగలవు.

సీ. అని యిటు లూరార్చి • యనిలజుఁ గనుఁగొని, పయనింప నాయత్త•పడుచు వెండి
పల్కు నా పావని • పల్లటిల్లకు మమ్మ, త్వరగానె కాంచెదు • దాశరథుల
శరచాపకరుల నీ•పురమువాకిట నతి, దంష్ట్రాయుధులు రణ•దక్షులైన
శాఖామృగంబులు • శైలాంబుదసముల్, సద్భక్తిఁ గొలువంగ • జలజనేత్రి!

ఆ. నిన్నుఁ దలఁచి తలఁచి • కన్ను మొగుడ్పక, యున్నవాఁడు రాముఁ • డున్మలికను
దుఃఖపడకు మమ్మ! • మురపిల్లకో యమ్మ, తాళవమ్మ! వెతలు • దలఁగు నమ్మ.

అర్థములు. అయత్తపడుదున్ = సిద్ధపడుదు; పల్లటిల్లకుము = తెల్లఁబోకుము; శాఖామృగంబులు = వానరులు, శైలాంబుదసముల్ = పర్వతములతో మేఘములతో సమానమైనవారు, ఉన్మలికన్ = శోకముచేత; మురపిల్లకుము = తపించకుము; జలదవేణీ = మేఘమువలె నల్లనైన జడ గలదానా.

తాత్పర్యము.

ఈ ప్రకారము సమాధాన పలికి ప్రయాణమునకు సిద్ధపడుచు సీతాదేవిని జూచి యామెకు మఱింత ధైర్యము వచ్చుటకై హనుమంతుఁ డిట్లనియె. అమ్మా! నీవు తెల్లఁబోకుము. విల్లు బాణములు ధరించిన రామలక్ష్మణులను నీ పురము వాకిటఁ ద్వారలోనే, గోళ్ళు కోఱ లాయుధములుగఁ గలిగి యుద్ధమునకు సమర్థులై పర్వతముల వలె నెత్తైన మేఘముల వలె లావైన వానరులతోఁ గూడి యుండఁగా జూడఁ గలవు. రామచంద్రమూర్తి నిన్నుఁ దలఁచి తలఁచి వ్యసనముచే నిద్దుర లేక యున్నాఁడు. కావున నీవు సంతాపపడకుము. రావణు భయము వదలుము

క. రామునికంటె విశిష్టుఁడు, భూమిజ! యొకఁ డమ్మ లోక • ముల నెందేనిన్?
సౌమిత్రికి సముఁ డెవ్వఁడు? రామా! నీ కాశ్రయులును • వహ్న్యనిలసముల్.

అర్థములు. విశిష్టుఁడు = గొప్పవాఁడు, వహ్ని+అనిలసముల్ = అగ్ని వాయువులకు సమానులు.

తాత్పర్యము.

ఎంతైనను, ఏ విషయమందైనను రామచంద్రమూర్తి కంటె గొప్పవాఁ డెవఁడు? లక్ష్మణునకు సమానుఁ డెవ్వఁడు? వారిరువురు అగ్ని వాయువుల వంటివారు. లోకములో దహన కర్మమందు అగ్నిని మించినది లేదు. ఇది రూపము లేకుండఁ జేయును. బలమునందు వాయువుతో సమానమైనది లేదు. ఎట్టిదానినైన బోర్లఁద్రోచి తుత్తుమురు చేయఁ గలదు. రెండు నేకమైనప్పుడు శత్రువిధ్వంసము చేయఁగలవు. ఈ యిరువురు నీకు సహాయులు. ఇఁక నీకు వచ్చిన భయ మేమి!

క. రాముని నేఁ జూచుటయే, భూమిసుతా! యుక్త; మేను • బోయి వచింపన్
భీమకపిస్తోమంబులతో మహిపుఁడు వచ్చి యిటకుఁ • దున్మాడు నరిన్. ౪౯

తాత్పర్యము.

నేను పోయి రామచంద్రమూర్తిని జూచుటే యాలస్యము. నేను పోయి చెప్పఁగానే భయంకర వానర సమూహముతో నాయన బయలుదేఱివచ్చి శత్రు సంహారము చేయును.

క. ఈ రత్నాకరవేష్టిత, ధారిణి నెటు లందఁగలరు • తల్లి! చిరముగా
స్వారాజును శచి గూడిన, తీరునఁ బతిఁ గూడె దీవు • ధృతి గొను మాత్మన్.

అర్థములు. ఈ రక్షోగణసంకులె భూమిః = రాక్షస సమూహములచే గాపాడఁ బడుచున్న యీ భూమి, ఈ యనునది సమీపపు పదార్థమును దెలుపును; చిరము = శాశ్వతముగా; స్వారాజను = స్వర్ + రాజను = ఇంద్రుని; ధృతి = ధైర్యము.

తాత్పర్యము.

రాక్షసులు కాపాడుచున్న యీ లంక శాశ్వతముగా దుఃఖముల పాలు కాఁ గలదు. ఇంద్రుని శచీదేవి కలిసికొన్నట్లు నీవును రామచంద్రమూర్తిని గలిసికోఁ గలవు. ధైర్యము వహింపుము. భయపడవలదు.

-• ౪౦-వ సర్గము. సీతాదేవి శ్రీరాము నుద్దేశించి హనుమంతునితోఁ బలుకుట •-

సీ. అనఘుఁడు బవమాన•తనయునిఁ గనుఁగొని, ధరణిజ యిట్లనుఁ • గరముఁ బ్రీతి
నీ ప్రియసూక్తులు • నింపుమదం బిచ్చె, వాడిన మడికిని • వానయట్లు
శోకంబుచేఁ జాల • కృశించి యుండు నా, యవయవంబులచేత • నాసమీర
నట్లు భాగ్యశాలి నే • స్పృశియింపఁ గలనో నీవట్లుసేయుము వలు•వట్లు గోలఁగఁ
గాకిని గోపాన • నేకాక్షునిగఁ జేసి, నట్టివార్తయు వర•గ్యాయున నాదు
ఆ. గండభాగమునను • గరఁగిపోఁ దిలకంబు, స్వేదబిందువులను • జిత్రరీతిఁ
మనశ్శిలను నొకంట•మనుతి దిద్దఁగ నీవు, తిలకముంచుటయును•దలఁపు మనుము.

అర్థములు. వలువట్లు = వట్లు+వట్లు=వలువట్లు, మిక్కిలి కృశించుట, ఏకాక్షునిగన్ = ఒక కన్నుగలదానిగ, గండభాగమునను = చెక్కిలి యందు. (౨) గండశైలము ప్రక్కనున్నప్పుడు, స్వేదబిందువులను = చెమట బొట్లను.

తాత్పర్యము.

ఈ ప్రకారము హనుమంతుఁడు చెప్పఁగా నాయనను జూచి సీతాదేవి మిగులఁ బ్రీతితో నిట్లనెను, వాడిపోవుచున్న మడిలోని పైరునకు వాన మూలఁ బ్రాణము గలిగించి పచ్చగాఁ జేసినట్లు చావనున్న నాకు నీ ప్రియవాక్యములు మరలఁ బ్రాణమును గలిగించెను. బ్రతికితిని. శోకముచే మిక్కిలి కృశించియుండు నీ యవయవములచే నా దుఃఖమంతయు నమయునట్లు నామగని నేనెట్లు కౌగలింపగలనో నీవట్లుచేయుము. ఇదివఱకు నీకు నిచ్చిన గుర్తుగాక మఱియొక రహస్యమైన గుర్తు చెప్పెద వినుము. కోపముచేఁ గాకిని నొంటికంటిదానిగఁ జేసిన విషయముగాక యొకనాఁడు సంచరించునప్పుడు గండశైలమునందుఁ జెమటచే నా ముఖమున బొట్టు కరఁగి పోఁగా రాముఁడు ముఖములో నుండు నాకుఁ దానే ప్రేమతో మణిశిలను జూచి తిలక ముంచెను. అదికూడ స్మరింపు మనుము.

దీనివలన ముత్తైదువులు కొంచెము సేపైనఁ బొట్టు ముఖమునుండి లేకుండరా దనియు, నట్టి బొట్టు ముఖమును బురుషులు చూడరా దనియు చెప్పుచున్నది. తిలకములేని ముఖము శ్మశానమువంటిది. ఇందు కీసము పంచపాది.

తాత్పర్యము.

దశరథ రాజపుత్రా! నీ మనస్సు నిది యాకర్షింపజాలు శక్తి గలది కావున నీ నీటఁబుట్టిన మణిని నేను దాఁచియుంచితిని. ఇది నీ వియోగ మను వహ్ని నన్నుఁ గాలుచునపుడు నీటఁబుట్టినది కావున నీ చలువగుణము దీనియం దుంటచే నిప్పుడు నీవు చల్లార్చినట్లు నా విరహాగ్నిని వడి చల్లార్చును దీనిని జూచి నిన్నుఁ జూచినట్లే పొంగుదును. గావున దీనిని జూడఁగానే విరహానలము శమించును. దీనిని గూడ నెడఁ బాసితిని. ఇఁక నీకు దుఃఖసముద్రమునందు నేను ప్రాణము నిలఁబెట్టఁగలనని తోఁపదేను. అట్టైన నేల పంపితివందువా? ఇదివఱకు దీని దర్శనము నీ రూపమును స్మృతికిఁ దెచ్చుచుండెను. ఇప్పు డీ దేవోయి నిన్నుఁ బిలుచుకొని వచ్చునని నమ్మి పంపితిని. ఇది సముద్రమునఁ బుట్టినది కావున సముద్రమువలన బాధలేకుండ నన్ను రక్షించుచుండెను. ఇఁక నన్ను రక్షించువారెవరు? ఈ రత్నమును జూచినపుడంతయు నీవు స్మరణమునకు వచ్చుటచే దీనిని దాఁచితినని చెప్పుటచేఁ జూచినపు డంతయు భగవంతుని జ్ఞాపకముఁ జేయు పతకముగాని మఱి యేదైన చిహ్నముగాని దేహమున ధరింపవలయునని సూచన. అది పోవుట ప్రాణము పోవుటతో సమానము. కావుననే శ్రీకోదండరామ సేవక సమాజ సభ్యులు సీతారామ లక్ష్మణ పతకమును సర్వదా ధరించుచున్నారు. సీతాదేవి సర్వాభరణములు వదలి దీనిని మాత్రము ప్రాణపదముగా దాఁచియుంచెను. దానిని గూడ రామార్పణము గావించి సర్వస్వ నిక్షేపము గావించిన దన్యాను.*

ఆ. పడఁగ రాని యట్టి • పాటులఁ బడుచును, నాకొనంగ రాని • వార్త వినుచు
గుండె జల్లు మనఁగ • ఘోరరాక్షసులలో, నిన్నుఁ దలఁచి సైఁచి • యున్నదాన.

అర్థములు. నాకొనంగరాని = (౧) చెప్పరానంత నీచములైనవి. (౨) చెప్పరానన్ని సంఖ్య గలవి.

తాత్పర్యము.

ప్రాణి పడుటకు సాధ్యముగాని బాధ పడుచు నోటఁ జెప్పరాని మాటలు వినుచు గుండెలు జల్లు జల్లు మనుచుండ నీ దయలేని రాక్షసులలోఁ జిక్కుకొనియు నీవు కలవుకదా భయమేమి యని నిన్ను స్మరించి సహించి యున్నదానను,

దేహము ధరించిన ఫలము భగవంతుని స్మరణమే. దేహము లేదేని భగవత్స్మరణము లేదు. భగవంతుని స్మరించినఁగాని భగవత్ప్రాప్తి లేదు, కావున భగవత్ప్రాప్తికై దేహధారణము చేయవలయును గాని మనకై విడువరాదు. దాని సర్వప్రాకృత విషయములందు వినియోగ పెట్టరాదు. కావున నీ దేహము వదలి పోవులోపలనే భగవత్ప్రాప్తి కలుగు నుపాయము చేసికొనవలయును.

చ. ఒకనెల యెట్టులైన మని • యుండెద, నంతకు నీవు రాని చో
ప్రకటముగాఁగఁ బ్రాణములు • వాయుదు, రావణుఁ జూచినంతటన్

దశతర లాను నుండియును • దైన్యుఁడు బ్రహ్మాండు నాథ ! ఏ మనం
ఒకట! కరంగ జేని యది • యంతయు నా మందదృష్టమే సుమీ.

అర్థములు. మనియుండెదన్ = బ్రతికి యుండెదను; అంతవఱన్ = అంత కాలము వఱకు.

తాత్పర్యము.

ఎంతకష్టమొంది యైనను నొకనెల బ్రతికియుండెదను. (౧౪౩ వ.) ఈ లోపల నీవు రాకయుంటల ప్రాణములు తప్పక నామే పోవును. విలుప నాకు సాధ్యపడదు. ఆశ యను త్రాళ్ళచేఁ గట్టి యుంచినాను. అది తెగిపోయినా దానిని బిగఁబట్టు సాధనము లేదు. ప్రాణ మీల్ల పోవునంతనూ రావణుఁ డాడిన సూనృతమునకే నా ప్రాణములు తల్లడిల్లును. వాఁడు మహా క్రూరుఁడు, ఇంత చెప్పినను ఇప్పటికిని నీ మనస్సు కరఁగ దాయెనా యది నా పాప ఫలమే గాని నీ దోషముగాదు.

—• హనుమంతుఁడు మరలిపోవుటకు సీతాదేవిని సెల వడుగుట. •—

చ. అని కరుణంబుగా రమణి • నాడు మృగాయతనేత్రవాక్యముల్
విని పవమాననందనుఁడు • విన్ము సతీ ! శపథంబుఁ జేసెదన్
వనజదళాయతాంబకుఁడు • వక్త్రము నీ వెతఁ బాప్పు, చింతయున్
వనరెడి నిన్నుఁ బాసి, మనువాఁ, డది చూచి కృశించుచున్నవాఁడున్. ౧౧౪

అర్థములు. కరుణంబుగాన్ = శోకముతో - శోకము గలుగునట్లు.

తాత్పర్యము.

అని దుఃఖకరముగా మగనిని బల్కుచున్న సీతాదేవివాక్యములు విని హనుమంతుఁ డిట్లనెను. అమ్మా! నేను ప్రమాణము చేసి చెప్పుచున్నాను. నా మాట నమ్ముము. రామచంద్రమూర్తి యవశ్యము నీకష్టములఁ దొలఁగించును. నిన్నుఁ బాసి మొంగరయా దుఃఖించు చున్నాఁడు. అయన స్థితి చూచి లక్ష్మణుఁడును తపించుచు చున్నాఁడు.

శా. ఎట్టులో వినుఁ గంటి నిన్ను నింకఁ దల్లీ! దుఃఖకాలంబు గా
టట్టుం జెప్పను నిన్నుఁ జూచుతెయి ధాత్రీకాత్మజా! లంకనుం
బట్టన్ లగ్గలు రాఘవనాథుని దుర్వ్యాన్ నీవ కన్నార రా
పట్టీ! చూచెదు పోకు నాత్మనిష్ఠతోఁ • బన్నాతి నిశా సీటికిన్. ౧౧౫

అర్థములు. రాపట్టీ=రాచకూఁతురా. పట్టి శబ్దము బిడ్డ శబ్దము వంటిది గాని ఆఁడుబిడ్డ - మగబిడ్డ యున్నట్లు ఆఁడుపట్టి మగపట్టి యని ప్రయోగములు లేవు. సందర్భానుసారముగా నర్థము చేసికొనవలెను.

తాత్పర్యము.

తల్లీ! ఎంతో కష్టపడి నిన్ను నేనిందుఁ జూచితిని. ఇఁక నీవు దుఃఖింపవలసి

తాత్పర్యము.

అన్నా! ఆంజనేయా! నేను నీ యాపత్సముద్రమున మునిఁగియుంటి నిట్లు చెప్పిన రామచంద్రమూర్తి నన్ను రక్షించునో యట్లు చెప్పుము. అన్నా! మఱవకుము సుమా.

క. ఇన్నిచరాక్షసావళి, నన్ను భయము పఱచు విధము • నానావ్యసనా
పన్నత నేఁ గుందెడి గతి, విన్నప మొనరింపు నాదు•విభునకుఁ మంత్రీ! ౧౦౦౪

అర్థములు. నానావ్యసనాపన్నతన్ = పలువిధములయిన దుఃఖముల యాపత్తుచే.

తాత్పర్యము.

మంత్రీ! యీ రాక్షస స్త్రీలు నన్ను భయపెట్టు విధము నానావిధము లయిన దుఃఖములచే నేను బాధ పడుచుండు విధము నా మగనికి విన్నవింపుము.

ఇట్లు అంగీకరింపఁ బడినట్టి ప్రపన్నుండు సంసారములో నుండునట్టి స్థితిని పిరాట్టికి రావణుని గృహమునందుండు అశోకవనమున నుండి చూపించినది. అదెట్లనిన, పిరాట్టి రావణసంబంధ మెట్లో ఈతనికి దేహసంబంధమును అట్టిదే. పిరాట్టికి ఏకాక్షీ, ఏకకర్ణి మొదలగు రాక్షసస్త్రీ లెట్లో, ఈతనికి అహంకార మమకారములును అట్లే. పిరాట్టికి తనను పెరుమాళ్ళవద్దనుండి కొనిపోవఁ బిలిచిన మారీచుఁడు ఎట్లో, ఈతనికి విషయప్రావణ్య మట్టిది. త్రిజటస్వప్నాదుల నొసఁగిన రాక్షస స్త్రీ సంబంధము పిరాట్టి కెట్టిదో, ఈతని కళత్రపుత్ర సంబంధ మట్టిదే. పిరాట్టికి అంజనేయులవారి సంబంధ మెట్టిదో, ఈతనికి ఆచార్యుని దర్శనమును అట్టిదే. పిరాట్టికి శ్రీ యాంజనేయుల వా రొసఁగిన రామగుణకీర్తన మెట్టిదో, ఈతనికి ఆచార్యుండు పాయించిన గుణపరంపరయును నట్టిదే. పిరాట్టికి అంజనేయుఁ డిచ్చిన యుంగర మెట్టిదో, ఈతనికి ఆచార్యుండు ఉపదేశించిన తిరుమంత్ర మట్టిది. పిరాట్టి రామచంద్రుని యుంగరమునుజూచి దానిమూలముగ సుందరమగు వ్రేలిని, దానిమూలముగ బాహువులను వానిమూలముగ దివ్యమంగళ విగ్రహమును అనుసంధించుకొని, ప్రాణము లను ధరించియున్నట్లు శ్రీ వైష్ణవుండును, ఆచార్యుండు కృపచేసిన తిరుమంత్రము నొక్క యర్థమును అనుసంధించుకొని ధరించియుండును. పిరాట్టి లక్ష్మణస్వామితో పరుషముగ మాట్లాడిన మాట ఆమెను పెరుమాళ్ళను విడిచి దూరముగానుండునట్లు చేసిన చందమున, ఈతం డొనర్చినట్టి 'భాగవతాపచారము' ఈతనిని "క్షిపామి" "నక్షమామి" అను భగవన్నిగ్రహమునకు విషయముగాఁ జేసి పెరుమాళ్ళనుండి దూరముగానుండునట్లు చేసినది. పిరాట్టికి విరోధు లగు రావణాదులను వధించి పెరుమాళ్ళు ఆమెను గొనిపోవుట యెట్లో, అట్లే యీతనికి విరోధియగు ప్రకృతి సంబంధ మును జోఁగొట్టి పరేశ్వరుండు ఈతనిని పరమపదమునకుఁ గొనిపోయి నిత్యముక్తులతోఁ బాటు నిత్యకైంకర్యమున నుపయోగపడుచుకొనును. ఈ పదివాక్యలను అను

ఉ. సామము మేలు గాదు దను•జప్రకరంబుల పట్ల, దాన ము
ద్దామధనాఢ్యులందు ఫల•దంబును గా, దిటు భూరివిక్రమో
ద్దాము లభేదసాధ్యులు గ•దా, యటుగానఁ బరాక్రమం బొకం
డేమియుఁ జూడ యుక్త మని•యెంచెద ప్రస్తుత కార్యసంగతిన్. ౧౦౦౬

అర్థములు. ఉద్దామ ధనాఢ్యులందు = అధిక ధనముగల వారియందు, ఫలదంబు = ఫలమిచ్చునది, భూరి విక్రమోద్దాములు = అతిశయించిన పరాక్రమముచే గొప్పవారు, అభేద సాధ్యులు=భేదముచే సాధింప రానివారు, ఏమియున్ = ఏ విధముగ, ఇప్పటి కార్యసంగతిన్ = ఇప్పటి కార్యవిధమునకు.

తాత్పర్యము.

రాక్షసులు తమోగుణము విశేషముగఁ గలవారు. అట్టివారు మంచి మాటలను, ధర్మవాక్య శ్రవణములను సాధువుల వలె లోబడువారు గారు. దానమున వశపఱచి కొందఱ మనిన వారి యొద్దనే విశేషించి ధన మున్నది. ఇట్టి వారు ధనమునకు వశపడరు. అందఱు పరాక్రమ వంతులు. వీరిలో భేదోపాయము సాధ్యము గాదు. ఇఁక నాలుగవది యగు దండోపాయమే యిప్పటి కార్యస్థితినిబట్టి మాకుఁ దగి యున్నది.

'అనిత్యో విజయో యస్మాద్దృశ్యతే యుధ్యమానయోః
పరాజయశ్చ సంగ్రామే తస్మాద్యుద్ధం వివర్జయేత్.' మనువు.

సీ. కలహమున లక్ష్మిఁ గావించుఁ బ్రాణహానియును జేయు నింత నిక్కంబు
పలువు రొకని గోడి పాలుగ జిక్కును, లఘువు చేత ఘనుఁడు చెడుటయును ఘటించు.

క. జయమును గోరుచు మను ని,శ్చయ మొక్కఁడు లేదు వినుము సమరమునఁ బరా
జయము మరణంబుకంటెను న్యా,దయపుట భేదనము సేయుఁ దక్షుం డనఘా.

ఈ కారణముచే యుద్ధము మానుదుమా యనిన సీతాదేవి రామచంద్రునితోఁ జేర్చుటెట్లు? యుద్ధమునందుఁ బరాజయము వచ్చినఁ గార్యము చెడునేమో. ముందు రామచంద్రమూర్తి, వెనుక సీతాదేవి గాను చూడఁగా నాకుఁ బరాజయమెట్లు రాఁగలదు? 'యత్ర రామో భయం నాత్ర నాస్తి తత్ర పరాభవ' యనుట యుక్తి వాక్యము? నాకు సాహాయ్యము కలదని నేను ధర్మకార్యము చేయఁబూనితినా? ధర్మమేల చెడును? కావున యుద్ధమునకు సాహసించుటే తగిన కార్యము. దుష్టులకు భయపడి ధర్మము చెడుచుండఁ జూచుచుండ వచ్చునా? యుద్ధ మెప్పుడు నిషిద్ధము? అర్థకాంక్ష యన్యభార్యాపహరణమునకై, కేవలకీర్తికై బలములు రెండు సమానములై జయము సందిగ్ధమైనప్పుడు యుద్ధము నిషిద్ధము. తన ద్రవ్యముఁ దాను రాఁబట్టుకొనుటకై చేయు యుద్ధము నిషిద్ధము కాదు. అందు నాకు దైవ బలము గలదు. దేహ బలము గలదు. ధర్మబలము గలదు.

ఇట్టి నేనే శేషపాని శంకలచే యుద్ధమునకు జంకితినేని కార్య మెట్లు ?

కావున యుద్ధమునకు జంకరాదు. రామచంద్రమూర్తి యసహాయుఁ డను దురభి ప్రాయము రావణునకుఁ గలదు. దానిని తొలఁగించినఁ గాని వాఁడు మెత్తఁబడఁడు. వానిలో వారికి భేదములు పుట్టవు. కావున యుద్ధ మవశ్యకర్తవ్య మగుచున్నది.

చ. అసురులచేవమట్టు దెలి • యన్ గమనించెద నేని దంశమే
  చొసఁగను శుభోత్తరం బయి, మ • హేచ్ఛ ప్రయోజనకారి గాదు, రా
  క్షసవరవీరులం గెడపఁ • గా ననిఁ గొందఱ నున్నవార లీ
  దస మఱి మెత్తఁబాటు గొను • రాఘవు కార్య మకష్టసాధ్య మౌ. ౧౦౦౭

అర్థములు. చేవమట్టు = బలప్రమాణము. గమనించెదనేని, ప్రయత్నము చేసెదనేని, శుభోత్తరము = మిగుల మేలైనది, కెడపఁగాన్=చంపఁగా, అనిన్ = యుద్ధమందు, ఉన్నవారు=తక్కినవారు, అకష్టసాధ్యము=సులభ సాధ్యము.

తాత్పర్యము.

నేను మఱలి పోఁగానే రావణుని, రాక్షసులయు బలాబలము లే మాత్ర మని రామ సుగ్రీవులు తప్పక యడుగుదురు. దానికి నేను సరియైన ప్రత్యుత్తర మీయవలసి యుండిన రాక్షసు లే మాత్రము బలవంతులో తెలియ వలయును. ఇది యుద్ధమందుఁ దెలియఁ దగినదే కాని సామదానాదులఁ దెలిసికొన సాధ్యపడునది కాదు. అటుగాక యుద్ధమునకు నేను ప్రయత్నించుటవలన మఱియొక మేలు గలదు. ఇప్పుడు వీరు రామలక్ష్మణు లిరువు రసహాయులేమి చేయఁగలరని ధైర్యముతో నున్నారు. ఆ దురభి ప్రాయముఁ దొలఁగించి రామచంద్రమూర్తికి సుగ్రీవసాహాయ్యము గలదని ప్రకటించి యుద్ధమునఁ గొందఱఁ జంపితినేని తక్కినవారు ద్వేషము వదలి మెత్తఁబడుదురు. వారిలో వారి కభిప్రాయభేదము పుట్టును. అప్పుడు రామచంద్రమూర్తి కార్యము కష్టము లేక నెఱవేఱును.

ఉ. సీతను జూచి రమ్మనుచుఁ • జెప్పెను గాక రఘూద్వహుండు దు
  ర్నీతులతోడఁ బోరు మనె • నే యని దూఱ్చఁ దలంతు నేనియున్
  మాతఱు నీతమైన పని • తోఁ బలుకార్యములన్ ఘటించు నో
  ఖ్యాతిమనస్వి తత్ప్రకమ • కార్యవిరోధము లేమిఁ గన్గొనన్. ౧౦౦౮

అర్థములు. దుర్నీతులతోడన్ = నీతిదూలిన వారితోడ, నీతము = నియమింపఁబడినది, ఖ్యాతి = ప్రసిద్ధి కెక్కిన, మనస్వి = ధీరుఁడు, ఆలోచనాపరుఁడు, తత్ప్రకమకార్య విరోధము=మొదటి కార్యమునకు విరోధించినది.

తాత్పర్యము.

రామచంద్రమూర్తి సీతాదేవిని జూచి మాట్లాడి రమ్మనెనుగాని, యీ నీతి దూలిన వారితో నిచటకలహమునకు దిగు మనెనా యని యందువేని సీతాదేవి యేమి చెప్పెను. రామచంద్రమూర్తియే యిప్పటికి రావలె, రావణాదులఁ జంప వలెఁ దన్నుఁ దీసికొనిపోవలె నని పట్టుదలగాఁ జెప్పెను. ఈ మాట లేను జెప్పిన రాక్ష

నా మీఁదికిఁ బంపుము. ఆ శూరులు త్రిశూలములు, పట్టిసములు, భిండివాలములు గొని వత్తురు. వారి నందఱను ముక్కలు ముక్కలుగా నఱకివైచి సంతోషముతో గిష్కింధను జేరెదను.

—• హనుమంతుఁ డశోకవనంబుఁ బాడుచేయుట. •—

సీ. అని తలపోసి యం•జనపట్టి చెలరేఁగి, యుగ్రవేగంబున • ధారణీజ
తతులఁ బ్రభంజను•గతి మూలముట్టుగఁ; బడ నేయఁ గడఁగెను • బెదిదముగను
మత్తశకుంతస•మాఘుష్ట మగుచును, నానాద్రుమలతాళి • నవ్య మగుచు
ప్రమదావనం బెల్లఁ • బాడు పాడొనరించి, యాటమలల నెల్ల • నవనిఁ గలిపి
తే. కేళిసలిలాశయంబులఁ • గూలఁ ద్రోయఁ, దెగిన తీఁగలు విఱిగిన•యగచయంబుఁ
బాడుగొలఁకులు గనుచును • బ్రమదవనము, కారుచిచ్చునఁ గాలిన•కరణి నయ్యె.

అర్థములు. ధారణీజతతులన్ = వృక్షసమూహములను, ప్రభంజనుగతిన్ = వాయువువలె, మూలముట్టుగన్ = వేళ్ళతోడ, బెదిదముగను=భయము కలుగునట్లు, మత్తశకుంతసమాఘుష్టము=మదించిన పక్షుల ధ్వనులతోఁ గూడినది; ద్రుమ= చెట్లు, అటమలలు,=క్రీడా పర్వతములు, కేళి సలిలాశయంబులన్=క్రీడా సరస్సులను, 'ద్రవ కేళి పరీహాసాః క్రీడా లీలా చ నర్మ చ' అమరము. 'కేలీ కేళి' రని ప్రోక్తా. ద్వి.కో. రెండు రూపంబులుగలవు. అగచయంబు = చెట్ల సమూహము, ప్రమద వనము = స్త్రీలు విహరించు తోఁట, ప్రమదవనము ప్రమదావన మని రెండు రూపములు గలవు.

తాత్పర్యము.

ఈ ప్రకార మాలోచించిన వాఁడై హనుమంతుఁడు విజృంభించి తొడలవేగము చేత మహావాయువువలె చెట్లను వేళ్ళతోడ నేలఁబడవేయ నారంభించెను. మదించిన పక్షుల ధ్వనులు గలదై నానావిధములైన, చెట్లు తీఁగలు గలిగిన ప్రమదావనమును పాడుచేసి, క్రీడా పర్వతముల నెల్ల నేలపాలుచేసి, క్రీడా సరస్సుల విఱుగఁ ద్రోయఁగా తెగిన తీఁగలు, విఱిగిన చెట్లు, పాడైన సరస్సులు గలదై, యా వనము కారుచిచ్చున గాలి నట్లయ్యెను.

క. కూఁకటివేళులతోడం, బ్రాఁకుం బట్లెల్ల నేలఁ • బడఁగ లతాళిన్
ప్రాఁకులతోఁ బెఱికెను, భీతిన వడఁకాఁగ చెలుల•తీరున నంతన్. ౧౦౧౯.

అర్థములు. ప్రాఁకుంబట్లు = తీఁగ లల్లుకొనుటకు పనికివచ్చు చెట్లు- ప్రాఁకు + పట్లు = ప్రాఁకుంబట్లు - భీతిన్ = భయముతో, చెలుల తీరునన్ = స్త్రీలవిధమున.

తాత్పర్యము.

నేలఁ బాఁకుకొన్న తల్లిచెట్లతోఁ దా నల్లుకొనుటకు నాధారముగ నుండిన

చె ట్లన్నియు నేలఁబడఁగా వాని కొమలయందుఁ గీఁగలు దిక్కుచెడిన స్త్రీలు భయముతో వణఁకినట్లు వణఁకుచుండెను,

క. వ్యాళంబులు నలఁగెను జిత్రాలయములుః బాదపటింపు • లశ్మగృహంబుల్
కూలెను బ్రీలెను, కూలెను, నేలను గదుగోర మగుచు • నేత్రంబులకున్.౧౧౧౭

అర్థములు. వ్యాళంబులు=పాములు, అశ్మగృహంబుల్=రాతియిండ్లు,

తా త్ప ర్య ము.

చెట్లు పడుటచే వానిసందునఁ బడి పాములు నలఁగి చచ్చెను. చిత్రగృహములు నేలఁగూలెను. పాదపటింప్లు బ్రీలిపడెను. రాతియిండ్లు నేలఁ గూలిపడెను. ఇవంతయుఁ జూచుటకు ఘోరముగ నుండెను.

క. దనుజేశ ప్రమదావన, మను ప్రమదావనము మూలముట్టుగ నాశం
బొనరిచి యలరుచుఁ గలనికి, హనుమంతుఁడు తోరణాగ్ర•మందు వసించెన్.

అర్థములు. దనుజేశ = రావణుని, ప్రమదా+అవనము = స్త్రీలకు సంతోషకరమైన భోగస్థానము, ప్రమదావనము=ఉద్యానవనము, మూలముట్టుగ = మొదలంట, అలరుచున్ = సంతోషించుచు, కలనికిన్ = యుద్ధమునకుఁగాను, తోరణాగ్రమందు = ఆ వనము తలవాకిటి మీఁద.

తా త్ప ర్య ము.

రావణాసురుని భార్యలకు భోగస్థానమైన యుద్యానవనమును మొదలుముట్ట నాశముచేసి, సంతోషించి యుద్ధమున కెదురు చూచుచు నాఁగోట తలవాకిటిమీఁద నాశ్రయించెను.

-• ౪౨వ సర్గము. రాక్షసస్త్రీలు హనుమంతునివృత్తాంతము సీతాదేవి నడుగుట. •.

క. పక్షులబహుళారవమున, వృక్షంబులు గూలుధ్వనుల • నెఱిఁగొని లంకన్
రాక్షసు లందఱు దిగ్భ్రమ,వీక్షించిరి యొకరి మొగము•వేఱొక రంతన్. ౧౧౧౮

అర్థములు. బహుళ+ఆరవము=విస్తారధ్వని.

తా త్ప ర్య ము.

ఆకాశమునకు గుంపులు గుంపులుగ నెగిరి కూయు పక్షుల ధ్వనులచేతను, దభాలు దభా లని పడుచున్న చెట్ల చప్పుడులచేతను లంకలోనుండు రాక్షసులందఱు భయపడి దిక్కు తోఁపక, యది యేమైనది తెలియక యొకరి ముఖము నొకరు చూచుచుండిరి.

ఉ. క్రూరనిమిత్తముల్ దెలుపు•కూఁతలు చెట్లనుఁ బాసెఁ బక్షులున్
క్రూరమృగంబు లాదిగ ది•గుల్ పడి మేల్కని రాక్షసాంగనల్
ఘోరతరాకృతిన్ దెలియ•క్రోఁతిని బా డెను చున్న నిష్కుటం
బారసి చూచె నేగ జన•కాత్మజఁ జేరఁగఁ బాఱుచుండఁగన్. ౧౦౨౦

తెలియును. రాక్షస కృత్యములు రాక్షసులకు మాత్రమే తెలియవలయు నని భావము.

తాత్పర్యము.

పాముల కాళ్ళు పాములకే గదా తెలియును. అట్లే రాక్షసుల మాయలు రాక్షసులకైన మీకే తెలియును గాని నాకెట్లు తెలియును. నాకుఁగూడ మనస్సు కలవరపడుచున్నది. ఏ రాక్షసుఁడీ మాయరూపము ధరించెనో.

ఇచ్చట సీతాదేవి యసత్యము చెప్పె ననుట నిర్వివాద విషయము. సీతాదేవి వంటిది కొల్లసత్యమాడ సాహసించెను. అసత్యదోష మామెకుఁ గలదా, లేదా యని విచార్యము. ఎట్టిది సత్యము ఎట్టిది యసత్యము అను విషయము పూర్ణముగఁ జర్చింప గ్రంథవిస్తర భీతి బాధించెడిని గావున సారాంశము తెలుపఁబడును. ప్రతి మనుష్యుఁడు నిత్యము ననుష్ఠింపవలసిన యమములు ఐదు ముఖ్యమైనవి యున్నవి. అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము. తక్కిన నాలుగింటికి అహింస తల్లి, సత్యాదులు దాని బిడ్డలు. వేదసమ్మతములైన స్మృతీతిహాసపురాణ వాక్యములు శ్రేష్ఠ ప్రమాణములో, వేదవిరుద్ధ స్మృతీతిహాసపురాణవాక్యము లట్లప్రమాణములో యట్లే అహింస ననుసరించిన సత్యాదులు గ్రాహ్యములు. తద్విరుద్ధములు త్యాజ్యములు. మన సత్యమువలన నిరపరాధికి నిష్కారణముగ హింస కలుగు నట్లుండిన నట్టి సత్యము చెప్పరాదు. అసత్యమే చెప్పవలెను. దొంగతనము చేయక పోవుటచేఁ దన ప్రాణము పోవునట్లుండు సమయమునఁ విశ్వామిత్రునివలె దొంగిలించి ప్రాణరక్షణము చేసికొనుట తప్పుగాదు. ఋతుకాలమందుఁ దన భార్యతో సంగమింప వలసిన పురుషుఁడు నిష్కారణముగ మాని భార్యకు మనః సంకటము కలిగించెనేని వాఁడు స్త్రీ హింస చేసినవాఁడే. కామక్రోధములకు దాసుఁడై యుధిష్ఠిరునివలె నసత్యమాడుట దోషము. ధనార్జనముకై దొంగిలించుట దోషము.

శూద్రవిట్క్షత్ర విప్రాణాం, యత్రర్తోక్తౌ భవేద్వధః

తత్ర వక్తవ్య మనృతం, తద్ధి సత్యా ద్విశిష్యతే॥ మను. ౮-౧౦౪.

సత్యము చెప్పిన యెడల నిష్కారణముగ నిరపరాధు లగు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులకు వధము సంప్రాప్త మగు నేని యప్పు డసత్యమే చెప్పవలయును. అది సత్యమున కంటె శ్రేష్ఠమైనది.

'న నర్మ యుక్తం వచనం హినస్తి, న స్త్రీషు రాజన్ నవివాహకాలే

ప్రాణాత్యయే సర్వ ధనాపహారే పంచానృతా న్యాహు రపాతకాని.'

భారతము.

'వివాహకాలే రతి సంప్రయోగే, ప్రాణాత్యయే సర్వ ధనాపహారే

విప్రస్య చార్థేఽప్యనృతం వదేయుః పంచానృతా న్యాహు రపాతకాని'

దురుద్దేశము లేని హాస్యమునందును, స్త్రీల విషయమునందును, వివాహ కాలమందును, ప్రాణాపాయము సంభవించునప్పుడును, తనసర్వధన మపహృతమగు

నప్పుడును నీ నైజము విషయంబుల నసత్య మాడుట వలనఁ బాపము లేదు. సత్య మాడి నచో హానికర మని తోఁచిన నసత్యమాడ వచ్చునే కాని యసత్యమే యాడవలయు నను నిర్బంధము లేదు.

హనుమంతుఁడు సీతాదేవికిఁ బ్రత్యుపకార మపేక్షింపని యుపకారి. గౌరవ మిత్రుఁడు. నిరపరాధి – అట్టివానికి సత్య మాడుటచే నివార్యాణముగ హింస కలుగు నేని, సీతాదేవికిఁ బాపము వచ్చునే కాని సత్య మాడిన ఫలమురాదు. సత్యము చెప్పుటచేఁ దనకును, బ్రాణాపాయము గలదని భయపడెను. కావున నామె యసత్యము నకు నసత్యఫలము లేదు.

ఈ విధముగ రామచంద్రమూర్తియు (అయోధ్య ౧౧౩) సుగ్రీవుఁడు హనుమంతుఁడు నసత్య మాడినవారే.

—• రాక్షసస్త్రీ లశోకవనంబు పా ఱగుట రావణునకుఁ దెలుపుట. •—

సీ. ఏ తెంచెనో! యన • సీతోక్తులను విని, భయపడి కొందఱు • పాఱి రందు
నిలిచిరి కొందఱు • నెవ్వడి నసురాధి, పతికిని దెలుపంగ • పతులు గొంద
ఱరిగి రావణుఁ గాంచి • యవధారు దైత్యేశ! వికట వానరరూపి•వీఁ డొకఁడు
జనకజతోడుతఁ • జనవున ముచ్చట లాడి యశోకవ•నాంతరమున
ఆ. నిలిచియున్నవాఁడు • నిర్జరనాథుని, దూతయో కుబేరు • దూత యొక్కొ-
సీత నెమకఁ బంపు • శ్రీరాముఁ డంపిన, దూతఁ డేమొ తెలియ•దుర్ఘటంబు.

అర్థములు. నెవ్వడి = నెఱ + వడి = మిగుల వేగముగ, అవధారు='అవధారు – దీనికి వినుము అర్థమనియు 'అవధారణమ్' ప్రకృతి యనియు సీతారామా చార్యులవారు 'అవధారయ' (చిత్తగింపుము) 'అవధారయతు' (చిత్తగించును గాక) అను సంస్కృత క్రియా పదములకుఁ గ్రమముగా 'అవధారు–అవధార అని ప్రాకృత రూపములు. రెండవది రూపమునను, మొదటి యర్థమునను "అవధారునను" చేర్పఁగా నున్నవి. రెండవదియే యిట్లు అర్థమునకుఁ గూడి మాఱి యుండును. (సర్వంకష వ్యాఖ్య – శృంగార నైష. ౮–౯౦)

తెనుఁగునందు వర్గయుక్కులు లేవు. అయినను అవధారు – వసనాభి-జఱభి యను మూఁడు పదములందు వర్గయుక్కులు గాన నయ్యెడి.

తాత్పర్యము.

రాక్షసస్త్రీలు సీతాదేవి చెప్పిన యీ మాటలను విని కొందరు భయపడి పరు వెత్తిరి. కొంద ఱందే నిలిచిరి. కొందఱు మిగుల వేగముగ రావణాసురునికిఁ దెలుపఁ బోయి రావణుఁ గాంచి రాజా! చిత్తగింపుము. భయంకరమైన వానరరూపము గల వీఁ డొకఁడు సీతతో మచ్చికగా ముచ్చటలాడి యశోకవనము నందున్నవాఁడు, వాఁ డింద్రుని దూతయో, కుబేరుని దూతయో సీతను వెదకుటకొఱకు వచ్చిన శ్రీరాముని దూతయో తెలిసికొన శక్యము గాకున్నది.

లకారాగమము కానవచ్చెడి, 'అందులను ధరణీగ లన్నువనందను'లని భారత ప్రయోగము కలదు.

తాత్పర్యము.

నీ వనము పాడుచేసిన వానికిని, సీతను బలుకరించిన వానికిని క్రోధించి వానికి వాని ప్రాణ రడఁగునట్లు కఠిన దండము గావింపుము.

క. నీ వలచి యున్న చేడియతో వాసవముఖన ! పలికి • తోడన వెంయితోఁ
బోవచ్చునె యిదెడే? వనఁ,గా విని మండిపడెఁ బంక్తి•కంఠుం డనుకన్. ౧౦౨౯

తాత్పర్యము.

నీవు కోరియుండు నాయకురాలితో మఱియొక పురుషుఁడు వచ్చి మాటలాడి సెలవుఁడైనఁగాని దేహముతో నుండవచ్చునా ? యని చెప్పఁగా విని కోపముచే రావణుఁడు మండిపడెను.

—• రావణుఁడు హనుమంతునిమీఁదికిఁ గింకరులఁ బంపుట. •—

క. కోపావర్తితనేత్రుం,డా పంక్తిగ్రీవుకనుల • వ్రశ్రులు రాలెన్
దీపంబునుండి పడుచుఁ, దైపంబుఁ బడు తైలబిందు•పటలం బనగన్. ౧౦౩౦

అర్థములు. కోపావర్తితనేత్రుండు = కోపముచేఁ దిరుగుచున్న కన్నులు గలవాఁడు, పటలము = సమూహము.

తాత్పర్యము.

కోపముచే గిరగిర దిరుగు కన్నులు గలవాఁడైన రావణుని కన్నులనుండి దీపము నుండి పడుచు మీఁద మీఁదఁ బడు చమురు బొట్లవలె నీళ్ళు రాలెను.

మ. తనతోఁ దుల్యులఁ గింకరాఖ్యుల మహా•దర్పాంధులన్ వాయునం
దనుఁ బట్టన్ రతిబాధినేత పనుపన్ • వా రుగ్రులై కూటసా
ధనఖడ్గాదికహస్తులై పెను మహా•దంష్ట్రాకరాళోదర
స్వనరూపద్రవిణంబు లొప్పఁ గదిసి • సంగ్రామలోలాత్ములై. ౧౦౩౧

అర్థములు. దర్పాంధులన్ = బలగర్వముచేఁ గన్నులు గానని వారిని, కూటము = సమ్మెటవంటి ఆయుధము. మహాదంష్ట్రాకరాళ = పెద్దకోఱలు, గట్టి పన్నులు, ఉదర = కడుపు - స్వన = ధ్వని - రూప = ఆకారము - ద్రవిణంబు = బలము - సంగ్రామలోలాత్ములై = యుద్ధమునం దాసక్తి గలవారై, తాను స్త్రీలతో విహరించు నుద్యానము పాడైన దని విని కోపమైన రావణుఁడు వచ్చునని హనుమంతుఁడు తెలియనుగాని యొకఁడు సముద్రము దాఁటి లంకలోఁ బ్రవేశించి యంతఃపురముఁ జొచ్చి సీతతో మాటలాడి యుద్యానవనము పాడుచేసెనని వినఁగానే యది రామ పక్షమువారి గొప్ప యుద్ధప్రయత్నమునకు సూచనగాఁ దలఁచి రావణుఁడు తాను బోర సేనలను బంపెను.

తా త్ప ర్య ము.

తనతో సమానులైనవారిని కింకరులను పేరుగల వారిని మహాగర్వముచేఁ గన్నులు గానని వారిని, జూచి మీరు పోయి యా క్రోఁతిని బట్టుకొని రండని పంపఁగా వారు కూటములు ఖడ్గములు లోనగు నాయుధములు దీసికొని పెద్దకోఱలు మిట్టపండ్లు - కనుపులు - కంఠధ్వనులు - ఆకారములు బలము గలవారై యుద్ధకాంక్షచే.

చ. ఎనుబదివేల దైత్యవరు • లేకముఖంబుగఁ దోరణస్థితున్
హనుమను జూచి కాంచనక • నత్పరిఘోగ్రకృపాణదీప్తతో
పనిచయశూలముద్గరసు • పట్టిసతోమరశక్తి తాడితాం
గునుఁగ నొనర్ప నాతఁడును • గొండవలెన్ మెయి నెంచి క్రుద్ధుఁడై. ౧౦౩౩

అర్థములు. కాంచనకనత్ = బంగారుతోఁ బ్రకాశించు

తా త్ప ర్య ము.

ఎనుబదివేలమంది రాక్షసు లేకముఖముగా వచ్చి తోఁటద్వారము మీఁద నున్న హనుమంతుని పైఁబడి బంగారుతోఁ బ్రకాశించు గంప్రగొడ్డండ్లతో,కత్తులతో మండుచున్న బాణసమూహములతో శూలములతో ఇనుప గుదియలతో అడ్డకత్తులతో చిల్లకోలలతో శక్తులచేఁ గొట్టఁగా నాయనయుఁ గోపించి కొండవలె దేహము పెంచి.

—• హనుమంతుని జయఘోషము. •

తే. వాల మల్లార్చి జాడించి • వసుధ మోఁది, యార్భటించిన నా గర్జ • కఖిలపురము
నిండి మ్రోన్గెఁ బక్షులు • నింగి కెగసి, గుండెలగలంగ ధారుణిఁ • గూలెనప్డు.

అర్థములు. అల్లార్చి = ఆడించి, మోఁది = కొట్టి, ఆర్భటించినన్ = సింహనాదము చేయఁగా, మ్రోన్గెన్ = ప్రతిధ్వనులిచ్చెను. నింగికిన్ = ఆకాశమునకు అగలంగన్ = పగులఁగా.

తా త్ప ర్య ము.

తోఁక యూడించి జాడించి నేలపైఁ గొట్టి సింహనాదము చేయఁగా నా ధ్వనికి లంకయంతయుఁ బ్రతిధ్వని యిచ్చెను. పక్షులాకాశమున కెగసి గుండెలు పగిలి నేల వ్రాలెను.

చ. జయము జయంబు రామునకు • సారపరాక్రమధన్యమూర్తికిన్
జయము జయంబు విద్విషద • సహ్యతరస్వి సుమిత్రపట్టికిన్
జయము జయంబు దాశరథి • సంపరిపాలితుఁడౌ వలీముఖో
చ్చయపతి సూర్యపుత్రునకు • సాహసవిక్రమకీర్తిశాలికిన్. ౧౦౩౪

అర్థములు. సారపరాక్రమధన్యమూర్తికి=శ్రేష్ఠమైన పరాక్రమముచే ధన్యమైన యాకారముగలవానికి-విద్విషత్ =శత్రువులకు, అసహ్య=సహింపరాని, తరస్వి = బల

శాలి-మత్వర్థీయమైన ఇనిచ్ప్రత్యయము. మాయా-మేధా-స్రజ్ శబ్దములకును ఇకా రాంత శబ్దములకును చేర్పబడును. పాణిని ౫-౨-౧౨౧. స్రగ్వీ-మేధావి-మాయావి తపస్వి-యశస్వి-యశస్వి లోనైనవి. "అస్మాయామేధా స్రజో వినిః" అని సూత్రము. దాశరథి = రామలక్ష్మణులచే; సంపరిపాలితుఁడు = చక్కఁగాఁ బరిపాలింపఁ బడు వాఁడు, కేవల పాలితుఁడు గాక-పరిపాలితుఁడు గాక సంపరిపాలితుఁ డనుటచే సేవ కులవలెఁ గాక-బంధువులవలెఁ గాక యుపాసకులు రెంటను రామచంద్రుఁడు చక్కఁగా నేలోపము లేక రక్షించువాఁడని యర్థము. వలీముఖోచ్ఛయ పతి=వానర సమూహమునకుఁ బ్రభువు. సాహస విక్రమ కీర్తిశాలికిన్ = సాహసముచేతను, పరా క్రమముచేతను, కీర్తిచేతను బ్రకాశించువానికి.

తాత్పర్యము.

దృఢ పరాక్రమముచే దివ్యమైన రూపము గల శ్రీరామచంద్రమూర్తికిని, శత్రువులకు సహింపరాని బలముగల లక్ష్మణునకును, రామలక్ష్మణులచే చక్కఁగా రక్షింపఁబడు వానరనాథుఁడై తెంపు, పరాక్రమము, కీర్తిగల సుగ్రీవునకు జయము కలుగును గాక, జయము కలుగును గాక.

ఉ. దాసుఁడ సర్వసద్గుణవి•తానమనోహర రామమూర్తికిన్
కోసల దేశవల్లభున•కున్ హతశత్రుఁడ వాయుపుత్రుఁడన్
నా సరి గారు సంగరము•నన్ దశకంఠులు వేవు రేనియున్
వాసి యడంతు శైల ద్రుమ•పాళుల శే హనుమత్సమాఖ్యుఁడన్ ౧౦౩౫

అర్థములు. సర్వ సద్గుణవితాన = సమస్త కల్యాణగుణ సమూహముచే - మనోహర = మనస్సు నాకర్షించు - దాసుఁడన్ = కింకరుఁడను. ఇట్లు చెప్పుటచే నేను జీతముఁ గోరి, భక్తిఁగోరి దాసుఁడఁ గాలేదనియు, శ్రీరామమూర్తియందుఁగల కల్యాణగుణములు నా మనస్సు నాకర్షించుటచే దాస్యము నా స్వరూపము గాన నాయనను సేవించు చున్నా ననియు భావము. వేవురు = వేయిమంది - లక్ష్మణుని వాక్యములు స్మరించునది. (కిష్కింధ. ౧౩౫ వ. వ)

తాత్పర్యము.

సమస్త కల్యాణ గుణములచే మనోహరుఁడు, కోసలదేశ ప్రభు వగు రామ చంద్రమూర్తికి నేను దాసుఁడను. శత్రుసంహారకుఁ డగు వాయుకుమారుఁడను. హనుమంతుఁ డను పేరుగలవాఁడను. వేయిమంది రావణులైనను యుద్ధమునను నాతో సరిగారు. శైలచేతను చెట్లచేతను, శత్రువుల సంహరింతును.

ఈ రెండు పద్యముల మూల శ్లోకములు దుర్విప్రయోగముల నెల్ల హరించు నని యనుభవజ్ఞులు, పెద్దలు చెప్పిరి. ఎవరైన నేదైన క్షుద్రశక్తి ప్రయోగముచేసినా రని భయపడు వా రీ రెండు శ్లోకములను గొన్ని నాళ్ళు విడువక దిన మంతయు జపించిరేని యా ప్రయోగము చెడును. దుష్టస్వప్నములు వచ్చినను భయపడరాదు.

క. ధ్వంసముఁ జేసి లంకను, హింసించి సమస్తరాక్ష•సేంద్రుల సీతా
హంసీయానకు బ్రొక్కి ప్ర, శంసితగతిం జనెద ముదిక•సకలసురాళుల్. ౧౦౩౬

తాత్పర్యము.

లంకను ధ్వంసము చేసి రాక్షసుల నందఱ హింసించి సీతాదేవికి బ్రొక్కి రాక్షసు లేడ్చుచుండఁగాఁ గీర్తికర మైన విధమునఁ బోయెదను.

క. అని ఘోషించిన దనుజులు, మనమున బెగ డొంది సంజ•ను బ్బిన విరివిం
గొను కపిపై నృపు నానతి, ఘనసాధనచయము వృష్టి•గాఁ గురియంగన్. ౧౦౩౭

అర్థములు. బెగడొంది = భయపడి, విరివింగొను = వెడలుపైన, వృష్టి = వర్షము.

తాత్పర్యము.

ఈ ప్రకారము ధ్వనింపఁగా రాక్షసులు భయపడి సంధ్యవేళ సిద్ధముగా వ్యాపించు మబ్బువలె దేహము పెంచి యున్న వానరుని మీఁద రాజాజ్ఞప్రకారము వర్షముగా నాయుధములఁ బ్రయోగించిరి.

'బెగడొంది రాజు నాజ్ఞ' యనుటచే భయపడి పరువెత్తఁ దలంచియు నూరక పోయిన రావణుఁడు చంపునే యని యుద్ధము చేయ సాహసించి రని భావము.

తే. తోరణాశ్రిత మైయున్న•దొడ్డయినుప, గుదియఁ గైకొని పెనుఁబన్న•గుని గ్రహించి
తిరుగు గరుడుని పోలికఁ•దిరిగి తిరిగి, యసురబలముల నెల్ల నుఱు•మాడెఁ గపియు.

అర్థములు. తోరణాశ్రితమై యున్న = తోఁటవాకిట నున్న, ఆ తలుపులు వేయునప్పుడు బిగించుటకై యుంచిన పెద్ద గడియప్రమాను.

తాత్పర్యము.

ఉద్యానద్వారమునం దున్న పెద్ద యినుప గుదియను దీసికొని సర్పమును బట్టుకొని తిరుగు గరుత్మంతునివలెఁ దిరిగి తిరిగి యా రాక్షసుల నెల్ల నుగ్గుగాఁ గొట్టెను.

క. కింకరకాండంబుల నని, బొంకం బడఁగించి యుద్ధ•మునఁ బుట్టుతమిన్
శంకింపక రక్షోతిభ, యంకరుఁడై తోరణంబు•నందుం జేరెన్. ౧౦౩౯

తాత్పర్యము.

ఈ ప్రకారము కింకర సమూహముల నెల్లఁ జంపి యుద్ధమునందలి కోరికతో భయంకర రాక్షసులకు భయంకరుఁడై తోరణమునందు మఱలఁబోయి కూర్చుండెను.

దీనివలన నొక్క రామకింకరు నెదుట వేలకొలఁది రావణ కింకరులు తమ్మ-వేదాంతిరాక్షసులు నిలువఁజాలరని యేర్పడెను.

చ. హనుమకు నోడి బెగ్గడిలి • ప్రాణభయంబునఁ బాఱి రాక్షసేం
ద్రుని గృహమందుఁ దూఱి నుడి•తొట్రిలఁ జచ్చిరి సర్వకింకరుల్
దనుజవరేణ్య ! యన్న విని • దారుణరోషణభీషణుండు లో
చనములఁ ద్రిప్పి గిర్రన న•జయ్యనిఁ బంచెఁ బ్రహస్తపుత్రకున్. ౧౦౪౦

క. దుర్భరరవరయము శ్రవో, గర్భంబులు చీల్చ నసుర • కాండములకుఁ బ్రా
విర్భూతామర్షంబున, నార్భటి సలిపెను రక్ష • కావళి ప్రసక్తిన్. ౧౦౪౪

అర్థములు. దుర్భర రవరయము=అధికమైన ధ్వనియొక్క వేగము; శ్రవో గర్భంబులు=చెవులగూబలు; కాండములకున్ = సమూహములకు, ప్రావిర్భూతామర్షంబునన్ = మిక్కిలి పుట్టిన రోషము, ఆర్భటిన్ = సింహనాదము, రక్షః కావళి= కావలివాండ్ర సమూహము.

తాత్పర్యము.

సహింపరాని ధ్వనివేగము రాక్షస సమూహముల చెవుల గూబలు పగులఁ జీయఁగా మిగులఁ గోపంబున రాక్షసులు మూర్ఛపోవునట్లు సింహనాదము చేసెను.

చ. జయము జయంబు రామునకు • సర్వమహాస్త్రవిదగ్రవర్తికిన్
జయము జయంబు విద్విషద•సహ్యతరస్వి సుమిత్రపట్టికిన్
జయము జయంబు దాశరథి•సంపరిపాలితుఁ డౌ వలీముఖో
చ్చయపతి సూర్యపుత్రునకు • సాహసవిక్రమకీర్తి శాలికిన్. ౧౦౪౫

అర్థములు. సర్వమహాస్త్ర విదగ్రవర్తికిన్=అన్ని మహాస్త్రములను దెలిసిన వారిలో శ్రేష్ఠునికి.

తాత్పర్యము.

౧౦౩౪ వ. ప. చూచునది.

ఉ. దాసుఁడ సర్వసద్గుణవి•తానమనోహర రామమూర్తికిన్
గోసలదేశవల్లభున•కున్ హతశత్రుఁడ వాయుపుత్రుఁడన్
నా సరి గారు సంగరము•నన్ దశకంఠులు వేవు రేనియున్
వాసి యడంతు శాల ద్రుమ•పాళుల నే హనుమత్సమాఖ్యుఁడన్. ౧౦౪౬

తాత్పర్యము.

౧౦౩౫ వ. ప. చూచునది.

క. ధ్వంసంబుఁ జేసి లంకను, హింసించి సమస్తరాక్ష•సేంద్రుల సీతా
హంసీయానకు మ్రొక్కి ప్రశంసితగతిఁ జనెద మిగుల • సకలసురాళుల్. ౧౦౪౭

తాత్పర్యము.

౧౦౩౬ వ. ప. చూచునది.

—• హనుమంతుఁడు చైత్యపాలకులఁ జంపుట •—

మ. అని గర్జింపఁగఁ జైత్యపాలకశతం • బా నాదమాలించి హృ
జ్జనితామర్షము పెర్మిఁ బట్టుకొని శ•స్త్రప్రాసకుంతాదులన్
హనుమంతు న్వడి నొంప గంగ సుడిగుం•డం బో యనం గ్రాలె నా
దనుజస్తోమము కీశవర్యుఁడును రౌ•ద్రస్ఫూర్తి సాటోపుఁ డై. ౧౦౪౮

అర్థములు. చైత్యపాలక శతంబు = దేవత గుడిని రక్షించు కావలి వారి గుంపు. హృత్ + జనిత + అమర్షము = హృదయమునందుఁ బుట్టిన కోపము-ప్రాసము = ఈఁటె; పట్టిసము = ఈఁటె; ఈ రెంటికిని నాకారములందుఁ గొంచెము భేదము. సాటోపులై = ఆటోపముతోఁ గూడినవారై.

తాత్పర్యము.

అని సింహనాదము చేయుఁగా నా దేవాలయము కావలి వారిగుంపు ఆ ధ్వని విని కోపాతిశయమునఁ బట్టు మట్టుకొని యీఁటెల చేతను ఇతర సాధనముల చేతను హనుమంతుని నొప్పింప వచ్చిను ఆ రాక్షసుల గుంపు గంగయందలి సుడిగుండమువలె నాయెను. వానరేంద్రుఁడును ఆటోపముతోఁ గూడినవాఁడై, భయంకరుఁడై.

సీ. ప్రాసాదమునను స్తం•భంబును బెకలించి, గిర గిర మన చుట్టి•తిప్పి వేగ
రముగ వేవిధముల • రభసంబునను ద్రిప్పఁ, దజ్జాతశిఖిశిఖో•త్కరము గవిసి
ప్రాసాద మెల్లను • భస్మంబుఁ గావించి, వాయుసూనుండు దై • తేయశతముఁ
గాలుని పురి కనిపి • గగనంబునను దాఁటి, యిట్లను బిగ్గర• గొల్ల వినఁగ
తే. వినుఁడు నావంటివారలు • వేలకొలఁదు, లవని వర్తింపు చున్నార • లవనిజాత
నెమక సుగ్రీవవశవర్తు • లమితబలులు, వానరేంద్రులు లంకాని•వాసులార !

అర్థములు. రభసంబునను = వేగముగ, తజ్జాత = ఆ త్రిప్పుటచేతఁ బుట్టిన, శిఖిశిఖోత్కరము = అగ్నిజ్వాలల సమూహము, ప్రాసాద మెల్లను = ఎల్లప్రాసాదమును, ఎల్ల శబ్దము ప్రశాంతమైన యవ్యయము.

తాత్పర్యము.

అతివజముఁ బట్టియుంచిన గుడియు చిన్నదని తోఁచుటచే దేవళమందలి ధ్వజ స్తంభమును బీఁకి కన్నులకుఁ గానరాకుండునట్లు వేయిమార్లు గిరగిర త్రిప్పఁగా నా వేఁడిమి జనయించిన యగ్నిజ్వాలలు ఆ దేవాలయమును భస్మము గావించెను. అంతట దాని కావలి రాక్షసులఁ జంపి యాకాశమున కెగిరి యందఱు వినునట్లు గట్టిగా నిట్లనెను. ఓ లంకా నివాసులారా ! వినుఁడు. నావంటివారు వేలకొలఁదులు వానరులు సుగ్రీవుని లోబడి మహా బలము గలవారు సీతాదేవిని వెదకు చున్నారు.

సీ. పదివేనుఁగులపాటి • బలియురు కొందఱు, కొందఱు నూ ఱేనుఁ•గుల బలంబు
దనరినవా రిభ•దశశతబలయుతుల్, కొందఱు వాయువే•గులును గలరు
అప్రమేయబలాఢ్యు • లర్కజాధిపు పట్టి నంగిన ఋక్షనా•థులఁ గపుల
నూఱులు వేలును • నూఱువేల్ కోట్లును, బదికోట్లు నెన్నంగఁ • బాటిగాని
తే. వారిఁ గొనివచ్చు నానరు•వచ్చుఁ గాన, నేయుఁబలుఁడు సుగ్రీవుండు•నిమ్ముఁ జంపు
రామచంద్రునితోడ వై•రమును గొంటి, రింక నెచ్చటి రావణుఁ • డెచటిలంక!

అర్థములు. ఇభదశశతబలయుతుల్ = వేయి యేనుఁగుల బలముగల

వారు, దంత - నఖ - అస్త్ర సాధనుల్ = దంతములు గోళ్ళు తాలు ఆయుధములుగఁ గలవారు.

తాత్పర్యము.

పది యేనుఁగుల బలము గలవారు కొందఱు, నూఱేనుఁగుల బలము గలవారు కొందఱు, వెయ్యి యేనుఁగుల బలము గలవారు కొందఱు, వాయువేగము గలవారు కొందఱు, కొలఁది చెప్పరాని బలము గలవారు కొందఱును సుగ్రీవుకొఱకున్నారు. వీరందఱు గోళ్ళు దంతములు తాలు సాధనములుగఁ గలవారు. ఇట్టి కపులను పద్మ-వేలును-లక్షలు-కోట్లు పదికోట్లు లెక్కింప సాధ్యముగాని వారినిఁ దీసికొని యనేకయ బలుఁడు వానరరాజు సుగ్రీవుఁడు వచ్చును. మిమ్ముఁ జంపును. నిష్కారణముగ శ్రీరామచంద్రమూర్తితో విరోధించితిరి. ఇఁక రావణుఁ జచ్చుట, లంక నశించుట, మీరు చచ్చుట కీ ఋణానుబంధము తీఱిన దని తలఁపుడు.

అంతఃపురమునకు వచ్చుచుండు వారికిఁ దప్పఁ దక్కిన వారికి సీత లంకలో, నున్న దను వార్తయే తెలియదు. అంతయు రావణుఁడు రహస్యముగ నుంచెను.

—• ౪౪-వ సర్గము. హనుమంతుఁడు జంబుమాలిని వధించుట •—

ఉ. అంతట నేఁగుదెంచెను బ్రహ•స్తసుతుం డగు జంబుమాలి దే
వాంతక చోదితుం డయి మ•హారథసంబున రక్తమాల్యముల్
వింతగు రక్తవస్త్రములు • లీలగఁ గుండలముల్ ధరించి వా
ద్దాంతబలుండు వాసవ•శరాసనతుల్యశరాసహస్తుఁ డై. ౧౦౫౧

అర్థములు. దేవాంతక చోదితుండు = రావణుచే నాజ్ఞాపింపఁబడిన వాఁడు, మహారథస్థుండునన్ = మిగుల వేగముగ; వాసవ శరాసన తుల్య = ఇంద్రధనుస్సుతో సమానమైన, చాపహస్తుఁడై = వింటిని చేతియందుఁ గలవాఁడై.

తాత్పర్యము.

హనుమంతుఁ డీ కార్యము చేయుచుండఁగా రావణుచేఁ బ్రేరేపింపఁబడిన జంబుమాలి యను ప్రహస్త పుత్రుండు మిగుల వేగముగ నెఱ్ఱని పూలదండలు, నెఱ్ఱని వస్త్రములు, కుండలములు ధరించి యింద్రచాపమువంటి చాపము చేతఁ బట్టుకొని మహాబలశాలి యగు వాఁడు.

ఉ. నాయక మొందఁ దైకొని ని•శాచలయంబు వడంక జ్వాలలం
బాయక మీటుచున్ ఖరస•మంచిత మైన రథంబు నెక్కి తన్
డాయఁగ వచ్చువానిని ఘ•నం బగు నాకృతివానిఁ గాంచి యా
వాయుజుఁ డబ్బి యార్చి సుర•నైకసమాహాము పిచ్చలింపఁగన్. ౧౦౫౨

అర్థములు. నిశాచలయంబు = నిద్రకను, జ్వాలలెన్ = తీఁగవంటి నారిని, ఖరసమంచితము = కంచరగాడిదలఁ గట్టిన, పిచ్చలింపఁగన్ = తియపడునట్లు.

తాత్పర్యము.

బాణ మొకటి చేతఁ బట్టుకొని చిక్కనైన నల్లనైన ఉత్తరీయము (?) ధరించుచుఁ గంధర్వ గాడిదలు గట్టిన తేరెక్కి తన సమీపమునకు వచ్చు పెద్దదేహము గలవానిని జూచి తగినవాఁడే వచ్చుచున్నాఁడని పొంగి రాక్షసులు భయపడ నట్టులార్చెను.

క. వానరవీరునిఁ గని యా, దానవవీరుండు బాణ•వరశరము వింటన్
బూనిచి బాహులఁ గ్రుచ్చుచు, నాననమునఁ దలను మార్గ•ణావళి నాటెన్.

అర్థములు. మార్గణావళిన్ = బాణపంక్తులను.

తాత్పర్యము.

ఆ రాక్షసవీరుఁడు వానరవీరునిఁ జూచి వింటఁ బట్టి బాణములు సంధించి బాహువులఁ గ్రుచ్చుచు ముఖమునందుఁ, దలయందు బాణపంక్తులు నాటుకొనఁజేసెను.

బాహుయుద్ధము చేయువానిని బంపిన నాఁగ రని కింకరవధచేఁ దెలిసికొని దూరమునుండి కొట్టువానిగా వింటి యుద్ధము చేయువానిని రావణుఁడు పంపెను.

క. శరనిహతముఖము రక్తని,కర బిందువిషిక్త మగుచు • ఖరకరకిరణో
త్కరవికసితశరదాగమ,సరసీజాతంబు సొంపు • సంపాదించెన్. ౧౦౫౮

అర్థములు. శరనిహత ముఖము = బాణములచేఁ గొట్టఁబడిన ముఖము - రక్తనికరబిందు = నెత్తుటి సమూహముయొక్క బొట్లచే, విషిక్తము = తడిసినది, ఖరకర = సూర్యునియొక్క, కిరణోత్కర = కిరణసమూహములచే, వికసిత = వికసించిన, శరదాగమ = శరత్కాలమందలి, సరసీజాతంబు = కమలముయొక్క, సొంపు = అందము.

తాత్పర్యము.

బాణములచేఁ గొట్టఁబడిన హనుమంతుని ముఖము నెత్తుటి బొట్లచేఁ దడిసి సూర్యకిరణములచే వికసించిన శరత్కాలకమలమువలె నందమై యుండెను.

క. శోణిత మగు కపివదనము, శోణితబిందువులచేత • శోభిలి యంతన్
శోణిత చందనబిందుల, రాణించెడి కోకనదము•రాణఁ దలిర్చెన్. ౧౦౫౯

అర్థములు. శోణితము = ఎఱ్ఱనిది, శోణిత బిందువులచేత = రక్తబిందువులచే, శోణితచందన బిందులన్ = రక్తచందనపు బొట్లచే, కోకనదము = ఎఱ్ఱకమలము. అనుగుణాలంకారము. ఒక్కవస్తువు తనకున్న గుణమే మఱియొక వస్తుసన్నిధిచే నెక్కువైనట్లు చెప్పిన ననుగుణాలంకార మగును. యమునానది యందలి నల్లకలువ లన్నట్లు.

తాత్పర్యము.

ఎఱ్ఱని హనుమంతుని ముఖము ఎఱ్ఱని నెత్తుటి బొట్లచేత నాకాశమున నెఱ్ఱని చందనపు బొట్లుగల యెఱ్ఱతామరవలె నుండెను.

కింకన్ = కోపముతో; అమాత్యపుత్రకులన్ = మంత్రికుమారులను, ఒక రీతుకాఁడు హనుమంతుని సాధింపలేఁడని పెక్కురఁ బంపెను.

తా త్ప ర్య ము.

చంపఁబడఁగా మిగిలిన కింకరులు జంబుమాలి చచ్చె నని తెలుపఁగా రావణుఁడు కోపించి శౌర్యదర్పముల గొప్ప వారగు మంత్రిసుతులఁ బంపెను.

•— ౪౫-వ సర్గము. హనుమంతుఁడు మంత్రిపుత్రుల నేడ్వురఁ జంపుట •—

సీ. సప్తార్చివర్చసుల్ • సప్తసంఖ్యులు వారు, వెలువడి శరచాప•వివిధసాధ
నంబులఁ గైకొని • జంబుమాలిఁగఁ బరస్పరజయవాంఛు లై•ధర్మజాల
కేతనమాలికా•కీలితరథములు, నంబుదధ్వానంబు•లట్లు మొరయఁ
జాప టంకృతుల ది•శాభాగ మగలఁగఁ, గార్మ్ముకంబుల యట్లు • గ్రాలి చనఁగ

తే. వారితల్లులు కింకర•వార్త వినుట, గొనుచు లే మసువార లో•కొ- యటంచు
బాంధవాప్త సమేతు లై•పల్లటిలిరి, సురవిరోధులు పవమాన•సుతుని దాసి.

అర్థములు. సప్తార్చి వర్చసుల్ = అగ్నివంటి కాంతిగలవారు. సప్తార్చి వర్చసుల్ - శేషాద్విభాషా (పాణిని ౫-౪-౧౫౪) ప్రకారము కవర్ణాగమ మనిత్య మగుటచే నిచ్చట వర్చస్కులని చెప్పఁబడలేదు. పరస్పర జయ వాంఛులై = ఒకరి నొకరు గెలువఁ గోరికఁగలవారై, ఒకరిని మించి యొకరు హనుమంతుఁ బట్టుకొను కోరిక గలవారై, ధర్మజాల = బంగారు మయము లైన; కేతన మాలికా = ధ్వజముల వరుసలచే, కీలిత = కట్టఁబడిన, అగలఁగన్ = పగులఁగా, కార్మ్ముకంబులు = తొలుకారు మెఱుఁగులు, పల్లటిలిరి = వ్యసనపడిరి.

తా త్ప ర్య ము.

అగ్నివలె నుండు వా రేడ్వురు గృహంబులు వదలి వింట్లు, బాణములు తక్కిన సాధనములు తీసికొని యొకరిని మించి యొక్కరు జయము నొందవలయు నని కోరిక గలవారై బంగారు మయములైన ధ్వజము లెత్తిన రథములు, మేఘము లుఱుము నట్లు ధ్వనింపఁగాఁ బోయిరి. వారి తల్లులు కింకరులవార్త విన్నవా రగుటచే వీరే మగుదురో యని చుట్ట పక్కములతో వ్యసన పడిరి. ఆ రాక్షసులు హనుమంతుని సమీపించి,

ఉ. స్యందనగర్జితస్వనము • సాయక వృష్టియుఁ గ్రాల దేవతా
బృందవిరోధివారిధర • మొంతయు మూఁగిన వాయుసూనుఁడున్
గొందలపాటు లేక యొక•కొం దన నొర్చి కరించె మింట ని
ర్బంధరయాన రాక్షస•రంబులకున్ సుఖిగాక జేగి యై. ౧౦౬౧

అర్థములు. స్యందన గర్జితస్వనము = తేరులయొక్క ధ్వని యనెడి యుఱుముల ధ్వనియు, సాయకవృష్టియు = బాణముల వర్ష మనెడి వర్షము, దేవతాబృంద

విరోధివారిధరము = రాక్షసు లను మేఘము, రూపకాలంకారము. కొండలపాలు = కలఁతపాటు, కొండన=కొండయో యనునట్లు,ఉత్ప్రేక్షాలంకారము,నిర్నింబరయాన= మినుల వేగముగా వచ్చెడి, వేగిరమై = వేగము గలవాఁడై.

తాత్పర్యము.

రథచక్రముల ధ్వని యుఱుములుగా, బాణప్రయోగము వర్షముగా రాక్షసు లనెడి మేఘము క్రమ్ముకొనఁగా హనుమంతుఁడు పర్వతమువలెఁ గలఁత పడక యతి వేగముగ వచ్చు వారి బాణములకు గుఱిగాక వేగము గలవాఁడై యాకాశమునసే తిరిగెను.

క. ఇంద్రశరాసనసంయుత,సాంద్రాంబుదపంక్తి కలఁచు • శ్వసనుం డనఁగా
సుంద్రప్రతాపి కపియు న,తంద్రతఁ గోదండధరుల • దైత్యులఁ గలఁచెన్. ౧౦౬-౨

అర్థములు. ఇంద్రశరాసనసంయుత = ఇంద్రధనుస్సుతోఁ గూడిన, సాంద్ర+అంబుద పంక్తి = దట్టమైన మేఘపంక్తులను; కలఁచు = కలఁతపడునట్లు చేయు; శ్వసనుం డనఁగా = వాయువో యనునట్లు; సుంద్రప్రతాపి=ఘనమైన ప్రతాపము గల, అతంద్రతన్ = హెచ్చరికతో.

తాత్పర్యము.

ఇంద్రధనుస్సుతోఁ గూడిన మేఘముల గుంపును వాయువు కలఁచునట్లు ఘనమైన ప్రతాపము గల హనుమంతుఁడు హెచ్చరిక గలవాఁడై రాక్షసులను సంక్షోభింపఁ జేసెను.

క. కంఠారవ మారఁగఁ గపి,కంఠీరవ మప్పుడు గవిసి • క్రవ్యాదవధో
త్కంఠుండై తలపదనఖ,కుంఠితములఁ జేసె సేనఁ • గూల బలంబుల్. ౧౦౬-౩

అర్థములు. కంఠ+ఆరవ=కంఠధ్వని; ఆరఁగన్ = అతిశయింపఁగా; కంఠీరవము = సింహము; క్రవ్యాదవధ = రాక్షసుల చంపుటయందు; ఉత్కంఠుఁడై = వేగిరపాటు గలవాఁడై; తల-పద-నఖ కుంఠితములన్ = అరచేత, కాల, గోళ్ళచే ధ్వంసమయిన వానిఁగా.

తాత్పర్యము.

పెద్ద సింహనాదముచేసి కపిసింహ మప్పుడు రాక్షసుల వధయందు వేగిరపాటు గలవాఁడై పిటిలోదవా యింతసేపు యుద్ధమని తలఁచి యా సేనలను అరచేతులతోఁ గాళ్ళతోఁ గొట్టి, గోళ్ళతోఁ జీల్చివైచెను.

ఉ. కొండలఁగేల బాఁది, మఱి • కొండల నేలను వ్రాఁచి, గ్రుద్దునం
గొండల, నెండి కొండలను • గోళ్ళను జీల్చుచు, నక్కి తాఁచుచున్
గొండల గుంపువోలె, నొక • కొండను దిద్దిర ద్రిప్పి వైచుచున్
గొండల మందఁ గూల్చె రిపు•కోటి వనాటవిభుం డుదగ్రుఁడై. ౧౦౬-౪

అర్థములు. కేలన్ బాఁది = చేతితోఁగొట్టి; మోఁది = కాళ్ళు పట్టుకొని తల నేలను వ్రేసికొట్టి; వనాట విభుండు = వానరశ్రేష్ఠుఁడు.

తాత్పర్యము.

స్పష్టము.

తే. చెవులు బీఁటలువాఱఁగ • సింహనాద, మొనరఁ జేయఁగ మరికొంద • ఱుర్విఁ గూలఁ గాఁ దక్కిన పెఱచి చీ • కాకుపడుచుఁ, బోయినదె పోకగాఁ బాఱి • పోయి రంత,

అర్థములు. బీఁటలు=పగుళ్ళు; తక్కిన=మిగిలినవారు; చీకాకుపడుచున్ = శ్రమపడుచు.

తాత్పర్యము.

చెవులు పగుళ్లు వాఱునట్లు సింహనాదము చేయఁగా, మఱి కొందఱు నేలఁ బడఁగా, దక్కినవారు కష్టపడుచుఁ బోయినదే పోకగా మరల తిరిగి చూడక పరు వెత్తిరి.

తే. తన్నుకొని చచ్చు గుఱ్ఱాలు • ధరణిఁ గూలి
మూల్గు నేనుంగులును నేల • వ్రుగ్గతిలిన
గొడుగులును దిక్కులుల్ నిండఁ • బడమి నెత్రు
టేఱ్లు పాఱెను లంకలో • సెగసె నులివు. ౧౦౬

అర్థములు. వ్రుగ్గతిలిన = వ్రీలఁబడిన; ఉలివు = ధ్వని.

తాత్పర్యము.

స్పష్టము.

క. వానర పీనుంగు డీ గతి, మానవభోజుల వధించి • మసలక చని యు
ద్యానము తోరణమున నా, సీనుండై యుండె రణము • సేసెడు కోర్కిన్. ౧౦౭

అర్థములు. మానవభోజులన్ = రాక్షసులను; మసలక = జాగు చేయక.

తాత్పర్యము.

హనుమంతుఁ డీ విధముగ రాక్షసులఁ జంపి వెంటనే పోయి యుద్యాన తోరణ మున నింకను యుద్ధము చేయు కోరికగలవాఁడై కూర్చుండెను.

—• ౪౬వ సర్గము. హనుమంతునిమీఁదికి రావణుఁడు
సేనానాయకుల నేవురఁ బంపుట •—

సీ. మంత్రిసుతనాశము • వినరణంబు రావణుఁ; డాలించి మఱుఁగిడి • స్వాంతమును వి
రూపాక్ష దుర్ధర • యూపాక్ష భాసక, ర్ణ ప్రఘసుల సైన్య • నాయకులను
నేవురఁ గనుఁగొని • యేఁగి మీరలు సర్వ, సైన్యంబుతో వన • చరుని, బట్టి
తేవలయును జంపు • లేఁకున వెలఁదున, తప్పక కడుఁ బ్రియ • త్నంబు చేసి

అయిన బాణములచే, ఉప్పరపీదికిన్ = ఆకాశమునకు, తూపులు = బాణములు।
మార్గణహతిన్ = బాణముల దెబ్బలచే.

తాత్పర్యము.

ఇట్లు చూచి యుండు దుర్ధరుం డను వాఁడు అసమానుఁడై, పదునైన పచ్చని ములుకు బాణములచే హనుమంతుని తలను నొప్పింపఁగా వానరశ్రేష్ఠుఁ డాకాశమున కెగిరి, భూమి, దిక్కులు నిండ సింహనాదము సేయుఁగాఁ బూర్ణతేజస్సు గల దుర్ధరుఁడు నూఱు బాణములు వానరుని మీఁద గురియింపఁగాఁ జిన్న మేఘము నెగుర్చు జిమ్ము వాయువు వలె వాని నెగురఁగొట్టి హనుమంతుఁడు బాణముల దెబ్బలకు నొప్పి చెందియు దేహమును పెంచి యాకాశమున కెగిరి యచ్చటనుండి కొండ మీఁదఁ బిడుగు గుంపు పడినట్లు దబాలున వాని తేరిపైఁ బడెను.

ఆ. హయము లెనిమిదియును • నక్షకూబరములు, నమసి విఱిగె వాఁడు•స్యందనంబు
నుండి పడెను విడిచి • యసువులు, వానిని గాంచి, తీవ్రరోషు లగుచు•దివికి నెగిరి.

అర్థములు. అక్షకూబరములు=బండికన్ను, నొగలు - క్రమాలంకారము.

తాత్పర్యము.

ఎనిమిది గుఱ్ఱములు చచ్చెను. బండికన్ను నొగలు విఱిగెను. వాఁడు ప్రాణములు వదలి తేరిమీఁదనుండి పడెను. వానిని జూచి మిగులఁ గోపించినవారై యాకాశమున కెగసి.

రాక్షసులు వేసిన బాణములు పోవు నెత్తుకంటె నింకను నెత్తున హనుమంతుఁ డుండుటచే వీరి బాణము లాయనకుఁ దగులక యే క్రిందఁ బడుచుండెను. కావున వారును నాకాశమున కెగిరిరి.

తే. అల విరూపాక్షయూపాక్షు•లనెడివారు, కపి యురస్థ్సలి మీఁద ము•ద్గరము లెత్తి
హనుమ వారల వేగంబు • నాఁగి మఱలఁ, బృథ్వికిని దిగ్గి చెట్టొంకు•పెల్లగించి.

తాత్పర్యము.

మీఁదఁ జెప్పిన విరూపాక్షుఁడు, యూపాక్షుఁ డనెడివారు వానరుని ఱొమ్ము పగులఁగొట్ట ముద్గరము లెత్తుకొని రాఁగా వారివేగమును హనుమ యణఁచి టటాలున భూమిపైకి వచ్చి చెట్టు నొకదానిని పెల్లగించి.

ఉ. వారలఁ గొట్టి చంపఁ దమ•వారల ముప్పురపాటుఁ గాంచి దు
ర్వారతరాగ్రహంబునను • బట్టిసముం బ్రఘసుఁడు నైచినన్
శూరుఁడు భాసకర్ణుఁడును • శూలముఁ గైకొని గ్రుమ్మిఁ గ్రుమ్మినన్
మారుతి బాలభాస్కరుని • మాడ్కిని మండు రక్తసిక్తుఁడై. ౧౦౭౭

తాత్పర్యము.

ఇప్పుడు రాక్షసులు మీఁద నుండిరి. హనుమంతుఁడు క్రిందనై భువి నుండెను

నా శాఖాశేఖరమునుండి క్రిందికి వర్షముపోవల హనుమంతుఁడు చెట్టు పీకికొని పోయి వారిని కొట్టఁగా వారి ముద్గరములు పొట్టివి, చెట్టు పొడుగాటిది యగుటచే వారిదెబ్బలు హనుమదునకుఁ దగులలేదు, హనుమంతుఁడు కొట్టినది వారికిఁ దగిలెను. దానితో వారు చచ్చిరి. ఇట్లు తమవారు ముగ్గురు చావఁగా మిగులఁ గోపించి మిగిలిన యిరువురిలో ప్రఘసుం డనువాఁడు పట్టిసమును వైచెను. భాసకర్ణుఁడు శూలముతోఁ బొడిచెను. ఇట్లు పొడువఁగా నాంజనేయుఁడు నెత్తురుఁ దడిసి బాల సూర్యునివలె నుండెను.

క. తరుమృగ ఫణిసంయుతమగు, ధరణీధరశృంగమునను • దా రాక్షసులన్
ఉరుగతి వైచిన నయ్యిరువురు ప్రాలిరి యపగతాసు•వు లయి ధరిత్రిన్. ౧౦౭౮

అర్థములు. తరుమృగఫణిసంయుతము = చెట్లతోను, మృగములతోను, పాములతోను, గూడినది. ధరణీధరశృంగము = పర్వత శిఖరము - ఉరుగతిన్ = గొప్ప వేగముతో - అపగత + అసువులు = పోయిన ప్రాణములు గలవారు. ప్రాణము పోయినవారు.

తాత్పర్యము.

చెట్లతో మృగములతో పాములతో, గూడియుండిన పర్వత శిఖర మొక్కదాని బట్టి తెచ్చి యా రాక్షసులపై మహావేగముతో వైవఁగా వా రిరువురు చచ్చి నేలఁ బడిరి.

క. ఏవురు దళవాయులు నిటు, చావం బెఱవారి నెల్లఁ • జక్కడఁచెను దం
తావళహయభటరథతతి దం,తావళహయభటుల నసుర•తతి ద్రుంపఁ దివన్. ౧౦౭౯

అర్థములు. దళవాయులు = సేనానాయకులు. దళవాయి—ప్రకృతి; చక్కడఁచెను = చంపెను, దంతావళహయభటరథతతిన్ = ఏనుఁగులయు, గుఱ్ఱములయు, భటులయు సమూహమును, దంతావళము— దంత + వలము = దంతావలము- ఇచట వల్ప్రత్యయమునకుఁ గల యని యర్థము. మత్వర్థీయము.

తాత్పర్యము.

ఏవురు సేనానాయకు లిటు చావఁగాఁ దక్కిన సేనను ఏనుఁగులతో నేనుఁగులను, గుఱ్ఱములతో గుఱ్ఱములను, భటులతో భటులను గొట్టి యింద్రుఁడు రాక్షసులఁ జంపినట్లు చంపెను.

క. చనఁ దెరువు లేక యుండఁగ, ఘనగజహయభటచయంబు • క్ష్మన్ నెఱసిన నా
హనుమని లయకాలుఁ డనఁగా,జని తోరణసీమఁ జేరె•శ్రాంత్యర్థముగన్. ౧౦౮౦

అర్థములు. తెరువు=త్రోవ, క్ష్మన్ = భూమియందు, లయకాలుఁడు = ప్రళయకాలమందలి యముఁడు, శ్రాంత్యర్థము = బడలిక తీర్చుకొనుటకు.

తాత్పర్యము.

పోవుటకు మార్గము లేకుండునట్లు పెద్ద యేనుఁగులు, గుఱ్ఱములు, భటులసమూ

హము భూమిమీఁద నెఱిసినట్లు వ్యాపింపఁగా ప్రళయకాలయమునివలె హనుమం తుఁడు బడలిక దీర్చుకొనుటకై యొప్పుగా తోరణమును చేరి కూర్చుండెను.

ఉత్ప్రేక్షాలంకారము. అనన్ ఇది యుత్ప్రేక్షావాచకము.

—• ౪౬-వ సర్గము. హనుమంతునిమీఁదికి రావణుఁడు పంచసేనాపతులను బంపుట •—

సీ. దశకంఠుఁడు తెల్పుడు • దళములతోఁ జేర, హనుమ కోట విని యమ•రారి సేన
సమరోద్ధతోన్ముఖుఁ • బంచవిక్రమశాలిఁ, దవ తనూభవు వఢుఁ • గనుఁగొనంగఁ
గనుసన్న మెఱుఁగు చా•పము చేతఁ బూని స్వర్ణ,చిత్రకార్ముకముతో • చేతఁ బూని
ద్విజవరుల్ వేల్వంగ • నెస భగ్గు మని లేచు,నగ్నినా దగ్గన • నప్పు లేచి
తే. తపము బలమున నార్జింపఁ • దప్తకనక,జాలశోభిత మై రత్న•జాలలసిత
కేతనాంచిత మై జవో•పేతసైంధ,వాష్టకసుయోజితం బగు • యమును వుట్టెను.

అర్థములు. దళములతో = సేనలతో, హేరన్ = రణమందు, సమర + ఉద్ధత + ఉన్ముఖున్ = యుద్ధమునందు గర్వించినవాఁడు, యుద్ధమునకు సిద్ధపడి యుండువాఁడు, కనుసన్న = కంటిసంజ్ఞ, స్వర్ణ చిత్రకార్ముకమున్ = బంగారుచే నలంకరింపఁబడిన వింటిని, ద్విజవరుల్ = బ్రాహ్మణశ్రేష్ఠులు, వేల్వంగన్ = హోమము సేయఁగా, తప్తకనకజాల = పుటము వేయఁబడిన బంగారు సమూహముతో, శోభితమై = ప్రకాశించునదిమై, రత్నజాలలసిత = రత్న సమూహములచే బ్రకాశించు, కేతనాంచితమై = ధ్వజములచే నొప్పునదై, జవోపేత = వేగముతోఁ గూడిన, సైంధవాష్టక = ఎనిమిది గుఱ్ఱములచే, సుయోజితంబగు = చక్కఁగాఁ గట్టఁబడినదై.

తాత్పర్యము.

అయిదుగురు సేనానాయకులు సేనలతోడ యుద్ధమునకు జన్నుట విని రావణుఁడు యుద్ధగర్వముగలవాఁడును, యుద్ధమునకుఁ బోవ సిద్ధపడి యుండువాఁడును, భయంకరమైన పరాక్రమము గలవాఁడును తన కొడుకు నైన యూపాక్షుని జూడఁగా వాఁడు తండ్రి కంటిసంజ్ఞ నెఱిఁగి బంగారుచే నలంకరింపఁబడిన విల్లు చేతఁబూని బ్రాహ్మణులు హోమము సేయఁగా భగ్గు మని మంట లెగయు నగ్నివలెఁ జిహ్వాలుగ లేచి తపముచే నార్జింపఁ బడినదియు, పుటము వేయఁబడిన బంగారుచే బ్రకాశించునదియు, రత్నములచే జెక్కఁబడిన కేతనములతోఁ బ్రకాశించునదియు, శీఘ్రముగఁ బోఁగల యెనిమిది గుఱ్ఱములను గట్టినదియు నగుటను,

తే. బాలభాస్కరుభంగిని • బ్రజ్వరిల్లి, యమరదానవదుర్జయ•మై నభశ్చ
రంబు నై రత్నమయ మైన•రథము నెక్కి, తూణ యష్టకృపాణికల్ •తోమరములు.

అర్థములు. అమరదానవ దుర్జయమై = దేవతలకు, దానవులకు జయింప రానిదై, నభశ్చరంబునై = ఆకాశమందుఁ దిరుగునదియై, తూణము = అంబుల పొది, అష్ట కృపాణికల్ = ఎనిమిది కత్తులు, తోమరములు = చిల్లకోలలు.

సూర్యుఁడని చెప్పినను జెప్పవచ్చును. మాఘ మాసమున మాడకొత్తు వేసంగి యను నానుడి గలదు. అదియునుగాక "అర్జునస్య ఇమే బాణా నేమే బాణా శ్శిఖండినః। కృంతన్తి మమ గాత్రాణి మాఘే మాసే గవా ఇవ" ఈ బాణము లర్జునునివి. శిఖండివి కావు. నా యవయవములను మాఘమాస కిరణములవలె బాధించు చున్నవి, యని యొక యర్థము గలదు. మాఘేమా = ఆఁడెండ్రకాయ, సేగవా = దాని పిల్లలు అని యర్థము.

తాత్పర్యము.

ప్రళయకాలాగ్నివలె నున్న యుత్తమవీరుని నాంజనేయుని సగౌరవదృష్టిఁజూచి వానికిఁ గల వేగ గర్వము నాలోచించి తన శస్త్రాస్త్రపాండిత్యము, దేహబలము వానికిఁ జూప గ్రీష్మమందలి సూర్యునివలెఁ దీవ్రుఁడై యాంజనేయుని మూఁడు బాణములచేఁ గొట్టెను.

—♦ హనుమంతుఁ డక్షకుమారునిఁ జంపుట ♦—

క. వెండియుఁ జైపడి శితశర, కాండంబుల నొంప నతఁ♦డకపినాథులకున్
భండనము చెల్లె దివిజుల, గుండెలు దిగ్గిల్లఁగ ♦ ఘోరం బగుచున్. ౧౦౪౫

అర్థములు. శితశరకాండంబులన్ = పదునైన కఠినములైన బాణములను. భండనము = యుద్ధము.

తాత్పర్యము.

అంతటఁ జేరి సైపడి పదునైన కఠిన బాణంబులచే నొప్పింపఁగా నతఁడును హనుమంతుడును దేవతల గుండెలు దిగ్గిలఁగా ఘోరమైన యుద్ధము జరిగెను.

చ. పుడమి వడంకెఁ, దేజ మడఁ♦ పోయె నహర్పతి, గాలి వీచుటల్
విడిచెఁ, జలించెఁ గొండలును ♦ విన్ను విదాన మెసంగె, క్షోభముం
బడిరొ సముద్రముల్ భయము♦పాటున; రాక్షసవానరేశ్వరుల్
విడివడి ఘోరభంగిఁ బరి♦విచ్యుతి మచ్చర మెచ్చి పోరఁగాన్.

అర్థములు. అహర్పతి = సూర్యుఁడు, అడఁ = క్షీణించి, విన్ను = ఆకాశము, పరివిచ్యుతి=సడలిపోక – దృఢముగ.

తాత్పర్యము.

రాక్షసుఁడు కపీశ్వరుఁడు నెగఁబడి విచ్యుతివిడక దృఢముగ వెనుదీయక మచ్చరమున యుద్ధముసేయు సమయమున భూమి వణఁకెను. సూర్యుని కాంతి మాసెను. గాలి వీచుట మానెను. కొండలు కదలెను. ఆకాశమున ధ్వని పుట్టెను. సముద్రములు భయముఁ గలఁత చెందెను.

ఉ. అట్టిమొనం గుమారుఁడు ర♦యంబునఁ గాంచనపుంఖ బాణముల్
పట్టి పిడుగ్జ్వాలంబు లను♦పాములపోలిక మూఁటి నాటినన్

సూర్యునివలెనై కోపించి కొండమీఁద మేఘము వర్షించునట్లు బాణవర్షము గురియించెను. దానికి హనుమంతుఁడు ఉంకిక గర్జించి గర్జించిన బాలికై వన్ను వేసుఁగువలెఁ దన్నుఁబట్టుకొన వన్ను నతని నాపగించి యూకాశమున కెగసెను. తప్పించుకొని పోవు నని బాలుఁడు కోపించి యుతనిపై బాణవర్షము గురియించెను. హనుమయు దానియందుఁ జిక్కుపడక సంచరించెను.

చ. తిరిగిన నీడనోవక యు • తీవ్రఖరాశుగజాలవర్షముల్
గురియు కుమారుఁ గాంచి కపి•కుంజరుఁ డెట్లు జయింతు వీని నం
చరయఁగ నింతలోన నమ•రాంతకసూనుఁడు శాతమార్గణో
త్కరపరివిద్ధబాహువుగఁ • దన్నొనరింపఁగ మెచ్చి చింతిలున్. ౧౦౪౯

అర్థములు. ఉడనోవక = వెనుదీయక, తీవ్రఖర=తీవ్రములు, కఠినములు నగు, ఆశుగజాల వర్షముల్ = బాణసమూహముల వానలు, శాతమార్గణ = పదునైన బాణములయొక్క, ఉత్కర = సమూహముచే, పరివిద్ధ = బాగుగ బాధింపఁబడిన, బాహువుగన్ = చేతులు గలవానిఁగ, చింతిలున్ = ఆలోచించెను.

తాత్పర్యము.

ఇట్లు తిరిగినను అక్షకుమారుఁడు వెనుదీయకయే తీక్ష్ణమైన, కఠినములయిన బాణముల వానను గురియుచుండఁగా వానిని జూచి వీని నెట్లు జయింతునా యని యాలోచించుచుండ నింతలో వాఁడు పదునైన బాణములచే బాహువుల ఛేదించెను. దాని కాంజనేయుఁడు మెచ్చుకొని యిట్టు లాలోచించెను.

ఉ. భూషఁగఁ జిన్నగాని ఘను•కూడుఁడు బాలదివాకరప్రభుం
డోషఁ దాకించు కీనిఁయు న•ను త్తమకర్ముఁడు, వీని కక్కటా!
రోషు ఘటింపఁగా మనసు • గొల్పదు, వీని పరాక్రమంబుఁ గొం
డాడెద రింతియున్ విబుధ•యక్షమహోరగమహర్షు లద్దిరా! ౧౦౫౦

అర్థములు. ఓడఁడు=భయపడఁడు.

తాత్పర్యము.

వీఁడు వయస్సునఁ జిన్నవాఁడే కాని గొప్ప శూరుఁడు. బాలసూర్యుని కాంతి గలవాఁడు. కొంచెమైన భయపడువాఁడు కాఁడు, గొప్ప పనిచేయువాఁడు. ఇటు వంటి వీనికి వధయొగ్య యూపదఁగూర్ప మనస్సంగీకరింపకున్నది. వీని పరాక్రమములు దేవతలు; యక్షులు, పన్నగులు, మహర్షులు స్తోత్రముచేయుచున్నారు. ఔరా!

ఉ. చక్కఁగఁ నన్నుఁ జూచెడిని • సమ్ముఖమం దాగి నిల్చి తెంపు సెం
పెక్కెడు నంగరంబునను • నెక్కుడు నేర్పుచు దీర్పు నోర్పుమన్
మిక్కిలి యూసు మాఁనఁడు, స•మిన్నిపుణుండుగను, బాలుఁ డంను నే
నుపేక్ష సూరకున్న నవ•మానము తప్పక యూర్పు నా కనిన్. ౧౦౫౧

అర్థములు. సమిత్ + నిపుణుండును = యుద్ధమందు నేర్పు గలవాఁడు.

తా త్ప ర్య ము.

వీని దృష్టి చలించి యుండు నను మాయనేరా! కొంచెపు నేసినంత మున్న దృష్టి చూపనీక వర్ష చక్కఁగఁ జూచుచున్నాఁడు. నే నేదిక్కుపోయిన నా దిక్కున నా కెదురు దృష్టి యుంచుచున్నాఁడు, అంతకంతకు నేర్పు - తీర్పు - ఓర్పు అతిశయించుచున్నది కాని తగ్గుట లేదు. రోషము తగ్గించిన వాఁడు కాఁడు. యుద్ధమునందు మిగుల నేర్పుగలవాఁడు. వీఁడు చిన్నవాఁడని నే నుపేక్ష చేసితినా, యుద్ధమునందు నా కవమానము తప్పక కలిగించును. హనుమంతుఁడు పిల్ల రాక్షసుని కొట్టివేసెను అను అపకీర్తి వచ్చును

ఉ. భంజనసీమ నితని య•భంగపరాక్రమ వేగ తేజముల్
గుండెలు ద్రక్కలించు సుర•కోటుల కేనియు, నేమి వీనికో
దండవిజృంభణంబు భుజ•దర్పసమగ్రత! పైఁడి వచ్చునే!
ఖండితుఁ జేయఁ బూనవలె•గా, జ్వలదగ్ని నుపేక్ష యర్హమా. ౧౦౯ ౨

అర్థములు. భంజనసీమన్ = యుద్ధభూమియందు, ద్రక్కలించున్ = పగుల జేయును, జ్వలదగ్నిన్ = మండుచున్న యగ్నిని - భుజదర్ప సమగ్రత = బాహుబలము వలన గలిగిన గర్వము యొక్క సంపూర్ణత్వము.

తా త్ప ర్య ము.

యుద్ధభూమియందు భంగములేని వీని పరాక్రమము, వేగము, ప్రతాపము, దేవతాసమూహములకైనను గుండెలు పగులఁ జేయును. ఔరా యేమి వీని విలువిద్యయతిశయము - ఏమి వీని భుజాబలముయొక్క సంపూర్ణత్వము. దీనిని సహింప వచ్చునా? కూడదు. వీనిని జంపవలసినదే. మండుచున్న యగ్నిని నుపేక్షించిన నెటులఁ జల్లార్ప సాధ్యపడునా? అది రేఁగఁగాల్పక విడుచునా ?

చ. అని తన మేను పెంచి యసు•రార్భకుఁ ద్రుంపఁగ నెంచి స్వేచ్ఛమై
ఘనతరవేగవంతిముల • ఖప్రచరిష్ణువులైన వాజులన్
దునిమెఁ దలప్రహారములఁ • దోడనె తేరును గూల నేలపైఁ
దునియలు వాఱఁ దద్రథము • మింటికిఁ గుమారుఁడు చాపహస్తుఁడై. ౧౦౯ ౩

అర్థములు. వేగవంతములగు = మిగుల వేగముగలవి, ఖప్రచరిష్ణువులు = ఆకాశమందుఁ జక్కఁగాఁ దిరుగు స్వభావము గలవి, వాజులన్ = గుఱ్ఱములను, తల ప్రహారములన్ = అఱచేతి దెబ్బలచే.

తా త్ప ర్య ము.

ఈ ప్రకార మాలోచించి దేహము పెంచి రాక్షసకుమారుఁ జంప నాలోచించి యిష్టానుసారము మిగుల వేగము గలవై యాకాశమునఁ దిరుగు స్వభావము గల గుఱ్ఱములను అఱచేతి దెబ్బలచే జంపెను. అట్లే తేరును నేలఁగూలఁ దన్నెను. ఇట్లు తేరు తునుకలు కాఁగా నక్షకుమారుఁడు రథము నుండి మింటికి విల్లు పట్టుకొని.

చ. అనుపమయోగశక్తిని మ•హాత్ములు దేహము వీడి స్వర్గమున్
జనియెడిభంగిఁ దీవ్రరభ•సంబున మింటికి దాఁటి ఖడ్గముం
గొని పవనాత్మజుం గదిసి•క్రూరతఁ బోరుచు నుండ నంజనా
తనయుఁడు డాసి పైపడి ప•దంబులు రెంటను బట్టి కోపి యై. ౧౦౯౪

అర్థములు. అనుపమ యోగశక్తిని = అసమానయోగబలముచే, తీవ్రరభసంబున=మిగుల వేగమున, డాసి=సమీపించి.

తాత్పర్యము.

మహాత్ములు తమ యసమానయోగబలమున దేహము విడిచి స్వర్గమునకుఁ బోవునట్లు మిగుల వేగమున నాకసమున కెగిరి కత్తి చేతఁ బట్టుకొని హనుమంతుని సమీపించి ఘోరముగ యుద్ధము చేయుచుండఁగా నాంజనేయుఁడు సమీపించి పైపడి రెండుకాళ్ళు పట్టుకొని మిగులఁ గోపించినవాఁడై.

ఉ. అండజనేత జిహ్మగము • నట్లు విదిర్చి విదిర్చి వేగతుల్
గండున నేలపై విసరి • క్రచ్చఱ మోఁద శిరంబు వక్కలై
కండలు నెత్తురెముకలును • క్ష్మాతల మంతయుఁ గప్పఁ దండ్రికిన్
గుండెలు ఝల్లనంగ సుర•కోటులు సమ్మద మందఁ జచ్చెనన్. ౧౦౯౫

అర్థములు. అండజనేత = గరుత్మంతుఁడు, జిహ్మగము=పాము - వంకరగా. పోవునది వ్యుత్పత్త్యర్థము. వేగతుల్ = వేయివిధములుగ, గండునన్=బలమున, క్రచ్చరన్=శీఘ్రముగ, తండ్రికిన్=తన తండ్రికి; రావణునకు.

తాత్పర్యము.

గరుత్మంతుఁడు పామునువలె వేయి విధముల ప్రక్క, కాప్రక్కకు విదిర్చి, విదిర్చి పామును కోఁక పట్టుకొని లేవనెత్తి యట్టులే యుంచిన పగడ పైకిలేచి [illegible] గఱచును. అట్లుగాక పట్టినపట్టు తోడనే గుడ్డను జాడించినట్లు జాడించి కదలించుచుఁ బట్టుకొనిన లేనలేదు. వేగముగ బలము కొలఁది నేలమీఁదవేసి మోఁదఁగా తల తునకలై కండలు, నెత్తురు, ఎముకలు నేలయంతయు నావరింపఁగా రావణుని గుండెలు పగుల దేవతలు సంతోషింపఁ జావఁగా.

క. మునులును యక్షులుఁ బన్నగు,లును జక్రచరుల్ మహోష్మ•లును నాకపుఁడున్
వినియములు నమరవరులును, గని యచ్చెరు వొందిరి పంక్తి•కంఠసుతారిన్.

అర్థములు. చక్రచరుల్ =(౧) జ్యోతిర్మండలమున నుండువారు. (౨) ఆకాశమండలమున సంచరించువారు. (౩) గుంపులు గుంపులుగాఁ దిరుగువారు. వినియములు = విశేషవ్రతములు గలవారు. పంక్తికంఠసుతారిన్ = అక్షకుమారుని జంపిన వానిని - హనుమంతుని.

తాత్పర్యము.

మునులు, యక్షులు, పన్నగులు, చక్రచరులు, మహోష్ములు, ఇంద్రుడు, మహావ్రతస్థులు, దేవతలు హనుమంతునిఁజూచి యాశ్చర్యపడిరి.

చిక్కడు. బాహుబలమునను లోపడఁడు. అస్త్రములచేఁగాని సాధ్యుఁడు గాఁడని యస్త్రవిద్యయందుఁ బ్రవీణుఁడును దనను రెండవవాఁడను నింద్రజిత్తును బంపు చున్నాఁడు.

మత్తకోకిలము. ఈవె యస్త్రవిదగ్రగణ్యుఁడ • వీవె సర్వసుపర్వదై
త్యావళీవ్యసనప్రదాతవు • ఖ్యాతి మెల్లజగంబులన్
దావకీనభుజాబలంబు, వి•ధాతఁ గొల్చి మహాస్త్రముల్
నీవు పొందితివి, నీ చరిత్రలు • నిర్జరాళికి స్పష్టముల్. ౧౦౯

అర్థములు అస్త్రవిద్ + అగ్రగణ్యుఁడవు = అస్త్రములను దెలిసినవారిలో మొదట లెక్కింపఁదగిన వాఁడవు. సర్వసుపర్వ+దైత్యావళీ = ఎల్ల దేవతలను, దైత్యుల గుంపులను వ్యసనప్రదాతవు = శోకము కలిగించు వాఁడవు. ఖ్యాతము = ప్రసిద్ధికెక్కినది, తావకీన భుజాబలంబు = నీ బాహుబలము.

తాత్పర్యము.

అస్త్ర విద్యావంతులందు మొదటివాఁడవని లెక్కింపఁదగినవాఁడవు నీవే! నీవే సమస్త దేవదానవులకు శోకము కలిగించిన వాఁడవు. నీ భుజబల మెల్లలోకంబులఁ బ్రసిద్ధికెక్కినది. బ్రహ్మదేవునిచే మహాస్త్రములు సంపాదించితివి. నీవు చేసిన కార్యములు దేవత లందఱెఱుఁగుదురు.

క. నీ యస్త్రబలము పెంపున, నీ మొకటను నిలువ వశమె • నిర్జరులును దై
తేయులు వాసవుఁడైనను, మాయామ్నాయమునను నీ స•మానులు గలరే? ౧౧౦

అర్థములు. మాయా+ఆమ్నాయమునన్ = మాయావిద్యయందు.

తాత్పర్యము.

దేవదానవులు నింద్రుఁడైనను నీ యస్త్రబలముయొక్క యాధిక్యముచే నీ మొనకునైన నిలువగలరా! ఇఁక యుద్ధము చేయుట మాటయేల! మాయలు చేయుటయందు నీకు సమానులు లేరు.

ఇట్లు చెప్పుటచే హనుమంతుని న్యాయ్యమార్గమున నస్త్రములచేఁ జంపఁ జాలవు. అది సాధ్యము కాదని తోఁచెనేని మాయచేనైన వధింపుమని సూచన.

మత్తకోకిలము. యోజనం బొనరింపఁ దోఁచని•యుక్తి యొక్కఁడు లేదు నీ
కాజికేళి నసాధ్య మౌ పని•యైన నేదియు లేదుగా
యీ జగత్త్రయి నీదు దర్ప మ•హీనవిస్ఫురితాస్త్రసం
యోజితాద్భుతశక్తి యెవ్వరి•కో నెఱుంగరు పుత్రకా! ౧౧౧

తాత్పర్యము.

ఆలోచించితివేని నీకుఁ దోఁచని యుక్తి యొక్కటైనను లేదు. అన్ని యుక్తులాలోచింపను, వానిని గొనసాగింపను నీవే నేర్తువు. యుద్ధమందు నీ కసాధ్యమైనది

తే. కంటె నీ యందు విశ్వాస•మంట నిన్నుఁ, బనుప వలసెను వానిదు•బలముఁ జలము
చక్కఁ బరికించి నీ బలశౌర్యములను, దనమురూపంబు సేయుము•తనయ శత్రు.

అర్థములు. కాలకింకరులను = యమకింకరులను, దంబు = దేజము, పంచత = మరణము, పదవదశే - బాల్యకౌమార యౌవన జరా మరణంబులను వానిలో నైదవది. దేహము నందలి పంచభూతములు కలయిక మాని వేఱై పోవును గావున పంచత. అలవరించెను=కలిగించెను. పతీపుల నెల్లన్=సేనల నన్నిటిని, విదళన పఱిచెన్ = చీల్చివైచెను, ఎల్లయందు=ఎల్లవారి యందుకంటె, విశ్వాసము=నమ్మకము, ఇంద్రజితా = ఇంద్రజిత్తుఁడా అనుదాని సంబోధనరూపము. ఋత్విగాదులు గూఁ.........విభాషయు. తత్సమ ౪౨ సూ. సు. వ్యా. ఈ సూత్రప్రకారము ఇంద్రజిత్తు, ఇంద్రజిత్తుఁడని రూపంబులు. జగదింద్రజిత్తుల తకారంబునకు లోపంబు విభాషయు. సు. వ్యా. తత్స ౯౧ ప్రకారము ఇంద్రజి - ఇంద్రజిత్తని రూపములు.

ఎల్లయందు = ఎల్ల శబ్దము క్రుదంతంబయిన యవ్యయంబు. "సదృశం త్రిషు లింగేషు సర్వాసుచ విభక్తిషు వచనేషుచ సర్వేషు యన్నవేతి తదవ్యయ" మ్మని యవ్యయ లక్షణము. అనఁగా మూఁడు లింగములందు, అన్ని విభక్తులందు, ఎల్ల వచనంబులందు నేకవిధముగ నుండునది యవ్యయము. అట్టి లుండియు అవ్వ ఉను నవ్యయమునకు అప్పటికి నని రూప మున్నట్లు ఎల్లయందు నని ప్రయోగములు గలవు. 'ఎల్లయందును దా నసియుండుఁగాక' భార. ఉద్యో. ౧ ఆ. "ఎఱుఁగె సకల శాస్త్రంబుల నెల్లయందు" భార. ఆది ౨ ఆ. ఈ శబ్దము విశేష్యముగను ప్రయోగములు గలవు. "ఎల్లం జూపెగ," భార. కర్ణ ౧ ఆ. ౧౪౬ ప. "ఎల్లఁజూపి" ౩ఆ. ౧౧ ప.

తాత్పర్యము.

నాయనా! కింకరులను, జంబుమాలిని, మంత్రిపుత్రులను, సేనానాయకుల నేవురను సేనలతోడ వానరుఁడు చంపెను. అందఱికంటె నీ యందు నాకు నమ్మకము మెండు. కావునఁ దక్కిన వారిని బంపిన గెలిచి వత్తు రను నమ్మకము లేదు. నీవు గెలిచి వత్తు వను నమ్మకము గలదు. కావున నిన్నుఁ బంపవలసి వచ్చెను. వానరుని బలము, చలము చక్కఁగాఁ బరీక్షించి దానికిఁ దగినట్లు నీ బలశౌర్యములను జూపుము.

మత్తకోకిలము. సేన యంతయు వానరేంద్రుని•చే హతం బయి పోకమున్
వాని నస్త్రవిదగ్రగణ్య! జ•వంబునైఁ బరిమార్పుమీ
వానిఁ దాఁకఁగఁ బోవు ముందుగ • వానిశక్తి స్వశక్తియున్
మానసంబునఁ జక్కఁజూచు ప్ర•మాదముం బడఁబోకుమీ. ౧౧౦౫

తాత్పర్యము.

వానరుని జంపుటయందు నీ వెంత యాలస్యము చేసెదవో యంత మన సేన

నాశ మగును. కావున మనసేన వానిచే నాశము గాక ముందే యస్త్రములచే వాని వేగముగఁ జంపుము. ఉత్తమ బాణప్రయోగములఁ గాలము వ్యర్థపరుపము. వానిపై బడి పోకముందే వాని శక్తి యే మాత్రమో, నీ శక్తి యే మాత్రమో, చక్కఁగాఁ బరీక్షింపుము. హెచ్చరిక తప్పకుము.

మత్తకోకిలము. సేన కావఁగ లేదు నిన్నని • సిద్ధ మయ్యెని, సేన లె
న్నైనఁ బ్రాఁకిన ద్రుంచు వాఁడు, మ•హాబలోపమవేగు వై
శ్వానరాభుని డాయఁ బోకుము • వజ్రమున్ ధరియించి రోయం
జేని ముష్టిరణంబు సేయఁగ•నేని మర్దితశాత్రవా. ౧౧౦౯

అర్థములు. మహాబలోపమ వేగున్ = వాయువుతో సమానమైన వేగము గలవానిని; వైశ్వానరాభునిన్ = అగ్నితో సమానుని, వజ్రమున్ = ఇది యింద్రుని వజ్రము కాదు. విష్ణుచక్ర మన్నట్లు ఇది యొక యాయుధము. చూచుటకు వజ్రము వలె నుండును. ఇది శస్త్రమె కాని యస్త్రము కాదు. దీనిని సామాన్యరాక్షసులు కూడ ధరించి తిరుగుచుండి రని ౧౧౩ వ పద్యమునఁ గలదు.

తాత్పర్యము.

ఇరువురు యోధులు విండ్లతో దూరమున నుండి యుద్ధము చేయునపుడు సేన లడ్డమువచ్చి రక్షింపఁగలవు. ఈ వానరుఁ డిట్టివాఁడు కాఁడు. ఒంటరిగా నీ మీఁదనే దూఁకును. అప్పుడు సేన లేమి చేయఁగలవు? కావున నీవు సేనల నమ్ముకొని పోవుట వ్యర్థము. సేన లెన్ని లక్షలైనను వాఁడు చంపును. నీవు వజ్రము ధరించి యైనను వాని మీఁదికిఁ బోకుము. వాఁడు వాయువువలె నలుప్రక్కలఁ దిరుగుచుండును. ఏ మూల నుండి నిన్నుఁ గొట్టునో! అది గాక వజ్రము కదలక యుండు వానిని గొట్టఁ గలదు. గాలి నెట్లు నఱకఁగలదు. కావున శస్త్రముల నమ్మవలదు. అట్లు పైఁ బడిన ముష్టితోఁ గొట్టవ నందు వేమో. వాఁ డగ్నివంటి వాఁడు. వాఁడు పడినచోట నెల్ల భస్మము చేయును. అగ్నిహోత్రుని ముష్టిదెబ్బ లేమి చేయఁగలవు. కావున వానితో ముష్టి యుద్ధము సేయ యత్నింపకుము.

మత్తకోకిలము. ఇంతయుం దలపోయుమీ మతి•యేది యుక్తము చూచుమీ
యంత నింతను బోదు వాఁడు మ•హాస్త్రముల్ స్మరియింపుమీ,
స్వాంతమున్ నిజవృత్తియున్ శర•పాత మొక్కటిగాఁగ దు
ర్దాంతశక్తి రణంబు సేయుము • తాల్మి, పైఁబడకుండ బటున్. ౧౧౧౦

అర్థములు. అంతనింతన్ = అల్పప్రయత్నముతో, సులభముగా, స్వాంతము = మనస్సు, శరపాతము = బాణము పడుట, తాల్మిన్ = తొందరపడక, నిబ్బరముగ.

తాత్పర్యము.

ఇప్పుడు నేను జెప్పిన దంతయు నాలోచింపుము. దీనిలో నొక్కడికిఁ బోయినపు డేది యుక్తమో యది చేయుము. అల్పప్రయత్నముతో వాఁడు సాధ్యుఁడు

కాఁడు. కావున బ్రహ్మాస్త్రాది మహాస్త్రములను స్మరింపుము. మనస్సు-దృష్టి-బాణము మూఁడును నేక కాలమందు నేక ప్రదేశమందుఁ బడునట్లు యుద్ధము చేయుము. వానిని తెలిసి నేయుటయును. కొందఱ మనసును. నిర్భరముగ మనస్సునఁ గలఁత లేక యుద్ధము చేయుము. జయము కలుగును.

క. బాలుని నినుఁ బంపఁగ రా, నాలమునకు నాకుఁ దెలియు నైనను ధరణీ
పాలురకు క్షత్రనీతియు, వాలాయము గాని దాని వచ్చునె చెప్పుమా. ౧౧౦౮

అర్థములు. ఆలమునకు = యుద్ధమునకుఁ క్షత్రనీతియు = రాజధర్మమే, వాలాయము = నిర్బంధము, అతిక్రమింపరానిది.

తాత్పర్యము.

చిన్నవాఁ డుండఁగా యుద్ధమునకుఁ బిల్లవాని నిను బంపుట సరిగా దని నాకుఁ దెలియును. అయినను మనము రాజులము. మనకు క్షత్రియ ధర్మము నిర్బంధము. తక్కిన వారివలె మనము ప్రవర్తింపరాదు. క్షత్రియ ధర్మప్రకారము రాజ ముందుగ యుద్ధమునకుఁ బోరాదు.

ఇందు క్షత్రియులగు రాజుల కిది ధర్మమని చెప్పుటచేఁ దాను క్షత్రియుఁడనని యంగీకరించినట్లాయెను. ఇదియొక ప్రస్తుత విషయము. రావణాసురుని కంటె వాని జాతి విషయము తమకుఁ దెలిసినట్లు కొందఱు వాఁడు బ్రాహ్మణుఁ డనియు వానిని జంపుటచే శ్రీరామచంద్రమూర్తికి బ్రహ్మహత్య వచ్చెననియుఁ జెప్పెదరు. బ్రహ్మహత్య విచారము యుద్ధకాండమునఁ జేయఁబడును. ఇచ్చట వారలు మాటలు సత్యమా? తక్కినవారి మాటలు సత్యమా? విచారింప వలయును. ఎట్టివాఁడు బ్రాహ్మణుఁ డని శాస్త్రములు, వాని జాతి నిర్ణయించు చున్నవో చూతము.

శ్లో. సర్వవర్ణేషు తుల్యాసు, పత్నీ ష్వక్షత యోనిషు
ఆనులోమ్యేన సంభూతా, జాత్యా జ్ఞేయాస్త ఏవ తే. మను. ౧౦-౫.

బ్రాహ్మణాదు లగు నాలుగు జాతులవారు నాలుగు జాతులలోను శాస్త్రవిధి ప్రొప్పునఁ బెండ్లియై వ్యభిచార దోషము లేని సవర్ణజాతి పత్నుల యందు, అనఁగా బ్రాహ్మణునకు బ్రాహ్మణి యందును, క్షత్రియునకు క్షత్రియ యందు, నీ విధముగ నా యా జాతుల వారికి నా యా జాతుల స్త్రీల యందుఁ బుట్టిన వారు మాతాపితల జాతి గలిగి సజాతియు లనఁబడుదురు. శ్లోకమున పత్నులయందు అని ప్రయోగింపఁ బడుటచే బ్రాహ్మణునకు తాను శాస్త్రప్రకారము వివాహము చేసికొనని యన్యబ్రాహ్మణ స్త్రీయందు జనించినను వాఁడు బ్రాహ్మణుఁడు గాఁడు. ఈ విషయము దేవలుఁ డిట్లు చెప్పెను. 'వ్యతీయేన తు యః పిత్రా సవర్ణాయాం ప్రజాయతే। అవవాట ఇతి ఖ్యాతః, శూద్రధర్మా సజాతితః। వ్రతహీనా నసంస్కార్యాః స్వతంత్రా స్వపి యే సుతాః। ఉత్పాదితా సవర్ణేన, వ్రాత్యా ఇవ బహిష్కృతాః' సవర్ణ స్త్రీయందు రెండవ తండ్రికిఁ బుట్టినవాఁడు అవవాటుఁ డనఁబడును. వాఁడు జాతిచే

శూద్రధర్మము గలవాఁడే. వానికి బ్రహ్మచర్యాది వ్రతములు, ఉపనయనాది సంస్కారములు లేవు. వాఁడు వ్రాత్యునివలె బహిష్కరింపఁబడఁ దగినవాఁడు.

'యేను జాతా స్సమానాసు సంస్కార్యాస్స్యు రతోన్యథా' యని వ్యాసులు చెప్పెను. 'సవర్ణేభ్య స్సవర్ణాసు జాయంతే హి సజాతయః' అనియు 'వివాహేష్వేవ విధిః స్మృతః' వివాహమున భార్యాభర్తలుగ నైన వారియందే యీ విధి యని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను.

'స్త్రీష్వనంతర జాతాసు ద్విజైరుత్పాదితాన్ సుతాన్। సదృశానేవ తానాహు ర్మాతృదోష విగర్హితాన్.

దీనికి వ్యాఖ్యాన మిట్లు వ్రాయఁబడినది.

అనులోమముగా నవ్యవహిత వర్ణ జాతీయభార్యలందు నెవరు పుట్టుదురో అనఁగా బ్రాహ్మణునకు క్షత్రియ స్త్రీ యందు, క్షత్రియునకు వైశ్య స్త్రీయందు, వైశ్యునకు శూద్ర స్త్రీ యందు, పుట్టిన కొడుకులు తల్లి యొక్క హీనజాతి వలన నిందింపఁబడిన వారై పితృసదృశు లగుదురే కాని తండ్రి జాతివారుకారు. పితృసదృశు లని చెప్పుటచే తల్లి జాతికంటె నెక్కువవారు, తండ్రికంటె నికృష్టు లగుదు రని తెలియ వలయును. వరుసగా వీరికి మూర్ధాభిషిక్తుఁ డనియు, మాహిష్యుఁ డనియు కరణజాతివాఁ డనియుఁ బేళ్లు వచ్చును గాని బ్రాహ్మణుఁడు, క్షత్రియుఁడు, వైశ్యుఁడు, నను పేర్లు రావు. వీరికి వృత్తులు వేఱువేఱుగా విధింపఁ బడినవి. బ్రాహ్మణునకు వివాహిత లగు క్షత్రియ వైశ్య శూద్ర స్త్రీలయందుఁ బుట్టిన ముగ్గురు - క్షత్రియునకు వైశ్యశూద్ర స్త్రీలయందుఁ బుట్టిన యిద్దఱు, వైశ్యునకు శూద్ర స్త్రీయందుఁ బుట్టిన యొకఁడు - ఈ యార్గురు అపసదు లనఁ బడుదురు. (అపసదు లనఁగా నికృష్టులు - అని మనువు)

విప్రస్య త్రిషు వర్ణేషు, నృపతే ర్వర్ణయో ర్ద్వయోః
వైశ్యస్య వర్ణే చైకస్మిన్, షడేతేఽపసదాః స్మృతాః.

మనువు. ౧౦-౧౦.

బ్రాహ్మణేన క్షత్రియాయా ముత్పాదితః క్షత్రియ ఏవ భవతి, క్షత్రియేణ వైశ్యాయాం వైశ్య ఏవ, వైశ్యేన శూద్రాయాం శూద్ర ఏవేతి శంఖస్మరణమ్. వైద్యనాథీయము.

బ్రాహ్మణునకు వివాహిత యగు క్షత్రియస్త్రీయందుఁ బుట్టినవాఁడు క్షత్రియుఁడే; క్షత్రియునకు వైశ్య స్త్రీయందుఁ బుట్టిన వాఁడు వైశ్యుఁడే; వైశ్యునకు శూద్రస్త్రీయందుఁ బుట్టినవాఁడు శూద్రుఁడే యని శంఖుఁడు.

కావున బ్రాహ్మణుఁడైన విశ్రవసునకు వివాహము చేసికొనని రాక్షస క్షత్రియ యందుఁ బుట్టిన రావణుఁడు బ్రాహ్మణ జాతివాఁ డెట్లగును? ఇఁక గుణ కర్మములఁ బట్టి చూతము.

బ్రాహ్మణునకు బ్రాహ్మణ జాతి స్త్రీయందుఁ బుట్టినవాఁడైనను బ్రాహ్మణ గుణకర్మములు లేనివాఁడు బ్రాహ్మణుఁడు గాఁడు. వాఁడే వృత్తియందున్నాఁడో యా జాతివాఁడుగానే యున్నవాఁడగును. 'బ్రాహ్మణః క్షత్రియత్వం హి యాతి శస్త్ర సముద్యమాత్' అని భీష్ముఁడు పరశురామునితో ననెను. బ్రాహ్మణుఁడా! నీవు శస్త్రము ధరించుటచే క్షత్రియుఁడ వైతివి. కావున నిన్నుఁ గొట్టెద ననెను.

విశ్వామిత్రుని తాత కుశుఁడు, బ్రహ్మపుత్రుఁడైనను ఆయన వంశము వారందఱు క్షత్రకర్మ మవలంబించుటచే క్షత్రియులైరి. కాని బ్రాహ్మణు లనఁబడలేదు. వ్యాసులకు శూద్రస్త్రీయందుఁ బుట్టిన విదురుఁడు శూద్రుఁ డయ్యెను గాని బ్రాహ్మణుఁడు కాలేదు. ఋషుల జన్మమునుగూర్చి యుత్తరకాండమునఁ జెప్పఁబడును. ఈ కారణములచే రావణుఁడు జాతి గుణకర్మములచే క్షత్రియుఁడే కాని బ్రాహ్మణుఁడు కాఁడు. అయోధ్య ౨౮.౨౮ వ్యాఖ్య చూడనగు.

కావున రావణుఁడు తాను క్షత్రియుఁడ నని క్షత్రియధర్మ మనుసరించి నిన్నుఁ బంపుచున్నా నని యింద్రజిత్తుతోఁ జెప్పినమాట శాస్త్రసమ్మతమైనది. రావణాసురుఁడు క్షత్రియుఁ డని చెప్పఁబడుట యిచ్చట మాత్రమే కాదు.

క. పరలోక సుఖముఁ గోరెడి, పురుషులు వెనుదీయక వెనఁగి • హరియించు రనిలో
ధర క్షత్రధర్మమున సం, గరమునఁ జెడువారి కెన్నఁ గా న్యాయంబే.

యుద్ధ. ౨౮౯.

క. క్షత్రియ సమ్మతము పురా, ధాత్రీనాథేంద్రులకు గలగతి యిది యా
క్షత్రియుల కాహవోర్వి, గాత్రము నర్పించు టొప్పు కన్నా రెంకున్.

యుద్ధ. ౨౯౦౨.

రావణునకు జరపిన యుత్తరక్రియల విధానము పరిశీలించినచో నవి బ్రాహ్మణులకుఁ జేయు కార్యములు గావని స్పష్టపడును,

పుత్రా యే ఽనన్తర స్త్రీజాః, క్రమేణోక్తా ద్విజన్మనామ్
తా ననన్తరనామ్న స్తు, మాతృదోషా త్ప్రచక్షతే

మను. ౧౦-౧౪.

ద్విజులకుఁ దమ వెంబడి జాతులందుఁ బుట్టిన బిడ్డలకు వారి తల్లియొక్క హీన జాతినిబట్టి హీనజాతులందుఁ బుట్టినవారుగా నెంచఁబడుదురు. కనుక మాతృ జాతికిఁ దగిన సంస్కారమునకు వత్తురు. మీఁద వ్రాసిన దంతయు వివాహిత లైన స్త్రీలకుఁ బుట్టిన వారి విషయము. రావణుఁడు వివాహిత స్త్రీకిఁ బుట్టినవాఁడు కాఁడు. విశ్రవసుఁడు కైకసిని వివాహ మాడలేదు. దాని తండ్రి కన్యాదానము చేయలేదు. సమీపమందుండుటచేత కైకసి బిడ్డలు గోరి వచ్చెను. కావున విశ్రవసుఁడు బిడ్డల ననుగ్రహించెను. కావున నాతని యుంపుడు కత్తె వంటిది. కావున నమలోమ జాతుల కంటె రావణుఁడు హీనుఁ డగుచున్నాఁడు. ఉత్త. కాం. స. ౧౦౪-౧౦౮. భగిన

ద్వేషి యైన సుమాలియొక్క పుత్రిక యగు కైకసి ప్రదోషకాలమందు విశ్రవస్సును బొందినది. కాబట్టి మాతృదోషము వల్ల రావణుఁడు కర్మచండాలుఁడై యుత్పన్నుఁ డైనాఁడని చెప్పవలసి వచ్చును. అంతియ గాక భగవద్భాగవత విషయము లైన యపచారములవల్ల నితఁడు కర్మచండాలుఁ డనుట సహజము.

క. కావున నిన్నంపిన నా, నావిధమహాశస్త్రముల మా•నసంబునఁ గను సం
ధానించుచుఁ బోరుము పుత్రా! విజయముఁ గొమ్ము పోయి • రమ్మా సుమతీ !

తా త్ప ర్య ము.

క్షత్రియ ధర్మమును మన మతిక్రమింపరాదు. కావున నిన్నుఁ బంపుచున్నాను. అనేకవిధము లైన గొప్ప యస్త్రములను మనస్సున స్మరించుచు యుద్ధము చేయుము. కుమారా! పోయి జయించి రమ్ము.

—• ఇంద్రశత్రు హనుమంతుని మీఁదికి యుద్ధమునకుఁ బోవుట. —

చ. అని జనకుండు పల్క విన•యంబున నాతనికిం బ్రదక్షిణం
బొనరిచి దక్షపుత్రనిభుఁ • డుద్ధతి సన్నహనంబు సేసి బం
ధునిచయపూజితుం డగుచుఁ • దూర్ణము పర్వమువేళ వార్ధిరీ
తిని ఖగరాజవేగహరి•దీప్తరథంబును నెక్కి వెల్వడెన్. ౧౨౦

అర్థములు. దక్షపుత్రనిభుఁడు = దేవతలతో సమానుఁడు, 'మనసా చైవ భూతాని పూర్వం దక్షో ఽసృజత్తథా। దేవా నృషీన్ సగంధర్వా నురగాన్ పక్షిణ స్తథా' యని వి. పురా. వాక్యము ప్రమాణము. ఉద్ధతిన్ = గర్వముచే, సన్నహనంబు = వ్యూహప్రయత్నము, బంధునిచయ పూజితుఁడు = చుట్టముల గుంపులచే గౌరవింపఁ బడిన వాఁడై; తూర్ణము = వేగముగ, పర్వమువేళ = పున్నమనాఁడు; వార్ధిరీతిని = సముద్రమువలె, ఖగరాజవేగ = గరుత్మంతుని వేగము గల, హరి = గుఱ్ఱములచే, దీప్త = ప్రకాశించు, రథంబును = తేరిని.

తా త్ప ర్య ము.

ఈ ప్రకారము తండ్రి చెప్పఁగా వినయముతో నాయనకుఁ బ్రదక్షిణము చేసి దేవతలతో సమానుఁ డగు నింద్రశత్రు గర్వించి యుద్ధమునకుఁ దగిన ప్రయత్నము చేసి బంధువు లందఱు గౌరవింపఁగా వేగముగఁ బున్నమనాఁటి సముద్రమువలెఁ బొంగి గరుడ వేగముతో సమానవేగము గల గుఱ్ఱములు కట్టిన తేరెక్కి యిల్లు వెడలెను.

ఉ. ఆ రథికోత్తముండు పవ•నాత్మజు చక్కటి కేఁగ నాతఁ డా
ఘోరతరాంగనిస్స్వనము • క్రూరతరాసురారవంబులున్
భూరితరంబు గావుటయుఁ • బొంగి గరిమ్నటి నించె వర్యమునం
దారులు నాగయుక్తముషి•వత్తము లుబ్బిన మాడ్కి నొప్పఁగన్. ౧౨౧

అర్థములు. ఘోరశతాంగ నిస్వనము=భయంకరమైన తేరి ధ్వని, క్రూర శరాసనటంకారవంబులున్=కఠినములైన యల్లెత్రాటి ధ్వనులును, గర్జన్మటి=కంఠధ్వని, వ్యోమ సంచారులు=ఆకాశమందుఁ దిరుగువారు, ఉబ్బునన్ = సంతోషముతో.

తాత్పర్యము.

రథికులం దుత్తముఁడైన యా యింద్రజిత్తు హనుమంతుఁ డున్న చోటికి సరిగాఁ బోఁగా వచ్చిన రథచక్రధ్వని; అల్లెత్రాటిమ్రోఁత మిక్కిలి యతిశయింపఁగాఁ దగిన వాఁడే వచ్చుచున్నాఁడని హనుమంతుఁడు సంతోషించి సింహనాదము చేసెను. ఆకాశమున సంచరించువారు నాగులు, యక్షులు, బుషిశ్రేష్ఠులు, సంతోషముతో గుంపుఁగూడిరి.

చ. దరకరభూరిచాపమును • దారుణశాతశిలీముఖంబులున్
వరబలుఁ డుద్ధరింగొని జ•వంబున సంగరకాంక్షఁ బోవ భీ
కరముగఁ గూసె సత్త్వములు • కాంతి దొఱంగె దిశల్ విహంగమో
త్కరములు మింటఁ బెక్కులు వి•ధంబుల నార వొనర్చె భీతిచేన్. ౧౧౧౨

అర్థములు. దరకర = భయంకరమైన, భూరి=గొప్పదగు, చాపము = విల్లు, దారుణ శాతశిలీముఖంబులున్ = భీతిని గలిగించు పదునైన బాణములు, వరబలుఁడు=ప్రశస్తమైన బలము గలవాఁడు, బ్రహ్మవరబలము గలవాఁడు; సంగర కాంక్షన్=యుద్ధమునందలి కోరికతో - సత్త్వములు = జంతువులు, విహంగమ + ఉత్కరములు = పక్షిసంఘములు.

తాత్పర్యము.

భయంకరమైన పెద్దవింటిని, పదునైన బాణములను దీసికొని యుద్ధమునందలి కోరికచే వేగముగఁ బోఁగా మృగములు గూసెను. దిక్కులు కాంతి మాసెను. పక్షులు భయపడి యాకాశమున కెగసి నానావిధములఁ గూసెను.

శా. జ్యాటంకారవిపాటితాశుఁ డగుచున్ • శక్రారి నిర్వక్ర మ
హాటోపంబున బాణవర్షములతో • నవ్వానరున్ డాయ నృ
త్తాటోపం బుద్భటవైరిభీతికరగ•ర్జాస్ఫోటితోర్వీధ్రుఁడై
యూటాడంగ ధరాతలంబు నిజవే•గోద్ధూతజీమూతుఁడై. ౧౧౧౩

అర్థములు. జ్యాటంకార = అల్లెత్రాటి టంకారముచే, విపాటిత + ఆశుఁడు = చీల్పఁబడిన దిక్కులు గలవాఁడు, శక్రారి = ఇంద్రజిత్తు, నిర్వక్రము = వంకరలేనిది. ఆటోపంబున=వేగమున, నృత్తాటోపంబు = కోఁతి, ఉద్భట =మిక్కిలి; గర్జా = సింహనాదముచే, స్ఫోటిత = చీల్పఁబడిన, ఉర్వీధ్రుఁడై = కొండలు గలవాఁడై, ఊటాడంగన్ = ఊఁగులాడఁగా - నిజ = తన, వేగ = వేగముచే - ఉద్ధూత = ఎగురఁ గొట్టఁబడిన, జీమూతుఁడై = మేఘములు గలవాఁడై.

ధృతి సెంపారఁ జరుఁడు, నెట్టెదు కుటన్ • దృగ్గోచరుంచో, తళో
గతుఁడో, వెంటనె మీఁద మూఁకుఁ, గనయు • గ్రం లక్ష్యగించు న్వెసన్. ౧౧౧౫

అర్థములు. కృతహస్తుఁడు = బాణములు గురితప్పక వేయువాఁడు, 'కృతహస్తః సుప్రయోగ విశిఖః - కృతపుంఖవత్'. అమర. వితిగాఁ=వ్యర్థముగా, అంతరమునన్ = నడుమ.

తాత్పర్యము.

గురి తప్పక వేయు నింద్రజిత్తు తన మీఁద వేయు బాణములను వ్యర్థపఱుచుచుఁ దనను దగులకుండఁ జేసికొనుచు నా బాణములకు నడుమ మిగుల వేగముగా తిరుగును. ఎట్టెదుటఁ గానవచ్చును. ఎదుట నున్నాఁడని బాణము వేయునంతలో నాకాశమున నుండును. అంతలో మీఁద దూఁకును. వేఁటు లక్ష్యము సెట్టును.

ఉ. ఇద్దఱు యుద్ధకర్మచణు • లిద్దఱు భూరిజవాధికోత్తముల్
సద్దుగఁ జేసి రిద్దఱు న • సాధపరాక్రమ ముల్లసిల్లఁగా
నద్దిర నాఁగ భూతనిచ • యంబు, పరస్పర తారతమ్య మా
యుద్ధ తెలుంగఁ జేరి యసు • రేశ్వరనందన వాయునందనుల్. ౧౧౧౬

అర్థములు. యుద్ధకర్మచణులు = యుద్ధము చేయుట యందు సమర్థులు, భూరి = గొప్ప, జవాధిక = మిక్కిలి వేగమునందు. ఉత్తములు = గొప్పవారు.

తాత్పర్యము.

ఇద్దఱు యుద్ధమందు సమర్థులు, ఇద్దఱు నతివేగము గలవారు. అంతములేని పరాక్రమముతో భూతసమూహము లాశ్చర్యపడఁగా యుద్ధము చేసిరి. ఇంద్రజిత్తు-హనుమంతులు పరస్పర తారతమ్యము నెఱుఁగ లేరైరి.

చ. హనుమ నెఱుంగఁ డయ్యె నసు • రాధిపనందను నంతరంబు, నా
దనుజుఁ డెఱుంగఁ డయ్యె వసు • ధాసుహితాత్ముని యంతరంబు, నా
యనఘులు పోరఁ దో దృఢస • మాధిని నింద్రజి బాణముల్ వృథా
చనుటయు గాని కీశవరుఁ • జక్కఁగ నాటవ దేమి సేయుదున్. ౧౧౧౭

అర్థములు. అంతరము = ఛిద్రము - లోపము, వసుధాసుహితాత్ముని = క్రోఁతియొక్క, దృఢసమాధిని = గట్టి నిశ్చల మనస్సుతో, ఇంద్రజి = ఇంద్రజిత్తు, అనఘులు = యుద్ధకర్మమందు దోషము లేనివారు.

తాత్పర్యము.

ఇంద్రజిత్తునందలి లోపము హనుమ తెలిసికొనలేఁడయ్యె. హనుమలోపము నింద్రజిత్తు తెలిసికొనలేఁడయ్యె. ఇట్లు యుద్ధకర్మమందు లోపములేక పోరునప్పుడు ఇంద్రజిత్తు తనలో నిట్లు లాలోచించెను. నా బాణము లన్నియు వ్యర్థములై పోవుచున్నవి. కాని వానిలో నొకటియైన క్రోఁతిని దాఁకినది లేదే. ఏమి సేయుదును ?

—• ఇంద్రజిత్తు హనుమంతుని బ్రహ్మాస్త్రమున బంధించుట. •—

ఉ. చిక్కఁడు లక్ష్యసిద్ధికిని • జేవడి వీని వధింప శక్యమా
యొక్కరణిం గ్రహింప నగు • నీతని నంచుఁ బితామహాస్త్రమున్
గ్రక్కున నారికిం దొడిగి • రావణి పావని వైచి కట్టె నేఁ
డుక్కరి యొంటఁ బోఁ డనుచు • నుర్విపయిం బడె వానఁ గోఁతియున్. ౧౧౯

అర్థములు. జేవడి = జేవ వేగముచే, పితామహాస్త్రమున్ = బ్రహ్మాస్త్రమును, నారికిన్ = అల్లెత్రాటికి, తొడిగి = సంధించి, ఉక్కరి = బలశాలి, ఒంటఁబోఁడు = మఱియొక విధముగఁ జిక్కఁడు.

తాత్పర్యము.

నా గురికి వీఁడు చిక్కుటలేదు. భుజబలముచే వీనిని జంప సాధ్యముగాదు. ఏ విధముగ వీనిని గట్టివేయ సాధ్యమగునని యాలోచించి బ్రహ్మాస్త్రమును వింట సంధించి యింద్రజిత్తు వీఁడు మఱియొక బాణమునకు సాధ్యుఁడు కాఁడని యాంజనేయునిమీఁద వేసి కట్టెను. దానితోఁ గోఁతి నేలఁబడెను.

ఉ. వ్రాలి విచేష్టుఁడై పవన•సూనుఁడు బ్రహ్మవరంబు నెంచి దో
ర్లీల నడంచి నిర్జరవ•రిష్ఠుని యానతి దాఁట శక్యమా
పాలన సేయుటే పరమ•భవ్యము చిక్కితిఁ బో భయంబు లే
దోక్షిఁ బితామహుండును బి•డౌజుఁడు వాయువు నన్నుఁ గావఁగన్. ౧౨౦

అర్థములు. వ్రాలి = నేలఁబడి - విచేష్టుఁడై = కాలుసేతులు కదలింపనివాఁడై, దోర్లీలన్ = భుజబలమును - నిర్జర వరిష్ఠుని = దేవతాశ్రేష్ఠుఁడగు బ్రహ్మయొక్క - ఆనతి = ఆజ్ఞ, పితామహుండును = బ్రహ్మయు - బిడౌజుఁడును = ఇంద్రుఁడును, నాలుగవపాదంబున వృద్ధివళి గావున బిడ+ఓజస్ లోని ఓకారముతో యతి చెల్లెను.

తాత్పర్యము.

కాలు సేతులు కదలింపలేక నేలఁబడి యాంజనేయుఁడు బ్రహ్మ తన కిచ్చిన వరము స్మరించి భుజపరాక్రమము చాలించి బ్రహ్మ యాజ్ఞ దాఁటవచ్చునా? దానిని రక్షించుటే మిగుల శ్రేయస్కరము. వీరికిఁ జిక్కితిని గో నాకు వరము లిచ్చిన బ్రహ్మ యింద్రుఁడు తండ్రి యగు వాయువు నన్ను రక్షింపఁగా నాకు గాఁగల భయమేమి?

క. నను బట్టుకొనుచుఁ బోదురొ, దనుజులు పోవుదును గాక • దశకంధరునిం
గనుఁగొని సంభాషింపఁగఁ, జను నదియును కొక్కమేలె • చర్చింపంగన్. ౧౨౧

తాత్పర్యము.

వీరిచేతఁ జిక్కితిని గో వీరు నన్నేమి చేయుదురు. రావణాజ్ఞ లేక వీరేమియుఁ నన్నుఁ జేయఁజాలరు. కావున వీరు నన్నుఁ బట్టుకొని రావణు నొద్దకుఁ దీసికొని

పోదును. పోని రావణునితో సంభాషింపఁ గలుగుదును కావున నవియు నోర్చి నీచే
వాని యభిప్రాయము తెలిసికొనినట్టు లగును గదా.

ఆ. అని సమీక్ష్యకారి • యగు హనుమంతుఁడు, చేష్ట లుడిగి యుండి • దుష్ట లతని
నారఁ ద్రాళ్ళఁ బెనచి•నారచీరలు గట్టి, గూఁతలిడినఁ గ్రోఁతి•గుణముఁ దెలుప.

అర్థములు. సమీక్ష్యకారి = ఆలోచించి కార్యము చేయువాఁడు. సమ్ +
ఈక్ష్ + కృ + ణిని ధాతువులు సమీక్ష్యకారి = ఈక్షించుట = చూచుట – వీనికి పర్యా
యశబ్దములను నాలోచించుట యని యర్థము గలదు. అతని = ఆక్రమించి.

తాత్పర్యము.

చక్కఁగా నాలోచించి కార్యముచేయు నా హనుమంతుఁడు కదలక మెదలక
యూరకుండి యా దుష్టరాక్షసులు పైఁబడి నార త్రాళ్ళతో నార గుడ్డలు పెనవేసి
తన్నుఁ గట్టుచుండఁగాఁ దన క్రోఁతి గుణము తెలుపుటకై కూఁతలు పెట్టుచుండెను.

—• రాక్షసులు హనుమంతునిఁ గట్టి రావణు కొద్దకుఁ దీసికొని పోవుట. •—

చ. కదలక యుండ నిర్విచేష్టుఁ డగు•కైసరి నాశరవార మెల్లఁ గిం
కను బలితంపుఁ బగ్గములఁ • ద్రాళ్ళమునన్ ద్రుమచీరపాళితోఁ
గొనకొని కట్టఁగా నసుర•కుంజరుఁ డుత్కటకౌతుకంబునన్
గను దను నంచు నోర్చి కపి • కట్టులు పైఁచి యణంగి యుండఁగన్. ౧౧౨౩

అర్థములు. నిర్విచేష్టుఁడు = ఏ చేష్టలు లేనివాఁడు, కైసరిన్ = హనుమం
తుని, కేసరి పుత్రుఁడు కైసరి–అపత్యార్థక తద్ధితము. ఆశరవారము=రాక్షస సమూ
హము. ద్రుమ చీరపాళితో = చెట్లపట్టలతో నైన వస్త్రములు సమూహముతో–కొన
కొని = ప్రయత్నించి.

తాత్పర్యము.

ఇట్లు హనుమంతుఁడు చేష్ట లుడిగి పడి యుండుట చూచి చూచి రాక్షసులు
కోపించి, బలముగల పగ్గములను నారవస్త్రములతోఁ బెనవేసి ప్రయత్న పూర్వక
ముగాఁ గట్టఁగా రావణాసురుఁడు మిగులఁ గౌతుకముతోఁ దన్నుఁ జూచును గాక యని
హనుమంతుఁడు కట్లు సహించి యూరకుండెను.

ఉ. అసురలు త్రాళ్ళఁ బగ్గముల • నా హనుమంతునిఁ గట్టినంతనే
వెస వెస నస్త్రబంధమును • వీడి చనెన్, ద్రుహిణాస్త్రబంధముల్
పసచెడి పోవు నన్య ముగు•బంధనయుంబులతోఁ డఁ గూడినన్
లసదసమాస్త్ర మీఁగతి ఫ•లం బఱిపోవుట చూచి కీశుఁ డై. ౧౧౨౪

అర్థములు. ద్రుహిణాస్త్రబంధముల్ = బ్రహ్మాస్త్ర బంధనములు, లసత్ =
దివ్య తేజస్సుతోఁ బ్రకాశించు, అసమాస్త్రము = సమానము లేని యస్త్రము –
ఫలంబఱి = ఫలము చెడి.

సీతాదేవి యొద్దను నొంటితల సన్న్యాసిగాఁ బోయి యున్నట్టుండి పదితలల వాఁ డగుటకు నీ బచ్చెన తలలును, చేతు లెందుఁ దాచి యుంచి విగిలించుకొనెనో! జటాయువు విఱుగఁదన్నినప్పుడు దీవి యేల కేలఁబడియుండి రామలక్ష్మణులతోఁ గావరా లేదో! వానిని గూడ రావణుఁడు మూటకట్టుకొని పోవును గాఁబోలు. ఇట్టి దురూహాలకు గ్రంథమునందుఁ బ్రమాణబుద్ధి లేకుండుటయే కారణము. రావణుఁ డను పేరు బాల్యమందు వానికి పేరేమో. నామకరణ మేమిగాఁ జేయఁబడెనో - ఏ రాలోచించినవారు కారు. ఉత్తర రామాయణమున రావణుఁడు పుట్టినప్పుడే పది తలలతో బుట్టె నని చెప్పఁబడెను రిపుఁడు రావణుఁ డను పేరు పెట్టుకొనఁదగిన పేరు దశకంఠుఁ డనియె వాఁడు చెప్పుకొనుచుండెను.

ఏవ ముక్తాతు సా కన్యా రామ, కాలేన కేనచిత్,
జనయామాస బీభత్సం రక్షోరూపం సుదారుణమ్ ।
దశగ్రీవం మహాదంష్ట్రం నీలాంజనచయోపమం
తామ్రోష్ఠం వింశతిభుజం మహాస్యం దీప్తమూర్ధజమ్ ॥

ఉత్తర.౯ సర్గ.౨౧. శ్లో. ప ౧౦౦ చూడు.

ఈ వాక్యములు రావణుఁడు పది తలలతోను, నిరువది చేతులతోను బుట్టెనని చెప్పుచున్నవి.

అథ నామాకరోత్తస్య పితామహసమః పితా
దశగ్రీవః ప్రసూతోయం దశగ్రీవో భవిష్యతి॥ ఉత్తర. ౧౯౩ వ.ప.

దీనిచే రావణునకు దశగ్రీవుఁ డనియే నామకరణము నాఁడు దండ్రిచేఁ జేయఁబడెను. అవల దశగ్రీవుఁడు బ్రహ్మను గూర్చి తపస్సు చేయునప్పుడు తొమ్మిది తలలు గోసి వేల్చినట్లు ఉత్తర రామాయణమున. ౨౦౨ వ పద్యమునఁ జెప్పఁబడెను. ఒంటి తలవాఁడైనచో నిది యెట్లు సాధ్యము. బచ్చెనతలలు కోసి హోమము చేయఁగా దానికి బ్రహ్మ మెచ్చుకొనెను గాఁబోలు.

నీ వెవఁడవు నీ పేరేమి యని మయుఁ డడిగినప్పుడు.

అహం పౌలస్త్యతనయో దశగ్రీవశ్చ నామతః
మునే ర్విశ్రవసో యస్తు తృతీయో బ్రహ్మణోఽభవత్.

ఉత్తర. ౧౩-౧౪ పద్య. ౨౫౪.

ఇందు రావణుఁడు తనపేరు దశగ్రీవుఁ డనియె చెప్పెను. దీనివలనఁ బది తలలు సహజము లనియుఁ గృత్రిమములు గా వనియు నేర్పడెను.

పది తలల వాఁ డొంటితలవాఁడుగా నెట్లు కానవచ్చె ననుకేమో, అది బ్రహ్మవరబలముననే.

హుతాని యాని శీర్షాణి పూర్వ మగ్నౌ త్వయానఘ
పునస్తాని భవిష్యంతి తథైవ తవ రాక్షస,

హాపార్శ్వుఁడును ధన•నాళి వార్ధిచతుష్టయంబు క్షితిని జుట్టి • యున్నదు నుండ
నితరమహామాత్రు • లింద్రుని సురతతి, భంగిని భజియింపఁ • బ్రబలువాని
తే. మేరు శిఖరాగ్రగత మైన • వారి యుక్త
వారిధర మన వెలుఁగొందు • వాని రాక్ష
సేశ్వరుని రావణునిఁ జూచి • హృదయసీమఁ
బరమవిస్మయపరుఁ డయి • పవనజుండు. ౧౧౩౬

అర్థములు. ఘోరంబు = అధికము-స్థూల శబ్దభవము. జవ్వనులు= యౌవనవతులు; మంత్రతత్త్వజ్ఞులు = ఆలోచనల రహస్యము తెలిసిన వారు; వార్ధి చతుష్టయము=నాలుగు సముద్రములు; ఇతర మహామాత్రులు=ఇతర సచివులు; మేరు శిఖరాగ్రగతము = మేరుశిఖరము కొన నుండునది, వారియుక్త=నీళ్ళతోఁ గూడిన వారిధరము = మేఘము.

తాత్పర్యము.

వయస్సు వచ్చిన పడుచులు చేతి కంకణములు ఝణంఝణ యని విశేషముగ మ్రోగుచుండఁ జామరములు వేయఁగా ఆలోచనములు చెప్పు మంత్రులు ప్రహస్తుఁడు, నికుంభుఁడు, దుర్ధరుఁడు, మహాపార్శ్వుఁడు ననువారు భూమిని నాలుగు సముద్రములు చుట్టుకొను నట్లు చుట్టియుండ ఇతర మంత్రులు దేవేంద్రుని దేవతల వలెఁ గొలుచుచు మూలమునుండి సేవింప, మేరుశిఖరము కొన నుండు నీళ్ళు గల మేఘమువలె వెల్గుచు నుండు వానిని, రావణుని జూచి హనుమంతుఁడు మిక్కిలి యాశ్చర్య పడెను.

శా. ఔరా రూప! మహో బలంబు! ధృతి యా•హా! తేజమా యద్భిరా!
ఏలో రాజసము స్వచిహ్నకలనం • బయ్యో యధర్మక్రియా
చారోదారుఁడు కాఁడ యేనియు బిడౌ•జస్సంయుతం బౌ మరు
ద్వారాగారము నేల కేఁడె యితఁ డు•ద్యచ్ఛక్తి సంపన్నతన్. ౧౧౩౭

అర్థములు. అధర్మక్రియాచారోదారుఁడు = అధర్మ కార్యములు చేయుట యందు గొప్పవాఁడు-బిడౌజః+సంయుతంబు= ఇంద్రునితోఁ గూడినది - మరుత్ + వార + అగారము=స్వర్గము, ఉద్యత్ + శక్తి + సంపన్నతన్ = కలుగు చున్నశక్తి సంపత్తిచే.

తాత్పర్యము.

ఏమి రూపము, ఏమి బలము, ఏమి ధైర్యము, ఏమి తేజము! ఔరా రాజుల కుండవలసిన యన్ని చిహ్నములు కలవే. ఇట్టివాఁడు ధర్మవిరుద్ధ కార్యములు చేయుని వాఁడగు కాని యింద్రుని తోడి స్వర్గము నైనను దనశక్తి సంపత్తిచేఁ బాలింప లేఁడా.

క. క్రూరుండై భూతదయా,దూరుండై లోకమెల్ల • దూషించు పనుల్
వారక సలుపుట గాదే, ఘోరాసురసమితి లోక•భయములు వడయున్. ౧౧౩౮

తాత్పర్యము.

అని సందేహించి కోపముచేఁ గన్నులెఱ్ఱనగా ముఖ్యమంత్రి యగు ప్రహస్తుని జూచి ప్రహస్తా! యీ దుష్టాత్ముఁ డెవ్వఁడు? మా పట్టణమున కేమి పనికై వచ్చెను? వీనిని బంపినవాఁ డెవ్వఁడు? ఉద్యానవన మేల చెఱిచెను? ఏల రాక్షసస్త్రీల బెదరించెను?

తే. ఈ దురాత్ముఁడు • నేటికి యుద్ధంబు, సలిపె? ననఁగ నతఁడు • పలికె నిట్లు
ఓరి క్రోధివాఁడ! • యూఱడిల్లుము భయపడఁగ వలదు నీవు • భద్ర మగును.

తాత్పర్యము.

ఏల యుద్ధము చేసెను? నీ వడుగుము అనిన నతఁడు హనుమంతునిఁ జూచి యిట్లనెను. ఓరి క్రోధిజాతివాఁడా! యూరడిల్లుము. భయపడవలదు. నీకు మే లగును.

—• ప్రహస్తుఁడు హనుమంతునిఁ బ్రశ్నించుట •—

చ. అడిగిన నీదు వంతము య•థార్థము చెప్పుము, నిక్క మాడఁ బో
విడుతుము, గాక దబ్బఱలు • ప్రేలితి వేనియు నిన్ను మేనితో
విడువము, వాసవుం డసుర•వీటికిఁ బంపెనె నిన్నుఁ? గానిచో
విడిముడిజేని మాటివా? ర•వి ప్రభవాప్పతు లంప వచ్చితో? ౧౧౪౮

అర్థములు. విడిముడిజేని = కుబేరుని. విడిముడి = ధనము, రవిప్రభవ + అప్పతులు = యముఁడు, వరుణుఁడు. అప్ + పతి = జలాధిదేవత—"ప్రచేతా వరుణః పాశీ యాదసాంపతి రప్పతిః" అమరము.

తాత్పర్యము.

భయపడవలదు. నిజము చెప్పితివా నిన్ను వదలిపెట్టుదుము. అసత్య మాడితివా నిన్ను దేహముతో వదలము. చెప్పుము. నిన్ను నీ రాక్షస నగరమునకు నింద్రుఁ డంపెనా? కుబేరుఁడు పంపెనా! యముఁడు పంపెనా? వరుణుఁడు పంపెనా?

చ. అసురుల గెల్వఁ గోరు హరి • యంపఁగ వచ్చినమాట నేకొ, యీ
లసదసమాన తేజము బ•లంబును వానరమాత్రునందు నీ
రస నెటు నేనియుం గనఁగ • రాదు, స్వరూపము చేత మాత్రమే
నొసఁగెదు వానరుండ వయి • నేటికి వచ్చితి? విన్నవింపరా. ౧౧౪౯

అర్థములు. లసత్ + అసమాన + తేజము = ప్రకాశించు సమానములేని పరాక్రమము, రసన్ = భూమియందు, "భూర్భూమి రచలానంతా రసా విశ్వంభరా స్థిరా" అమరం. విన్నవింపరా. గీ॥ కప్పలు పొగడువేళఁ గాంతలు రతివేళ సుతులు ముద్దువేళ శూరవరులు రణము సేయువేళ రాకొట్టి పిలుచుట పాడి యగియె మిగుల భజన కెక్కు.

ఆ. బ్రహ్మవలన నిట్లు • వర మేనుమును గంటి, రాజ గవఁగ నస్త్ర • రాజమునకు
బట్టువడితిఁ బ్రాళ్ళఁ • గట్టుట రాక్షసుల్ వాసె నెల్లయస్త్ర • బంధనములు.

తా త్ప ర్య ము.

బ్రహ్మచేత వరములు పొందిన వాఁడవు నీవు మాత్రమె కాదు. నేను గూడ నిట్టి వరములు పొందిన వాఁడనే. రాజును జూడఁగోరి బ్రహ్మాస్త్రమునకుఁ బట్టుపడితిని. రాక్షసులు నన్నుఁ బ్రాళ్ళచేఁ గట్టుటచే నస్త్రబంధము లూడిపోయెను.

ఆ. రాక్షసేంద్ర! యొండు • రాజకార్యముకల్మి, నేను వచ్చినాఁడ • నిన్నుఁ జూడ
భూరితేజుఁ డైన • శ్రీరామచంద్రునిబంట నాదు మేలు • పలుకు వినుము. ౧౧౫౦

తా త్ప ర్య ము.

అయినను నిన్నుఁ జూడవలయు నని కోరి పట్టువడి వచ్చితిని. నే నొక రాజ కార్యము గలిగి నిన్నుఁజూడ వచ్చినాఁడను. గొప్ప పరాక్రమము గల శ్రీరామచంద్ర మూర్తి బంటను. నీకు క్షేమ కరమైన మాట చెప్పెద వినుము.

—• ౫౧-వ సర్గము. హనుమంతుఁడు రావణునకుఁ దాను లంకకు
వచ్చిన కారణముఁ జెప్పుట •—

సీ. సుగ్రీవునాజ్ఞ ద • శగ్రీవ! వచ్చితి, నీ పట్టణమునకు • నిన్నుఁ జూడ
నీ సోదరుండు వ • నేచరనాథుండు, నీ కుశలంబును • నెమ్మి నడిగెఁ
దమ్ముండు చెప్పిన • ధర్మోక్తి యిహపర, సౌఖ్యనిదానంబుఁ • జక్క వినుము
దశరథుం డనియెడి • ధరణీశ్వరుఁడు చతు, రంగబలంబులు • గలుగువాఁడు
ఆ. శరణాగతములకును • దండ్రికి సమానుఁడు, తేజమున సురేంద్రు • దీటువాఁడు
అతని పెద్దకొడుకు • క్షితితలరంజన, శాలి విభుఁడు రామ • చంద్రుఁ డతఁడు.

అర్థములు. నీ సోదరుండు=రావణుఁడు వాలి భ్రాతృ భావము గలవారమై యుండ మని సంధి చేసికొనినవారు. కావున వాలిసోదరుఁడు రావణ సోదరుఁడే-సౌఖ్య నిదానంబు=సౌఖ్యకారణము-క్షితితలరంజన శాలి = భూమండలమును సంతోషింపఁ జేయువాఁడు. ఆయనపేరు రామచంద్రుఁడు.

తా త్ప ర్య ము.

సుగ్రీవుఁ డాజ్ఞాపింపఁగా నిన్నుఁజూచుటకై నీ పట్టణమునకు వచ్చితిని. నీ తమ్ముఁడు వానరరాజు సుగ్రీవుఁడు నీ కుశలము సంతోషముతో నడిగెను. ఆయన నీకు నిహమందును బరమందును సౌఖ్యము గలిగించు ధర్మవాక్యముచెప్పి పంపెను. దానిని వినుము. చతురంగ బలంబులుగల దశరథుఁ డను రాజ గలఁడు. ఆయన ప్రజలకుఁ దండ్రివంటి వాఁడు. తేజమున నింద్రునిసాటివాఁడు. అతని పెద్దకొడుకు (నీవలె భూమిజనులఁ బీడించువాఁడు కాఁడు) భూజనులను సంతోషపెట్టువాఁడు. కీర్తిచే సర్వత్రవ్యాపించిన

జోయునప్పుడు మా యన్న రాముడు వనమునకు. ఆయన యన్ని లోకముల వృత్తాంతము తెలిసినవాఁడు. సీత వృత్తాంతము తెలుపు మని సుగ్రీవుఁడు చెప్పి యుండెను. ఆ మాట ప్రకారము నీకై వెదకు చుండఁగా నీతో మాట్లాడుటకు ముందు సీతయే కానవచ్చెను అని భావము. నీ దర్శనము నాకు దుర్లభమని తక్కిన కార్యము చేసితిని.

హనుమంతుఁడు మాత ధర్మము ననుసరించి రాక్షసరాజా యని సగౌరవముగ సంబోధించి సామోపాయమున యత్నించినవాఁడు కావున సీతను రావణుఁడు తెచ్చుట తాను జూచి యుండియు నీవు సీతను దొంగిలించితి వని చెప్పలేదు. అది పరుషము కావున సామమార్గానుసారి కాదు. దొంగసొత్తు ఎవరి యింటనున్నదో వాఁడు దొంగయని కాని దొంగకు సహాయుఁడని కాని కదా శంకించవలయును. కావున నీ యింటిలో సీతనుంచుట తగిన కార్యము కాదని వాని యోగ్యతను బోధించుచున్నాఁడు.

—• హనుమంతుఁడు రావణునకు బుద్ధి చెప్పుట •—

చ. చదివితి వెల్ల ధర్మములు • శాస్త్రవిధానము గొప్పగాన్, జగ
ద్విదితముగాఁ దపోధనతఁ • దీరితి, వట్టిఁడ వయ్యు నన్యుల
ముదితల నేఁచ న్యాయమె! స•మూలవినాశనహేతు వాపదా
స్పదమగు ధర్మహీనకృతిఁ • జల్పకొనో నీవంటి ప్రాజ్ఞుఁడున్. ౧౧౫౭

అర్థములు ధర్మశాస్త్రములు - శాస్త్రవిధానము గొప్పగాన్ = శాస్త్రము లెట్లు చదువ వలయునని శాస్త్రములందుఁ జెప్పఁబడినదో యట్టుల, అనఁగా గురుల యొద్ద 'తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా' యన్నట్లు-అధ్యయనము-బోధము-ఆచరణము - ప్రచారణము - అను నాలుగు రీతులుగా - జగత్ + విదితముగా = జగత్ప్రసిద్ధముగా, తపోధనతన్ = గొప్ప తపస్సుచే. అట్టిఁడవు = అట్టివాఁడవు - అన్యులు = ఇతరులను పెండ్లాడినవారు - ముదితలన్ = స్త్రీలను; ఏఁచన్ = బాధించుట - సమూల వినాశన హేతువు = మూలముతో గూడ నాశనము చేయునది. వంశ నాశనము చేయునది - ఆపదాస్పద = విపత్తునకు సాధారము - ధర్మహీనకృతి = ధర్మము తప్పిన కార్యము - ప్రాజ్ఞుఁడున్ = బుద్ధిమంతుఁడు కూడ.

తాత్పర్యము.

గురుసేవ చేసి యెట్లు చదువ వలయునో యట్లు ధర్మశాస్త్రములను అధ్యయనము చేసితివి. ప్రపంచము పొగడునట్టి తపస్సు చేసితివి. ఇంతటి గొప్పవాఁడవై యయ్యు నితర పురుషుల స్త్రీలను బాధపెట్టుట ధర్మమా? అది వంశమును గూఁకటి వ్రేళ్ళతో నాశనము చేయునంతటి విపత్తునకుఁ గారణము కదా. నీవంటి బుద్ధిమంతుఁ డిట్టి విపత్తు తెచ్చు కార్యము చేయవచ్చునా?

ఓయి, రాజులు పరులను బాధింపరా దంటివి. అటువంటి రాజులకు సుఖభోగము లబ్బునా! రైతులు పన్నులైన నిత్తురా? ఆహారము నొసంటకూడ నిరాధారులకు బాధాకరము గాదా! యందు నేమో. దానివలనఁ దనకు నొక్కువ సుఖము తక్కువ కష్టమనో సహింపవచ్చునేమో కాని నొక్కువకీడు, అల్పసుఖము, గలదానిని చేయ వచ్చునా? అందు నీవలె సుఖమే లేక కీడే విశేషించినపుడు దానిని లాత్రిగఁ జేయ రాదు కదా. సీతాహరణమువలన నీకు సుఖలేశము లేదు. కీడు విస్తరించి నిన్ను సమూలముగ నాశముచేయునదిగా నైయున్నది. కావునఁ జేయఁదగినది కాదు. నా కెవ్వఁడు కీడు గలిగించువాఁ డందువేమో.

క. రామాగ్రహానువర్తులు, సౌమిత్రిశరోక్షితములు • శరములు కెదుటన్
నేమముగ నిలుతురే నా,నామరరాక్షసులు నైన • వసురప్రవరా! ౧౧౫౮

అర్థములు. రామ+అగ్రహ+అనువర్తులు = రామచంద్రమూర్తి కోపము ననుసరించి వెడలునవి, రామునకుఁ గోప మెంత యెక్కువో బాణ వేగ మంత యెక్కువగు నని భావము. కోపములేక చేసిన యొక బాణమే చాలి నంతటివానిని జంపినపుడు కోపముతో నైచిన బాణముల నెవ్వరు సహింపఁగలరు? అట్లు వెలువడినవి రామచంద్రమూర్తి బాణములు మాత్రమే కావు. సౌమిత్రి శరోక్షితములు=లక్ష్మణునిచే విడువఁబడినవి.

తాత్పర్యము.

రామచంద్రమూర్తి కోపమున కనురూపముగ వెలువడు బాణములకు లక్ష్మణుని బాణములకు నెదుట నీ వొక్కఁడవు కావు, లోకముల నుండు దేవతలు రాక్షసులు నందఱు నేకమై వచ్చినను నెదిరించి నిలువఁగలరా?

క. రామునకు గీడు చేసియు, నీ మూఁడు జగంబులందు • నెలవు సుఖంబు
గా మన నేనియు నెవనికి,సామర్థ్యము గలదొకో • విచారింపు మెదన్. ౧౧౫౯

అర్థములు. మన నేనియున్ = జీవించుటకైనను.

తాత్పర్యము.

రామచంద్రమూర్తికిఁ గీడుచేసికూడ నీ మూఁడులోకములందు నెవ్వఁడైనఁ నెందైనఁ బ్రాణములతో నుండుటకు నైన సాధ్య మగునేమో నీవే యాలోచింపుము. యుద్ధమునందు నిన్ను నీ సేనలతోడ జయించి నిన్నుఁ గారాగృహమందుంచినవాఁడు కార్తవీర్యార్జునుఁడు. వాఁడు చక్రవర్తియై భూమండల మంతటిని జయించెను. అట్టివానిని సమస్తరాజులను నిరువదియొక్కమారు చంపినవాఁడు పరశురాముఁడు. ఈయన యీలోకరాజులనేగాక దేవతల సేనలకు నాయకుఁడై రాక్షసుల జయించిన కుమారస్వామిని జయించిన వాఁడు, అట్టి పరశురాముని పరాజయముతో ప్రాణప్రయోగము లేకయే యోడించెను. ఇఁక నెవరు రామచంద్రమూర్తి యెదుట నిలువఁగలరు. దీనిని నీవు చక్కఁగా నాలోచింపుము.

తాత్పర్యము.

నీవు దేవతలచేత రాక్షసులచేత దానవులచేత గంధర్వులచేత నాగులచేతఁ జావకుండఁగ వరము పొందితివి. సుగ్రీవుఁడు అమరుఁడుగాఁడు—అసురుఁడు గాఁడు—గంధర్వుఁడు కాఁడు – దానవుఁడు కాఁడు – నాగులలోఁ జేరినవాఁడు కాఁడు. రాక్షసేంద్రా! యిపుడు నీ వరములు నిన్నెట్లు రక్షింపఁగలవు! ఆ వరముల బలమున నీ వెట్లు బ్రదుకఁగలవు. కావునఁ దపోబలము గల దను గర్వము వదలుము.

ఆ. పాపఫలము పుణ్య*ఫల మేకకాలము, ననుభవింప నెప్పు * డనువు పడదు
ధర్మఫలము వెంట * ధర్మఫలం బేగు, ధర్మమునకు చెడు న* ధర్మఫలము. ౧౧౬౪

తాత్పర్యము.

చీకటి వెలుఁగును లేకకాలమున రానట్లు, పాపఫలమును పుణ్యఫల మేకకాలమునందు ననుభవమునకు రావు. ఒకటి పోయిన రెండవది వచ్చును. ఒక కాంతిలో మఱియొక కాంతి కలిసిపోవును గాని చీకటి కలియనట్లు ఎన్ని ధర్మముల ఫలము లైనను నేకకాలమున ననుభవమునకు వచ్చును గాని పుణ్యఫల మనుభవించు కాలమందుఁ బాపఫలము రాదు. కావున నేను జేసినది పాపమైనను దాని ఫలము నా కీల ననుభవమునకు రాలే దనుము. ధర్మఫల మధర్మమును చెఱుచును. కావున ధర్మఫలానుభవసమయంబున నధర్మఫలము ననుభవమునకు రానీయదు. 'ధర్మేణ పాప మపనుదతి' యను శ్రుతి గలదు గదా! అధర్మఫల మిపుడు నీల ననుభవమునకు రాలే దందువా. చీకటి వెలుతురును చెఱుపఁజాలదు. వెలుగు చీకటిని చెఱుచును. చీకటి వెలుతురును చెఱుపలేదు. కావున నధర్మఫలము నీ కనుభవమునకు రాలేదు. ధర్మ మధర్మమును చెఱుచు నని శ్రుతి కలదుగాని యధర్మమువలన ధర్మము చెడు నని శ్రుతి లేదు.

ఓరీ నీవు చెప్పినది సరిగాదు. అష్టైశ్వర్యము ననుభవించు వానికి రోగము రాదా! రోగము పాపఫలముగాదా! ఆ రోగము పుణ్యఫలమైన ధనముచే నౌషధరూపమున నాశముగుటలేదా. అట్లే నేను జేసిన పాపము నా పుణ్యముచే నాశమగును గాని నన్ను బాధింపదు. నా తపఃఫలము వలన నాకు పాపఫలము రానే రాదు. వచ్చినను దానివలన నే పరిహార మగు నందువా? అది సరిగాదు.

ఐశ్వర్యము రోగము పరస్పరవిరుద్ధములు గావు. కావుననే యేకకాలమున రావచ్చును. నీవు చేసిన తపస్సు వలన దీర్ఘాయువు కావలె. నీవు చేసిన పరదారాపహరణము పాపము వలన వేగిరము చావవలె. ఒకటి యాయుర్వృద్ధికరము. మఱియొకటి యాయుర్నాశకరము. ఇట్టివి రెండెట్లు నేకకాలమున సంభవించును! కావున నాత్మనాశకమగు పరదారాహరణఫలమును, ఆత్మరక్షకమగు తపఃఫలము నశింపఁ జేయు నని నమ్ముము.

రెండవది:—అధర్మఫలము నన్నంటకే యుంటయేకాక నా ధర్మఫలము చేయు

నంటివి. అదియును సరిగాదు. 'తదేవ ఫల మన్వేషి ధర్మస్య నాధర్మనాశనః.' ధర్మము ధర్మఫలమునే యిచ్చునుగాని యధర్మమును చెఱుప దని యర్థము. అనఁగా ధర్మము చే నెంతఫల మీయవలయునో యంతే యిచ్చుట దాని కార్యముగాని, అధర్మమును చెఱుచుట దాని కార్యముగాదు. నేను దేవదానవులచేతఁ జావకుండుట నా తపము ఫలమునఁ గదా. అట్లే యిది నరవానరులనుండి కాపాడదా యందువేమొ, కాపాడదు. నీవు తపస్సు చేసినప్పుడు ప్రతిఫలము కోరక యుంచితివో నది నిన్నందఱి నుండి కాపాడి యుండును. అటుగాక నీవు ప్రతిఫలముగ దేవదానవాదులచేఁ జావు లేకుండఁ గోరితివి. కావున నీ తప మంత మాత్రమే చేయఁగలదు గాని యంతకెక్కువ చేయఁజాలదు. అదియునుగాక నీవు నరవానరుల నిషేధించితివి. కావున నీ తపఃఫలము వారినుండి నిన్నుఁ గాపాడఁజాలదు. 'ధర్మో రక్షతి రక్షితః' యను వాక్యము వలన నా ధర్మము నన్నుఁ గాపాడదా యందువేమొ. అది యాగంతుక విపత్తుల విషయము నందే కాని బుద్ధిపూర్వకమైన కర్మానుభవవిషయమునఁ గాదు.

'ధర్మ శ్చాధర్మ నాశనః' యని కలదు గదా. నేను బూర్వము చేసిన ధర్మము నేటి యధర్మము నుండి కాపాడదా యందువేమో. నీవు పూర్వము చేసిన పుణ్యము దానికిఁ బూర్వము చేసిన పాపములనుండి రక్షింపఁగలదుగాని దానికి వెనుక నీవు చేయు నధర్మముల నాశము చేయదు. నీవు నేఁడు భోజనము చేసితివేని యంతకు ముందున్న యాఁకలిబాధను నది హరించును గాని, రేపటి యాఁకలి బాధను నది హరింపదుగదా. అధర్మమును ధర్మము నాశము చేయలేదేని ప్రాయశ్చిత్తము లేల పుట్టిన వందువేమో. ఏ పాపమున కేది ప్రాయశ్చిత్తమో యా ప్రాయశ్చిత్త మా పాపమునే హరించును గాని యితర పాపముల హరింపఁ జేయఁజాలదు. జ్వరము నకై నీవు సేవించు నౌషధము వ్రణమును మాన్పఁజాలదు. అదియునుగాక ప్రాయశ్చిత్త మనునది వెనుకఁ జేసినదానికిఁ బశ్చాత్తాపము. ఇఁకముం దిట్టివి చేయనను నిశ్చయ ముండవలెను. నీవు చేసినదానికిఁ బ్రాయశ్చిత్తము చేసిన పాపమునకు వగచి యిఁకఁ జేయనని నిశ్చయించుకొని నీవు బలవంతముగఁ దెచ్చిన సీతాదిస్త్రీలను వారివారి మగవారి కప్పగింపుము. ఆ దోషము నివర్తించును.

ఆ. మున్ను నీవు సలిపి • యున్న తపోరూపధర్మమునఫలంబు • దానవేంద్ర
యనుభవించి తెంతె • దనుజ నదంతియుఁ,బడయఁ గల వధర్మ • ఫలము వేగ. ౧౧౯

అర్థములు. ధర్మమునఫలంబు - షష్ఠ్యర్థమున నకారాగమము - ధర్మము యొక్క - ఫలము.

తాత్పర్యము.

నా తపఃఫలము నన్ను రక్షించు నని తలఁచెదవేమో? అది భ్రాంతి. తపఃఫలము పుణ్య మనుభవించు కొలఁది క్షీణించును గాని శాశ్వతము గాదు. కావున నీ తపఃఫల మెంత యనుభవింపవలయునో యంతయు నేటివఱకు ననుభవించితివి. ఆ

ఉ. నీ వశమంద యుండి ధరణీసుత యంచును నీవు మాను నా
భావిని లంక వంతయును • బా డొనరింపఁగఁ జేరియున్న యా
దేవిని గాళరాత్రిఁగ మదిం దలపోయుము, నీ కొంకను నీ
శావిధ కాలపాశ మది • దార్కొ-నెఁ జూడుము రోగ్యపద్ధతిన్. ౧౧౮

అర్థములు. భావిని = ఉత్తమస్త్రీ, కాళరాత్రిఁగన్ = ప్రళయకాలమున సర్వము సంహారము చేయు భగవంతుని శక్తిగ - 'సమానా కాళరాత్రిస్తు శైలసీగంగా నాయికా' యను నిఘంటు ప్రకారము గంగానాయిక పేరని కొందఱు - బ్రహ్మ తన్ను మధుకైటభులు బాధించి నపుడు ఈ శక్తిమాహాత్మ్య మపేక్షించి ప్రార్థించె నని మార్కండేయ పురాణమునఁ గలదు. ఆ పురాణమందే యీమె మోహరాత్రి, కాలరాత్రి, మహారాత్రి, నారాయణి లోనగు పేర్లు గల దనియు నీమె విష్ణుశక్తి యనియుఁ జెప్పఁబడెను. త్రిగుణాత్మిక యగు ప్రకృతి భగవచ్ఛక్తియే. శక్తియే మాయ యని మహామాయ యని యిత్యాది నామంబులఁ జెప్పఁబడుచుండును. "ఈశ్వరస్య మహామాయా తదాజ్ఞావశవర్తినీ - తత్సంకల్పానుసారిణీ; వివిధానంత మహా శక్తి సంసేవితా । అనంత మహామాయాజాల జననమందిరా । మహావిష్ణోః క్రీడా శరీరరూపిణీ । బ్రహ్మాదీనా మగోచరా । ఏతాం మహామాయాం తరంత్యేవ యే విష్ణుమేవ భజంతి, నాన్యే తరంతి కదాచన।వివిధోపాయైరపి ॥ మహానారాయణోపనిషత్తు. భగవంతుని మహామాయ ఆయన యాజ్ఞకు లోబడి వర్తించునది. ఆయన సంకల్పము ననుసరించి యుండునది. మహావిష్ణువునకుఁ గ్రీడాశరీర మైనది. బ్రహ్మాదులకు అగోచర మైనది. ఎవరు విష్ణువును భజింతురో వారు మహామాయను దాఁటుదురు గాని, యితరోపాయముల నెన్నిటనైనను ఏ కాలమునకైనను దాఁటలేరు. ఈ విష్ణుశక్తియే జగద్రక్షణకార్యమునందు కేవల సత్త్వగుణము నంగీకరించి లక్ష్మి - శ్రీ - భూమి నీళ - రుక్మిణీ - సీతాది రూపంబుల నవతరించును. సంహారము చేయు కాలమందు తమోగుణయుక్తమై మహాకాళి, కాళరాత్రి లోనగు నామధేయములు గలదై యుండును. ఏ కార్యమును చేయఁబూని నపుడు ఆ వేషభాష లుండుట యావశ్యకము గదా. కావున సాత్త్వికులు శ్రీ దేవిని, లక్ష్మీదేవిని, భూనీళాదులను, సీతారుక్మిణులను భజింతురు. తామసులు మహాకాళీ - కరాళీ - మహారాత్రి - దుర్గా - చండీత్యాది నామంబుల భయంకర మూర్తుల భజింతురు. ఈ తామసశక్తులలో మహాచంద్ర - యోగేశ్వరి - సిద్ధికరాళి, సిద్ధి వికరాళి - మహాంత - మారి - వజ్రకపాలిని - ముండమాలిని - అట్టహాసిని - చండకపాలిని, కాలచక్రేశ్వరి - గుహ్యకాళి - కాత్యాయని - కామాక్షి-చాముండ-సిద్ధిలక్ష్మి-కుబ్జిక- మాతంగి - చండేశ్వరి - కౌమారి- మొదలు శివమాతృకలు - భద్ర - కాళిక - లలిత - మాలిని-వసుంధర - సరస్వతి - రమా- గౌరి-దుర్గ-మొదలు దేవులు. రమ యనఁగ లక్ష్మి కావున నీమె యీ శివశక్తులలోఁ జేరిన దని తలంపరాదు. ఆపేరు గల శక్తి మహామాయ. కాళరాత్రి - సర్వమును గళ -

శమనిక - రాజరాజేశ్వరి - సంపత్ప్రద - భగవతి - కుమారి - వీరు దేవులు. వీరికి అనంగాదిశక్తులు పరిచారికలు గలరు. అనంగకుసుమ - అనంగమన్మథ - అనంగమదన - అనంగకుసుమాతుర - అనంగమదనాతుర - అనంగశిశిర - ఈ పేరులే యీ దేవతల స్వభావములు దెలుపుచున్నవి. ఈ శక్తిపూజలు కామ్యములు, నైమిత్తికములు. ఈ విషయము పూర్ణముగ మహాకాలసంహితయందు చెప్పఁబడినది. సీత కాళరాత్రి యని తెలుసుకొను మని హనుమంతుడు చెప్పినమాటలను బట్టి యిందు చెప్పిన తామసశక్తియే సీత యని కొంద రందురు. అది సరిగాదు. సీత గుణములందు దశాననునాశ్చర్య లవ మైన లేదు. ఉపమానములఁబట్టి చూచిన సీత నీపాలి కాలపాశమని కాలభుజంగి యనియు హనుమంతుడు చెప్పెను. దానినిబట్టి యీమె క్రూరురాలుగాఁ బుట్టి నదనవచ్చునా? కాళరాత్రి ప్రళయకాలమందు సంహార మెట్లు చేయునో యట్లు సీత నీ వంశము నాశము చేయు ననియే గ్రాహ్యముగాని, యుపమానములందు సర్వము యథార్థ మని గ్రహింపరాదు. పురుష సింహ మన్నప్పుడు సింహమునకుండు తోక, కోఱలు, కేసరములు పురుషున కున్నవనవచ్చునా? సాత్త్విక తామసశక్తులకుఁ గల భేద ముత్తర పీఠిక యందు వివరింపఁబడును.

ఇక్కడ సీతాదేవి సర్వసంహారక శివశక్తి యనుటచే 'అక్కట కాళరాత్రిగతి నా ధరణీసుతనీవ చంపితే' యని భరతుఁడు నైకవిషయమై చెప్పెఁగదా. (అయోధ్య గలకీర్తి ప) అక్కడనే కాళరాత్రి వచ్చెను. రెండు స్థలములందు నుపమ యని తెలియఁగ వలెను. సీతావిధకాలపాశము = సీతా స్వరూపమైన యమపాశము. కాలపాశము సీతగాఁ బుట్టలేదు గదా.

తాత్పర్యము.

నీ వశమందుండిన జానకి యని నీవు తలంచు నత్తనుస్త్రీ లంక యంతయును నాశము చేయఁగ వచ్చిన కాళరాత్రివలెఁ దలంపుము. కాళరాత్రి యే విధముగ లోకమును ప్రళయకాలమున నాశముచేయునో యట్లీమె యీ లంక యంతయు నాశము చేయును. ఈమె నీ మెడయందుఁ దగులుకొనిన యమపాశమని తలంపుము. కావున నీవు బ్రదికి లంకను గాపాడుకొనఁదలఁచితివేని యీమెను వదలిపెట్టుము. ఇది నీకు యోగ్యమగు మార్గము.

చ. ధరణిసుతాతపోనలసు • దగ్ధము రాఘవకోపదీపితం
బరయుము పట్టనప్పుర • మంతయు, మంత్రిహితానురక్తి నో
వరసుత దారయుక్తముగఁ • దగ్ధము నాశన మేల యయ్యెడి
పురమును నాఁడ గాచికొనఁ • బోలదె మూఢుడు రావణేశ్వరా. ౧౧౭౦

అర్థములు. ధరణిసుతా తపోనల సుదగ్ధము = జానకియొక్క తపస్సనెడి యగ్నిచే బాగుగఁ గాలినది. రాఘవ కోపదీపితంబు=రామచంద్రమూర్తి కోపముచే

బాధింపఁబడినది. స+అట్ట + వప్ర + పురము = కోట బురుజులు ప్రాకారములతోఁ గూడిన పట్టనము, అనురక్త = నీ యందుఁ బ్రీతిగలవారు.

తాత్పర్యము.

ఈ పట్టన మంతయు సీతాపాతివ్రత్యమను వహ్నిచేఁ గాలినదిగను రామచంద్రమూర్తి కోపముచే బాధింపఁబడినదిగాను తెలిసికొనుము. మంత్రులతో హితులతో నీయందు ననురాగము గల బంధువులతో, తమ్ములతో, దారపుత్రాదులతో నేల నాశము నొందెదవు! (భార్యలకు వైధవ్యము వచ్చుటచే వారు నాశమైనవారే.) ఈ పట్టనమును దారపుత్రాదులను రక్షించుకొనరాదా!

క. వినుమిదె నా వచనంబులు, దనుజేశ్వర! పలుకువాఁడ ♦ దథ్యము నే రా
మునిదాసుఁడ దూతుఁడ నం,చను వానరుఁడన్ శుభంబు ♦ గోరెదొ నీకున్.

తాత్పర్యము.

రాక్షసేశ్వరా! నీవా రాక్షసుఁడవు. రామచంద్రమూర్తియా మనుష్యుఁడు. నేను ఏదా యుభయుల జాతిలోఁ జేరిన వాఁడనుగాను. మధ్యవర్తిని. నేను సొమ్ము పోఁగొట్టుకొన్నవాఁడనుగాను, కొట్టుకొను వాఁడనుగాను ఇందు నాకు రాఁగల లాభనష్టములు లేవు, అందు నేను రామదాసుఁడను. రామచంద్రమూర్తి సీతను జూచి రమ్మనిన మాటకై వచ్చినవాఁడను. నే నసత్యమాడవలసిన పనిలేదు; సత్యము చెప్పుచున్నాను. నా మాటలు వినుము. నీకు మేలు గలదు.

క. సచరాచరభూతజగ,న్నిచయంబుల సంహరించ ♦ నిరుపమశక్తిన్
రచియింప మరల రాముఁడె, ఖచరేశ్వరదమన! నేర్చు ♦ ఘనయుక్తి మెలఁగున్.

అర్థములు. సచరాచరభూత=చరములు, అచరములును భూతములతోఁ గూడిన- జగత్ + నిచయంబులన్ = లోకసమూహములను, నిరుపమశక్తిన్ = అసమానశక్తిచే, రచియింపన్ =సృజించుటను, ఖచరేశ్వరదమన=ఇంద్రుని జయించినవాఁడా.

తాత్పర్యము.

నేను మధ్యవర్తి నగుటచే నాయొక్క బలము నే నెఱుంగుదును. నీ బలము నే నెఱుఁగుదును.

ఉభయుల బలాబలము తెలిసి చెప్పుచున్నాను. నీ వొక యింద్రుని గెలిచితి నని గర్వించెదవు. రామచంద్రమూర్తి జంగమస్థావరములతోఁ గూడిన సమస్త ప్రపంచములను తన శక్తిచే సంహరింపఁ గలఁడు. మరల సృష్టింపఁ గలఁడు. కనుక నాయనకు నీకు నెక్కడి కెక్కడ? యుద్ధము సమానులందు శోభించును గాని దోమకు నేనుఁగునకు నెక్కడి తారతమ్యము ?

హనుమంతుఁడు తొలుత నయవాక్యముల నారంభించి తన యొక్క మాటవలన రావణుని ముఖనయనంబులందుఁ గలుగు వికారమును గనిపెట్టి తరువాత

తికరం వపుః। ఏవ మేకో జగత్స్రష్టా జగత్పాతా తథాజగత్।జగద్భక్షయితా దేవో సమస్తస్య జనార్దనః॥ వి.పు.౧-౧౩. భగవంతుఁడగు విష్ణువు రజోగుణము విశేషముగాఁ గల జీవులయందుఁ బ్రవేశించి వారిచే సృష్టి కార్యమును - తమోగుణము గలవారి యందుఁ బ్రవేశించి సంహారకార్యమును, సత్త్వగుణము గలవారి యందుఁ బ్రవేశించి రక్షణమును జేయుచుండును. కావున సమస్తమునకు వా స్తవ ప్రయోజక కర్త భగవంతుఁ డనియు నైమిత్తిక ప్రయోజ్యకర్తలు జీవులనియు నెఱుఁగ వగు.

మ. నరదేవాసురయక్షకింపురుష గం•ధర్వాహివిద్యాధర
శ్రేణ్యసిద్ధామరకిన్నరావళుల వి•క్రాంతాద్యు విష్ణూపమున్
నరదేవోత్తము రాముని న్ దురములో • నన్ మార్కొనం జాల రె
వ్వారు సెక్కాలమునందు నెల్లయెడ స•ర్వప్రాణిజాలంబులన్. ౧౧౭౩

అర్థములు. విక్రాంతాద్యున్ = పరాక్రమము గల వారిలో మొదటివాఁడు, విష్ణూపమున్ =విష్ణువుతో సమానుని - అవతారమూర్తి యగుట సమత్వము చెప్పఁబడెను. నరదేవోత్తము = (౧) రాజులందు శ్రేష్ఠుని - (౨) నరులందు దేవతలందు నుత్తముని - దురములోనన్ = యుద్ధము నందు.

తాత్పర్యము.

మనుష్యులు-దేవతలు - అసురులు - యక్షులు-కింపురుషులు - గంధర్వులు - పన్నగులు-విద్యాధరుల సమూహములు-సిద్ధులు-రక్కసి దేవజాతులవారు - కిన్నరులు వీరల సమూహములోఁ బరాక్రమమున మొదటివాఁడగు విష్ణుసమానుని, రాజులలో శ్రేష్ఠుని, రామచంద్రమూర్తిని యుద్ధమునందు నెవ్వరైనను నేకాల మందైనను ఎల్ల ప్రదేశములందును సర్వప్రాణి సమూహములం దెవ్వరైనను నెదిరింప జాలరు. అంశము పూర్ణమును నెంతైన నెదిరింపఁ గలదా ! సముద్రములోని యల లన్నియును గలసి సముద్రముతో విరోధించి బ్రదుకఁ గలవా ?

౧౧౭౨ మొదలు ౧౧౭౪ వఱకుఁ గల పద్యములందు రామచంద్రమూర్తి 'రామపదేనాసౌ పరబ్రహ్మాభిధీయతే' యనునట్లు త్రికాల సత్యమగు పరబ్రహ్మ మని హనుమంతుఁడు చెప్పుచున్నాఁడు. అటు గాదేని యీ కాలమునం దుండు రామ చంద్రమూర్తిని నంతకు ముందటివారు వెనుకటివారు, నెదిరింప లేరనుట యున్మత్త ప్రలాపము లగును.

క. రామునకు రాజసింహున, కా మహనీయాత్మునకును • నవికలలోక
స్వామికి ద్రోహ మొనర్చితి, నే మొయి నర్థము బ్రదికి • మొనఁగుట నీకున్.

అర్థములు. అవికల లోకస్వామికి = వికలముగాని సమస్తమైన లోకము లను దన సొమ్ముగాఁ గల వానికి - ప్రభువునకు - ఏమెయిన్ = ఏ విధముగ నైనను.

తాత్పర్యము.

రాజులందు శ్రేష్ఠుఁడు, పూజ్యస్వభావము గలవాఁడు, సమస్తలోక ప్రభువు నగు రామచంద్రమూర్తికి నీవు ద్రోహము చేసితివి. కావున నీ వే విధముగ నాలోచించినను బ్రదుకఁ జాలవు.

తే. మూఁడులోకంబులకుఁ బ్రభు • ముఖ్యుఁ డైన
రామచంద్రుని రణమున • రాక్షసేంద్ర!
నాగయక్ష నిశాట గం • ధర్వ దేవ
దైత్యవిద్యాధరులు నైనఁ • దాఁకలేరు. ౧౧౭౫

తాత్పర్యము.

మూఁడు లోకంబులకుఁ బ్రభువు లగు వారిలో ముఖ్యుఁడగు రామచంద్రమూర్తిని నీ వొక్కఁడవు కాదు, నాగయక్షరాక్షస గంధర్వదేవ దానవ విద్యాధరు లందఱు నొక్కటిగా కూడ నెదిరింప లేరు.

తే. అధిప! బ్రహ్మ స్వభువు చతు • రాస్యుఁ డైనఁ
ద్ర్యంబకుఁడు రుద్రుఁ, డును బుర • హరుఁడు నైన
నింద్రుఁడు మహేంద్రుఁడును సురా • ధీశుఁ డైనఁ
గలన శ్రీరామవధ్యునిఁ • గావ లేరు. ౧౧౭౬

అర్థములు. సాధారణ దేవతలు రాము నెదిరింప లేకున్నను రక్షకు లని ప్రసిద్ధులైన పర(గొప్ప) దేవత లెదిరింపరాదా యనుటకు సమాధానము చెప్పుచున్నాఁడు. అధిప - ఇత్యాది-ఇందలి యొక్కొక్క విశేషణమును నా యా దేవత యొక్క శక్తి పరిపూర్ణతను దెల్పును. మొదటి రెండు మూఁడు పాదములను పరికింపఁగా నన్వయించినచో యుక్త్యాపకర్షములు చక్కఁగ నేర్పడును గాన నట్లే యన్వయించుకొనవలెను.

"ఇది పరమైశ్వర్యే" యను ధాతువునుండి బుట్టిన యింద్రశబ్దము త్రిలోకాధిపతి యని యర్థమును దెల్పును. ఇంద్రుఁడు త్రిలోకాధిపతి యయ్యును నింద్రునకు శత్రులను గెల్వ సామర్థ్యము లేదేమో యని యాశంకింపరాదనుచున్నది మహేంద్రుఁ డను పదము. ఇంద్రుఁడు వృత్రాసురుని జంపుటచేత గొప్ప సామర్థ్యము కలవాఁ డని ప్రసిద్ధి కలదుగదా, అట్లయ్యును రాముని దాఁకలేఁడని భావము. "మహాన్వా అయం మఘవా వృత్రమవధీ దితి, తన్మహేంద్రస్య మహేంద్రత్వ"మ్మను శ్రుతి మహేంద్ర శబ్దమునకుఁ బ్రమాణము. ఎంత సామర్థ్యము కలిగియున్నను సహాయసంపత్తి లేనిచో నే కార్యమును గాదుగదా యనుటకు సమాధానము సురాధీశుఁ డైన నను పదము. ఇంద్రుఁడు తనవలె బలశాలు లైన ముప్పదిమూఁడు కోట్ల దేవతలతోఁ గూడియున్నను రామునిఁ దాఁకలేఁ డని భావము.

రుద్రుఁడైన యింద్రునిచేఁ జేత గాకున్నను నుండ వచ్చును గాని సర్వ సంహారకుఁడైన రుద్రునికి రాముని దాఁకునట్టి శక్తి తప్పక యుండు ననుటకుఁ జెప్పు చున్నాఁడు. రుద్రః ఇత్యాది (౧) ప్రళయ కాలమందు జనులను సంహరించుచు నేడ్పించువాఁడు. (౨) రుతం వేదశబ్దం (బ్రహ్మణే కల్పాదౌ) రాతీతి రుద్రః అని యొక వ్యుత్పత్తి. సృష్ట్యాది యందు బ్రహ్మకు సమస్త వేదములను జెప్పువాఁడు. (౩) రుతా - నాదేన (సకల మిదం జగత్) ద్రావయతి - రంజయతీతి రుద్రః=నాద రూపుఁడై సకల జగంబులను సంతోషపెట్టుచువాఁడు. (౪) రుతా-ప్రణవస్య వేదస్య నాదేన-నాపయతి-ఇష్టం ప్రాపయ తీతి రుద్రః. ప్రణవముగాని, వేదముగాని యుచ్చ రించు వారికిఁ గోరిక లీడేర్చువాఁడు. ప్రణవప్రతిపాద్యుఁ డనిగాని, వేదప్రతిపాద్యుఁడని గాని భావము. (౫) రుతం=సంసారదుఃఖం-దుఃఖహేతుం వా ద్రావయతీతి రుద్రః - సంసారదుఃఖమునో, దాని కారణమునో పోఁగొట్టువాఁడు. ఇంతశక్తి గలిగియున్నను రుద్రుఁడు రాముని దాఁక లేఁడని భావము. ఇతనికి సంహారకత్వశక్తి యొక కాలవిశేషము నందే, అనఁగా ప్రళయకాలమునందే గాని సదా లేదేమో. కాఁబట్టియే రాముని జయింప లేఁడేమో యని శంకింప రా దనుచున్నాఁడు. త్ర్యంబకుఁడు - త్రి+అంబ కుఁడు=మూఁడు కన్నులు గలవాఁడు. నొసటనున్న మూఁడవకంటిలోని నిప్పు మంటలచేతఁ బ్రళయ భిన్న కాలమునను మన్మథునిఁ జంపి యుండలేదా. కాఁబట్టి యట్లు శంకింపరాదు అని భావము. ఇదియుఁ గాక కాలీయము కా దనుచున్నాఁడు. పురహరుఁడు నైనను=మిక్కిలి బలవత్తరులైన త్రిపురాసురులను సంహరించిన వానికి రుద్రునికి శక్తిలోపమే లేదని భావము. ఇంతటివాఁ డయ్యును రాముని మ్రోలను దాఁక లేఁడు. రుద్రునికి శక్తి లేకపోయినను పోనిమ్ము. "బ్రహ్మణః పుత్రాయ జ్యేష్ఠాయ శ్రేష్ఠాయ" యని శ్రుతి చెప్పినట్లు అంతటి రుద్రునికి జనకుఁడైన బ్రహ్మ దేవునికైనను రాముని దాఁకు శక్తి యుండదా యనుటకు సమాధానము చెప్పుచున్నాఁడు. బ్రహ్మ ఇత్యాది - బృంహతీతి బ్రహ్మ యని వ్యుత్పత్తి; నాటి చేత గొప్పవాఁడు బ్రహ్మ రుద్రునికిఁ దండ్రియైనను గర్మవశ్యుఁడే కదా. అయినచో నాతని కట్టు లంత గొప్పశక్తి కలుగు ననుటకు సమాధానము. స్వయంభువు = కర్మపర తంత్రుఁ డయ్యును బ్రహ్మ పరులవలెఁ గాక తనకుఁ దానే జన్మించిన వాఁడు. కాన గొప్ప శక్తిమంతుఁడే యని భావము. ఎంత శక్తియున్నను సహాయసంపత్తి లేనిచో నట్టి కార్యము నెఱవేర్పననుటకు సమాధానము. చతురాననుఁడైనను = నాలుగు మోములచేతను సమస్త వేదములను నొక్కుమ్మడి యుచ్చారణ చేయుటచేతఁ గలి గిన గొప్ప యతిశయము కలవాఁ డయ్యును, ఇంతటి గొప్పవాఁడయినను బ్రహ్మ రాముని దాఁకనేలేఁ డని భావము. ఈ ముగ్గురు ప్రత్యేకించి రాముని దాఁక లేరని యింతవఱకును జెప్పెను. ముగ్గురు కలిసి వచ్చినను రాముని దాఁక లేరని ప్రకృతపదమునై నున్న బహువచనము సూచించును. శ్రీరామవధ్యస్య =

శ్రీరాముల వారిచే వధింపఁదగినవారని, "స్థానవినిగ్రహాస్య చ" యన్నట్లు వారి వారి కనుగుణముగానే గదా శ్రీరాములవారు శిక్ష విధింతురు. అట్లు వారు శిక్షించునప్పుడు వారిని నెవరు రక్షింపనేర్తు రని భావము. కలవన్ గావలేరు - వీరు రామునితో యుద్ధము చేసి యీ వధ్యుని సంరక్షింప శక్తిగలవారు కారు. ఇట్లు కాక పోయినను వీరు రాముని శరణుజొచ్చి యీ వధ్యుని విడిపింపుమని వేఁడి కాపాడుటకు మాత్రము శక్తికలవారే యని కలరు అను పదము స్వారస్యము.

"హిరణ్యగర్భ స్సమవర్తతాగ్రే" యని బ్రహ్మదేవుఁడే పరదేవత యనియు, "న సన్న చాస చ్ఛివ ఏవ కేవల" యని శివుఁడే పరదేవత యనియు, ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే" యని యింద్రుఁడే పరదేవత యనియు వేదమున నచ్చటచ్చట నీ ముగ్గురిని పరదేవతలుగాఁ జెప్పియున్నను వా ముగ్గురికన్నను రాముఁడే పరాత్పరుఁ డని యీ పద్యమునఁ జెప్పఁబడెను. వేదాంతమునందు సత్, బ్రహ్మ, ఆత్మా యిత్యాదులైన సామాన్యశబ్దంబులు చెప్పఁబడినవి. హిరణ్యగర్భ శివేంద్రాదులైన విశేష శబ్దంబులును ననేకము లున్నవి. వాని కన్నిటికిని శ్రీరాములవారే యని పరాత్పర నిర్ధారకమైన యీపద్యములోని శ్రీరామ శబ్దముసూచించును. త్రిమూర్తు లని ప్రసిద్ధిఁ గాంచిన పరదేవతలను జెప్పెడి యీ సందర్భమున నింద్ర రుద్ర బ్రహ్మలను మాత్రము చెప్పి విష్ణుమూర్తిని జెప్పమిచేత శ్రీరాముల వారే విష్ణుమూర్తియని పారిశేష్యమున నేర్పడును.

ఈ ప్రకారము విలోమముగఁ జెప్పినను జెప్పవచ్చును. లేక అనులోమముగఁ జెప్పిన జెప్పవచ్చును.

బ్రహ్మ సురజ్యేష్ఠుఁడు. అంతకంటె గొప్పవాఁడు దేవతలందు లేఁడు. నీయందను గ్రహించి నీకు వరము లిచ్చినవాఁడు, అట్టి వాఁడైనను నిన్నుఁ గావలేఁడు. అట్టి బ్రహ్మ యొక్క శిరస్సును జెక్కఁగొట్టినవాఁడు రుద్రుఁడు. నీ యం దనుగ్రహించి వరములు, చిరంజీవములు తన యాయుధము లిచ్చిన వాఁడు. అట్టి వాఁడును నిన్ను రక్షింపలేఁడు.

ఇఁక వీరే రక్షింపఁజాలనప్పుడు నీచేతఁ గట్టు పడిన యింద్రుని మాట చెప్ప నేల? నా యిరువురితోఁ గలిపిన బలవంతుఁడగును గదా యనిన వారు ముగ్గురేకమైనను రామచంద్రమూర్తి చంపఁదలఁచిన వానిని గావలేరు. యుద్ధము చేసి నిన్ను రక్షింపలేరు కాని కాకాసురునివలె శరణాగతి చేయుటచే రక్షింపఁ గలరు.

"స బ్రహ్మా స శివ స్సేంద్రః" యనుచో విష్ణువును జెప్పక యాయన పరత్వమును శ్రుతి సూచించు నట్లు లిచ్చట నా ముగ్గురికే చెప్పఁబడి రనియు వీరు ముగ్గురకు ఉపాదైన వాఁడు రామచంద్రమూర్తి యనియు సూచింపఁబడెను. "స బ్రహ్మా స శివ స్సహరి స్సేంద్రః" యను నది మూలపాఠ కల్పిత మగు నపపాఠ మని తెలియంగా నది. ఛందోభంగము.

తా త్ప ర్య ము.

ఓయీ రాక్షసరాజా ! చిల్లర దేవతల మాట యటుండనిమ్ము. నీ యందు ప్రేమగలిగి వరము లిచ్చిన స్వయంభువు, నాలుగు మొగములు గల బ్రహ్మయైనను, మూడు కనులు గలిగి త్రిపురముల నాశము చేసిన రుద్రుడైనను ముప్పదిమూడు కోట్ల దేవతల కధిపతి యగు యింద్రుడే కాక మహేంద్రుడు నైన వాడైనను గాక వీరు మువ్వురు కలసి యైనను యుద్ధమునందు నిన్ను గావలేరు. కావున నీకు రక్షకము శరణాగతియే.

క. అను హితయుత మధురతర వచనముల ధృతి చెడక హనుమ • పలుకం దన్నాడన్
విని దశవదనుడు కోపం, బున గుడ్లు త్రిప్పికొనుచు • భ్రుకుటి వహింకన్.

తా త్ప ర్య ము.

ఈ ప్రకారము హనుమంతుడు హితములైనను గఠినములైన మాటలను దన్ను సభలో నందఱు వినుచుండ ధైర్యముతో జెప్పిన విని మహాకోపముతో గ్రుడ్లు గిరగిర ద్రిప్పుచు గనుబొమలు ముడివడి వహించుచుండ—భ్రుకుటి-భ్రూకుటి.

—• ౫౨-వ సర్గము. విభీషణుడు రావణునితో దూతను జంపరాదని చెప్పుట •—

సీ. హనుమంతు జంపంగ • నాజ్ఞ సేయగ విని, దోషజ్ఞు డైన వి•భీషణుండు
నిశ్చితార్థుండయి • నీతి నాలోచించి, తద్ధితకాంక్ష న•త్యంత హితము
వఱలి నన్నను మృదు•వాక్యాల నిట్లను, క్షమియింప వయ్య కో•పంబు విడుము
దయ జూడు నామాట • తగవు విచారింపు, నయవిధిజ్ఞులు ధరా•నాథు లెందు

తే. దూత వధియింప నొల్లరు • దోష మగుట,
గపిని జంపుట లోకవి•గర్హితంబు
రాజధర్మ విరుద్ధంబు • రాక్షసేంద్ర !
నిన్ను బోటికి దగ దిది • నిర్జరారి ! ౧౧౭౮

అర్థములు. దోషజ్ఞుడు=పండితుడు, దోషములు దెలిసినవాడు. విద్వాన్ విపశ్చి ద్దోషజ్ఞ స్సన్ సుధీః కోవిదో బుధః - అమర - నిశ్చితార్థుడు=నిశ్చయింపబడిన ప్రయోజనము గలవాడు. తత్ + హిత కాంక్షన్ = రావణుని మేలుగోరి- నయవిధిజ్ఞులు=నీతిశాస్త్రము దెలిసినవారు; లోకవిగర్హితంబు = జనులచే నిందింపబడినది.

తదితము-విభీషణుడు చెప్పినది రావణునకు రెండు విధముల మేలు.(౧) రాజధర్మము నీతిశాస్త్రము నతిక్రమింప కుండుట. (౨) నీతో మాటలాడుటకై కట్టుపడి వచినాను గాని యిట్లు నన్నేమియు చేయజాల వని లంకయంతయు దానొకడే నాశము చేయగల నని హనుమంతుడు చెప్పెను. బ్రహ్మాస్త్రమునకు గట్టు పడని వానిని జంపు వారెవరు ? దేహము పెంచియో కుంచ చేసియో కట్లు విడిపించికొని

రావణునిపై మోఁకిన నష్టమదు వారెవరు? అది యెంతటి యవమానకరము. కావున విభీషణుఁ డీ రెంటిని దప్పించెను.

తాత్పర్యము.

హనుమంతుని జంపవలసిన దని యాజ్ఞ సేయఁగా విని పండితుఁ డగుటచే రావణు నాజ్ఞ రాజనీతివిరుద్ధ మని దాని యందలి దోష మెఱిఁగిన విభీషణుఁడు కార్యము నిశ్చయించి నీతి నాలోచించి రావణాసురుని మేలాలోచించి మిక్కిలి హితముగ నన్నతో మెత్తని మాటల వినయముతో నిట్లనెను. రాజా! క్షమింపుము. కోపము మానుము. వీనియందు దయచూపుము. న్యాయ మాలోచింపుము. నీతిశాస్త్ర మెఱిఁగిన రాజులు దూతను జంపుట దోషమని చెప్పిరి. అందుఁ గ్రోఁతిని జంపుట లోకమువారు నిందించు కార్యము. రాజధర్మమునకు విరుద్ధమైన పని. సామాన్య రాజుల విషయమే యిట్లుండ నీవంటివాని విషయ మేమనవలెను. దేవతలను జయించిన నీవు క్రోఁతిని జంపించుటవలనఁ బేరా కీర్తియా?

సీ. క్షత్రధర్మంబునందు వి◆శారదుఁడవు, మేలు మఱవనివాఁడవు ◆ మేటి నీవు
ధర్మవిదులందు లోకంబు◆తప్పు నొప్పు, దెలియుదువు పరమార్థ సు◆ధీవరేణ్య!

తాత్పర్యము.

క్షత్రియుల ధర్మమునందుఁ బండితుఁడవు, కృతజ్ఞుఁడవు, సామాన్య ధర్మములను దెలిసినవారిలో నీకు సమానులు లేరు. జనులు చేయు తప్పులను నొప్పులను దెలిసిన వాఁడవు, పరమార్థము దెలిసిన పండితులందు నీవు శ్రేష్ఠుఁడవు.

క. చదువరి యగు నీబోఁటియు, మదిఁ గింకిరిఁ బూని కాని◆మార్గము చనఁగాఁ
గొనకనివో నన్నాళ్ళును, చదివిన చదువులకు ఫలము ◆ శ్రమ యొకఁడె కదా.

అర్థములు. చదువు+అరి = చదువరి = పండితుఁడు, విద్యావంతుఁడు, నీబోఁటియు = నీవంటివాఁడును, కింకిరి = కోపము, కానిమార్గము = సరిగాని మార్గము - చెడుమార్గము, గొనకనివో = సందేహింపని యెడల.

తాత్పర్యము.

నీవంటి పండితుఁడును గోపమునకుఁ బాలుపడి సరిగాని మార్గమునఁ బోవ సందేహింపనియెడల నెంతో కష్టించి యెక్కుకాలము చదివిన విద్యకు ఫలము కష్ట పడుట యొకటేకదా. చదివిన చదువు లందలి విషయంబు లనుష్ఠాన మందుంచు కొననివాఁడు విద్య నేర్చుటకై పడిన పాటు వ్యర్థము. మూఢుఁడు పండితుఁడు నొక్కవిధముగ వర్తించిరేని వారి కిరువుర కేమి భేదము! శ్రమపడి చదువుట యొకటియే భేదము.

క. కావున నసురేశ్వర! పరిభావితపరిపంథి! యుచిత◆భంగిని మది సం
భావించి చూడుము దగ, నే విధి దండింపు మనిన ◆ నాతం డలుకన్. ౧౧౮౧

అర్థములు. పరిభావిత పరిపంథి = అవమానింపఁబడిన శత్రువులు గలవాఁడా!

తాత్పర్యము.

కాబట్టి శత్రువుల దండించువాఁడా! ఔచిత్యము నాలోచించి మారి నే విధముగ దండింప న్యాయ్యమో యట్లు దండింపుము.

క. పాపాత్ముల వధియించుట, పాపం బగు నెట్లు శత్రు•భంజన! కానన్
బాపచరిత్రుని వానరు, వ్యాపాదితుఁ జేయువాఁడ • నని వచియింపన్. ౧౧౮౩

అర్థములు. వ్యాపాదితున్ = చంపఁబడిన వానిని.

తాత్పర్యము.

విభీషణా! పాపాత్ముల దండించుట పాపమా? కావునఁ బాపపు నడవడి గల క్రోఁతిని జంపించువాఁడను. అని చెప్పఁగా,

ఇప్పటఁ బాపము - రాజద్రోహము - శత్రుపక్షమున వచ్చుట - రాక్షసులఁ జంపుట.

ఆ. అధికరోషయుత మ•నార్యసమ్మతము న,ధర్మమూల మైన • దశశిరస్కు-
పలుకు లాలకించి • ప్రాజ్ఞుఁ డైన విభీష,ణుండు పరమతత్త్వధీవరుండు పలికె.

అర్థములు. అధిక రోష యుతము = మిక్కిలి కోపముతోఁ గూడినది. అనార్య సమ్మతము = పెద్దలు సమ్మతింపనిది. అధర్మమూలము = అధర్మము ఆధారముగాఁ గలది - పరమ తత్త్వ ధీ వరుండు = మిగుల సద్బుద్ధి నేర్పు సమర్థుఁడు.

తాత్పర్యము.

మిక్కిలి రోషముతోఁ గూడినది, పెద్దలు సమ్మతింపనిది, ధర్మ మాధారముగ లేనిది యగు రావణు మాట విని సద్బుద్ధి నేర్పఁగల సమర్థుఁడు, బుద్ధిమంతుఁడు నగు విభీషణుఁ డిట్లు చెప్పెను.

పంచచామరము. క్షమింపు రాక్షసేంద్ర! ధర్మ•సంయుతంబు నా నుడిన్
శమంబుతోడ నాలకింపు • చంపరాదు దూతఁ గా
ర్యముల్ ఘటించువేళ నంచు • సర్వజాతులందునున్
సమస్తసీమలందు సూరి•సంఘముల్ వచించెడిన్. ౧౧౮౪

తాత్పర్యము.

రాక్షసరాజా! నీమాట కెదురు చెప్పుచున్నా నని కోపింపకుము. నా దోషము సహింపుము. నేను ధర్మయుక్తముగాఁ జెప్పుచున్నాను. కోపము వదలి వినుము. దూతను దూతకార్యము చేయువేళఁ జంపరాదు. ఈ మర్యాద అన్ని జాతులందు నన్ని దేశములందుఁ గల దని పండితులు చెప్పుదురు.

సుగంధి. శాత్రవుండు వీఁడు, లేదు • సందియంబు, శిక్షకున్
బాత్రుఁడున్ మహాపకార • చారమున్ ఘటించుటన్
జైత్రవర్య! దూతపట్ల • సజ్జనాళి పల్కడిన్
గాత్రపీడనంబు నాడి • గాఁగఁ జెప్ప శిక్షలన్. ౧౧౮౫

క. సౌధములు విడిచి పరువిడ. దానవమాణవక వృద్ధ•తరుణీజనతా
నానారోదనముల లం,కానగరము గుహల నేడ్చు•కైవడిఁ దోచెన్. ౧౨౯

అర్థములు. మాణవక = బాలురు, జనతా = జనసమూహము.

తాత్పర్యము.

తమ తమ యిండ్లు వదలి పరువెత్తిపోయి రాక్షసబాలురు,వృద్ధులు, వయస్సు స్త్రీ సమూహము, గుహలయందుఁజేరి యేడువఁగా లంకానగరము గుహలందు నేడ్చుచున్నదా యేమి యన్నట్లు లున్నది.

క. ఏమీ చిత్రము భవన, గ్రామంబులతోడ లంక • గాలియు సకలం
బా మహికన్యక మాత్రము, క్షేమంబున నున్న దగ్ని • సేరదు సీతన్. ౧౩౦

అర్థములు. భవనగ్రామంబులు = ఇండ్ల సమూహము, "గ్రామః పల్ల్యాం స్వరే బృందే త్వయం శబ్దాదిపూర్వకః." నానా. ర. గ్రామ శబ్దము సమూహవాచకమైనపుడు దీనికి ముందు శబ్దము మొదలైన దేదైన నొక శబ్దముండును. శబ్దగ్రామము - స్వరగ్రామము - గుణగ్రామము - భూతగ్రామము మొదలైనవి.

తాత్పర్యము.

ఏమి యీ యాశ్చర్యము! లంక ఇండ్లసమూహములతో నంతయుఁ గాలియు సీతాదేవి మాత్రము క్షేమముగా నున్నది. ఆమెను నగ్ని సమీపింపను గూడ లేదు.

క. అని ఋషులు చారణాదులు, వినువీథిని బల్కుచుండ • వీనుల నమృతం
బును గురిసిన యట్లా నుడు,లను విని యా హనుమ పొంగి•లాఁతుగఁ దనలోన్.

అర్థములు. వినువీథిని = ఆకాశమున, వినునట్టి వీథి. ఆకాశము శబ్దగుణకము, నుడులను = మాటలను - లాఁతుగన్ = అధికముగ.

తాత్పర్యము.

ఆకాశమున ఋషులు, చారణులు మొదలగువారు చెవులలో నమృతము పోసినట్లు చెప్పుచుండఁగా నా మాటలు విని హనుమంతుఁడు మిక్కిలి యుప్పొంగి తనలో.

చ. కలిగిన సన్నిమిత్తములఁ • గన్నులఁ జూచిన భూరికారణం
బుల, ఋషి. వాక్యజాలముల • భూమిజ సేమ మెఱింగి, యాత్మలో
నలరుచుఁ గన్నులారఁగ మ•హాసతిఁ జూచి; సుఖం బెఱింగి, యా
వలఁ, బయనింపఁగాఁ దలఁచె • వాయుసుతుండు కృతార్థుఁ డంతటన్. ౧౩౨

అర్థములు. సన్నిమిత్తములన్ = శుభశకునములను, కుడికన్నదరుట లోనైనవి, అలరుచున్ = సంతోషించుచు.

తాత్పర్యము.

శుభశకునములు కలుగుటచేతను, సీతాదేవి మాహాత్మ్యము కన్నులారఁ

జూచి యుండుటచేతను, బుద్ధిబలమూలము చేతను, సీత క్షేమముగా నున్నదని తెలిసి కొని సంతోషించుచు నయినను నా మహాపతివ్రతను కన్నార దర్శించి ప్రత్యక్షముగ క్షేమముగ నుండుట చూచి తెలిసికొని పిమ్మటఁ బ్రయాణము చేయవలయు నని వచ్చిన పని నిర్విఘ్నముగ సాంతముగ నెఱవేర్చిన హనుమంతుఁడు తలఁచెను. ఇట్లు తలఁచి,

—• ౩౬ వ సర్గము. హనుమంతుఁడు మఱల సీతాదేవిని సందర్శించుట. •—

ఉ. ఆ లలితాంగి యున్న యెడ • నా పవనాత్మజుఁ జేరి శింశుపా
మూలగతావనీజఁ గని • మ్రొక్కెడి తల్లి! మదీయభూరి పు
ణ్యావళివశంబునం గుశలి • తాస్థితి వహించెడి నిన్నుఁ గంటి, నా
యేలినవాని కార్యగతు • లెల్లను దీరె యథోచితంబుగన్. ౧౨౬౩

అర్థములు. శింశుపామూలగతావనీజన్ = శింశుపావృక్షము మొదటనుండు సీతాదేవిని, మదీయ = నాయొక్క, భూరి = గొప్ప దగు, పుణ్యాళి = పుణ్యాపరంపరల, వశంబునన్ = కారణముచేత, కుశలితాస్థితిన్ = క్షేమముగా నుంట, ఏలినవాని = ప్రభువుయొక్క, యథోచితంబుగన్ = తగిన రీతిని.

తాత్పర్యము.

ఆ కోమలదేహ యున్న ప్రదేశమునకుఁ బోయి శింశుపావృక్షము క్రిందఁ గూర్చుండిన సీతను దర్శించి నమస్కరించి తల్లీ! నేను జేసిన గొప్పపుణ్యముల పరంపరల కారణముచే క్షేమముగా నుండు నిన్ను మఱల దర్శించు భాగ్యము కలిగెను. నా ప్రభుకార్యమే దేది యెట్లెట్లు చేయవలయునో యట్టట్టు లన్నియుఁ జేసితిని.

దీనివలన 'నీచాశ్రయో న కర్తవ్యః । కర్తవ్యో మహదాశ్రయః' నీచుల నాశ్రయింపరాదు. గొప్పవారినే యాశ్రయింపవలయు నన్నట్లు సీతాదేవి నాశ్రయించిన కారణమున శింశుపావృక్షము అశోకవృక్షములే గాక వాని చుట్టునుండునవి కూడ విఱిగి పడక కాలిపోక నిలిచినవి. దీనివలన సీతారాముల నాశ్రయించిన వారే గాక వారి నాశ్రయించినవారు కూడఁ జెడరని స్ఫురించుచున్నది. విభీషణుఁడే కాక విభీషణు వెంటవచ్చినవారుకూడ రక్షింపఁబడిరిగదా. 'పశుర్మనుష్యః పక్షీ వా యేచ వైష్ణవసంశ్రయాః, తేనైవ తే ప్రయాస్యంతి తద్విష్ణోః పరమంపదమ్‌' విష్ణుభక్తుల నాశ్రయించిన పశువులు మనుష్యులు పక్షులుకూడ వాని వెంట విష్ణుని పరమపదము నకుఁ బోదురు అను శ్లోక మనుసంధింపనగు.

క. అనుచుఁ బ్రయాణోన్ముఖుఁడో, హనుమను మఱిమఱియుఁ గాంచి • యవనిజ యనిశమున్
దనయెడఁ బైఁ గల ప్రీతిన్, మునుకొని సూచించువాక్య • ముల నిట్లనుచున్. ౧౨౬౪

అర్థములు. ప్రయాణోన్ముఖుఁడు = బయలుదేఱిపోవఁ బ్రయత్నించు వాఁడు.

తాత్పర్యము.

ఈ ప్రకారము చెప్పి బయలుదేఱి పోవఁ బ్రయత్నముచేయు హనుమంతు నితో తన భర్తపైఁ దన కుండు ప్రేమ తెలుపు వాక్యములను నిట్లని చెప్పెను.

క. నీ చేకఁడనె యీ కార్యము, పావని ! సాధింప శక్తి • పరుఁడవు సుమ్మా
వావిరి బలోదయముచే, నీవే కనియెదవు కీర్తి • నిర్దళితారీ ! ౧౨౫

అర్థములు. నిర్దళితారీ = చీల్పఁబడిన శత్రువులు గలవాఁడా.

తాత్పర్యము.

ఆంజనేయా ! నీ వొకఁడవే యీ కార్యమును నీ బలాధిక్యముచే శత్రువుల వధించి సాధింప శక్తి గలవాఁడవు సుమా. నా కంటె గొప్పవారు సుగ్రీవునొద్ద నున్నారని నీ భారము నీవు తప్పించుకొన యత్నింపకుము. ఎంత యున్నను ఈ కార్యసాధన భారము నీ యందే యున్నది. మఱి యెవ్వరీ కార్యమును సాధింపలేరు.

క. ప్రాకట శితిశరాసారా, నీకంబునఁ జదిపి లంక • నీటుగఁ గడిమిన్
గైకొని న న్నిఁగినచోఁ, గాకుత్స్థున కదియె తగిన • కార్యము సుమ్మీ. ౧౨౬

తాత్పర్యము. ౧౨౫ వ పద్యము సూచునది.

తే. పరమశూరుండు రాముండు • బవరమందు
నతని మగఁటిమి కనురూప • మైన దాని
తొడ్డ నటన యెవర్ని చెప్పఁదగా • దోజ దీరఁ
వనచరకులావతంస నీ • వనుచుఁ బలుక. ౧౨౭

తాత్పర్యము. ౧౨౦ వ పద్యము సూచునది.

క. వినయము హేతుయుతంబును, ననఘార్థోపహితమైన • యా దేవినుడుల్
విని యంజనాతనయుం, డనినను సముచితపుభంగి • నవనీసుతకున్. ౧౨౮

అర్థములు. అనఘార్థోపహితము = దోషరహితమైన ప్రయోజనముతోఁ గూడినది.

తాత్పర్యము.

అట్లు వినయమును సకారణముగను దోషరహితమైన యర్థముతోఁ గూడినదిగను నుండు నామె మాటలను విని యాంజనేయుఁడు తగిన రీతి నిట్లనియెను.

చ. అకలుష మమ్మ వానర బ • లాన్వితుఁడై యిపుడ రామభద్రుఁ డీ
కడలిఁ దరించి రాక్షసుల • గర్వ మడంచి త్వదీయ శోకమున్
గడపును, నమ్ము నా పలుకుఁ • గీడ్పడ కోసము, రాముఁడాన న
య్యెడ కిదె యేఁగువాఁడ, నెల • వీయఁగదే జనయిత్రి ప్రముక్తాదవే. ౧౨౯

తాత్పర్యము.

తల్లీ ! నీవు వ్యసనపడకుము. రామచంద్రమూర్తి వానరసేనలతోఁ సముద్రము దాఁటివచ్చి రాక్షసుల పొగ రణఁచి నీ శోకమును నిర్మూలనము సేయును.

నా మాట నమ్ముము. నీవు సాహసము చేసి యపాయము కలుగు కార్యము చేసికొనకుము. అవఁగా మరగింపకుము. ఇదిగో యిప్పుడే రామచంద్రమూర్తిని జూడఁ బోవుచున్నాఁడను. అమ్మా! నా కనుజ్ఞ నిమ్ము, నమస్కరించెదను.

•— సీతాదేవిచే సెలవుగొని మరలి హనుమంతుఁ డరిష్టాద్రి నెక్కుట •—

మ. అని సాష్టాంగనమస్కృతుల్ సలిపి కీ•శాధీశుఁడున్ స్వామి ద
ర్శనకౌతూహలి యై లతాబహుళభూ•జవ్రాత మై కేసరి
స్వనగంభీరగుహాసమూహ మయి య•క్షర్షిగంధర్వస
న్మునిసత్త్వాదినిషేవితం బగుచు స్వా•దుస్థితమూలాఢ్య మై. ౧౨౮౦

అర్థములు. సాష్టాంగ నమస్కృతుల్ = సాష్టాంగముగ నమస్కారము. తొలుత సీతాదేవిని జూచినపుడు ప్రాకృతస్త్రీయని తలఁచి హనుమంతుఁడు సీతాదేవికి నమస్కరించినవాఁడుకాఁడు. సంభాషణానంతరము ౧౦౦౧ వ పద్యమున పతివ్రత యనియు, నారాధితస్సుతో నమస్కరించెను. ఇప్పుడు తల్లి యను భావముతో సాష్టాంగముగ నమస్కరించెను. యోగ్యత తెలియు కొలఁది భక్తియు హెచ్చెను. ఇప్పుడు కేవలము మాతృభావమె కాని వేఱుభావము లేదు. దీనివలన నుత్తమ పతివ్రతలను పతిదేవతలను మాతృభావముతో నెట్టివారైన, నెంతటివారైన సాష్టాంగ నమస్కారము చేయవలయు నని యేర్పడుచున్నది. స్వామి దర్శన కౌతూహలి = రామచంద్రమూర్తిని దర్శించుట యందుఁ గోరిక గలవాఁడై - లతా బహుళ భూజవ్రాతమై = అనేక వృక్షములు తీఁగెలు గలదై - కేసరిస్వన=సింహముల ధ్వనులు గల - గంభీర గుహా సమూహ మయి = లోఁతైన గుహల సమూహములు గలది - స్వాదు స్థిత మూలాఢ్యమై = ఒక్కాలి తియ్యనైన వేళ్ళు మొదలయినవి కలదై.

తాత్పర్యము.

ఇట్లు చెప్పి యభివాదనము చేసి యామెచే నాశీర్వదింపఁబడి వానర శ్రేష్ఠుఁడు రాముని దర్శింపఁ గోరిక కలవాఁడై విశేషముగఁ దీఁగెలు చెట్లు గలిగి సింహముల ధ్వనులతోఁ గూడిన లోతుగాటి గుహలు గలదై యక్షసంఘములు, గంధర్వులు మునులు, పాములు గలదై తియ్యని కందమూలములు గలదై.

సీ. తుంగపద్మకజుష్ట•రంగశిలోద్యాన,మాలికాహృద్యమై • క్రాలుదాని
శృంగాంతర విలంబి•రంగత్పయోదోత్త, రీయమై కనుపించు • సేయుదాని
మార్తాండకరశోధ్య•మానోన్నమద్ధాతు, స్త్రీతసంజాత మై • నెగడుదాని
నిర్ఝరచయమంద్ర•నిస్స్వనాఖ్యయనఘో, చాకలితం బయి • యమరుదానిఁ
తే. ప్రస్రవగారావనిస్పష్ట•రమ్యగీత, మైనదానిని దేవదా•ర్వవనిజముల
నూర్ధ్వబాహువు వట్టుల • మొప్పుదాని, నిలను బడు నీళ్ళనులివుల•నేస్పుదాని.

ఈ పద్యము నీసి తరువాతి పద్యము హనుమంతుఁడు సముద్రమును దాఁటుటకై యెక్కిన యరిష్టమను పర్వతముయొక్క వర్ణనము.

అర్థములు. తుంగ = ఎత్తైన - పద్మక = తామరరంగు గల ప్రాంతములచేత - జుష్ట = కూడిన - రంగ = ప్రదేశములు గల, నీలోద్యాన = నల్లని వనముల - మాలికా=వరుసలచే - హృద్యమై = మనోహరమై, శ్రీలుదానిన్ = ప్రకాశించుదానిని, ఇది పర్వతమునకుఁ గట్టు దోవతియై యున్నదని భావము. శృంగాంతర విలంబి = శిఖరముల నడుమ వ్రేలాడుచు - రంగత్ = ప్రకాశించు - పయోద = మేఘములనెడి - ఉత్తరీయమై = ఉత్తరీయము కలదానిని - మార్తాండ కర = సూర్యకిరణములచే - బోధ్యమాన = మేలుకొలుపఁ బడుచున్న - ఉన్మిషత్ = రెప్పలు తెఱచి చూచుచున్న - ధాతు = ధాతువు లనెడి - నేత్రసంజాతమై=నేత్ర సమూహము గలదై, నిర్ఝరచయ = సెలయేళ్ళ సమూహములయొక్క - మంద్ర = గంభీరమైన - నిస్స్వన = ధ్వని యనెడి-అధ్యయన ఘోషాకలితంబు = వేదాభ్యాసముచేయు ధ్వని కలదై, ప్రస్రవణరావ = ఊటనీళ్ళు నూఁతు చప్పుడనెడి, విస్పష్ట= మిగుల స్పష్టముగాఁ దెలియవచ్చు, రమ్య = మనోహరమైన, గీతము = పాటలు గల దానిని, దేవదారు + అవనిజమూల = దేవదారు చెట్లచేత, ఊర్ధ్వబాహువులు = చేతులెత్తినది, ఇలను = నేలమీఁద, ఉలివుల = ధ్వనులచే

తా త్ప ర్య ము.

ఎత్తైన తామర వర్ణము గల ప్రదేశములు గల నల్లని యుద్యానము లనెడి దోవతియు, శిఖరముల నడుమ వ్రేలాడు మేఘము లనెడి యుత్తరీయము గలదై, సూర్యకిరణములచే మేలుకొలుపఁబడిన (విచ్చిన) ధాతువులనెడి నేత్రములు కలదై, సెలయేళ్ళ మంద్రధ్వని లనెడి వేదాధ్యయన ధ్వనికలదై, ఊటనీళ్ళు పడుటవలనఁ గలిగిన విస్పష్టమైన ధ్వని యనెడి సంగీతము కలదై, దేవదారు వృక్షము లనెడి చేతులనెత్తినదై నేలఁబడుచున్న నీళ్ళచప్పుడు గల దానిని.

సీ. శ్యామమై పుష్పించి • శరదభ్రతతులచే, వార్ధకమునఁబోలె • వఱలుచుండ
నెనరుఁబూంగుల గాలి• నెనసెనఁ జొచ్చుచు, వెడలఁ గూజిత మన• వెలయుచుండ
నర్పముల్ బుసగొట్టు•చాటెన హనుమ పై, మల నిశ్వసించిన•మాడ్కి నుండ
నింపారఁగా మంచు • నిండి గంభీరమై గుహాలు ధ్యానించెనీ • వహి భజింప
తే. వారిధరపాదనిభ పాద•వారములను, వదలి దనుచున్న యట్టి నా•గ్యము వహింప
సాలతాలాశ్వకర్ణ వం•శ ప్రకీర్ణ, మగు నరిష్టనగంబు నా•హనుమ యెక్కె. ౧౫౦

అర్థములు. శ్యామమై = నీలమై, శరదభ్ర తతులచే = శరత్కాలమందలి మేఘములచే; వార్ధకమునఁ బోలెను = ముసలితనము నందువలె, కూజితము = అవ్యక్తమధురధ్వని-కోకిల పంచమధ్వని - వారిధరపాద = కొండలు ప్రాకుట కను

శూలమైన, మేఘముల యవయవములతో - నిభ=సమానమైన-పాదవారములను = గుట్టల సమూహముల చేత- ప్రకీర్ణ=విరివియైన- మహీ = విధము.

తాత్పర్యము.

వలుపై - పుష్పించి శరత్కాల మేఘములచే ముసలి దానివలె నుండు దాని, వెదురుబొంగులలో నడుమ నడుమఁ బ్రవేశించి వెడలుటచే పంచమస్వరమువలె ధ్వని గలదానిని, పాములు బుసకొట్టు నెపమున హనుమంతునిపై శ్వాసము విడుచుచున్నట్లుండు దానిని, పూర్ణముగా మంచు నిండి గంభీరమై గుహలు, ధ్యానించు విధముగ నుండుదానిని, మేఘములచేఁ బ్రాకఁబడు గుట్టలు గలదానిని, ముద్ది- తాటి- ఇనుముద్ది- వెదురు- వీనిచే వ్యాపించి యుండుదానిని, అరిష్టమను పేరు గల కొండను హనుమంతుఁ డెక్కెను.

సీ. చక్కఁగాఁ బూచిన • పెక్కు తెల్లంగుల, లతికలచే నలం•కృతము నగుచు
వింతవింతగ బహు•విధము లౌ మృగముల, ధారంబుచే నభి•వ్యాప్త మగుచుఁ
బలుచాయ లగు ధాతు•వుల వన్నె లొప్పారు, శీతలవారి ఘూ•ర్ణితము నగుచు
బండల గుంగుల • ప్రస్రవణంబుల, దుర్గమం బగుచును • దోఁచుదాని

తే. యక్షగంధర్వ ఋషికిన్న•రాహిసేవి, తంబు నగు నాని తెల్ల్యులల్ • వినుదాని
సింగములు కందరములఁ జె•లంగుదాని, రాముఁ గనఁగోరు సత్వర నెక్కె•భీమబలుఁడు.

అర్థములు. లతికలచేన్ = తీఁగలచే- అలంకృతము = అలంకరింపఁబడినది- అభివ్యాప్తము=మిక్కిలి వ్యాపింపఁబడినది- శీతలవారి=చల్లనినీటిచే-ప్రస్రవణంబులన్ =ఊట కాల్వలచే - దుర్గమంబు = పోరానిది. కందరములన్ = గుహలచే.

తాత్పర్యము. స్పష్టము.

క. నిజపాదఘట్టనంబుల, రజమై శిల లణఁగ నెక్కి • రాజీవాళీ
భుజగభయదాబ్ధిఁ గని వా•తజుఁడనిలునిభంగి దాని • దాఁటఁ గడంగెన్. ౧౩౮౪

అర్థములు. నిజపాదఘట్టనంబులన్ = తన కాళ్ళ త్రొక్కుడులచే - రజమై= పొడియై - అణఁగన్ = మాయింపఁగా - రాజీవాళీ = గుంపు వెంటనేసికొని తిరుగు కొలువాసము లను చేపల పంక్తులచే - రాజీవ మజ్జే రాజీవో వ్యూహే మత్స్యే-నానా. రా॥ భుజగ = పాములచే, భయద = భయంకరమైన - అబ్ధిన్ = సముద్రమును - వాతజుఁడు = వాయుపుత్రుఁడు - అనిలుని భంగిన్ = గాలివలె - కడంగెన్ = ప్రయత్నించెను.

తాత్పర్యము.

తన కాలి త్రొక్కుడులచేత ఱాలు పొడి పొడి యగుచుండఁగా నెక్కి కొలన నివాసులు పాములు గలిగి భయము కలిగించు సముద్రమును హనుమంతుఁడు దాఁటఁ బ్రయత్నించెను.

ఉ. ఉత్తరపార మేఁగుటకు • నొత్తఁ బదంబుల శైలరాజమున్
దత్తఱ మంది సత్త్వములు • ధారుణి ద్రొళ్లె వనప్రసూనసం
పత్తులతో ద్రుమోత్కరము • పర్వత కందర సంస్థసింహముల్
చిత్తరపాటుతో దెసలు • పిల్లగిలన్ ధ్వను లిచ్చె హెచ్చుగన్. ౧౭౪

అర్థములు. ఉత్తరపారము = ఉత్తరపు గట్టు, వనప్రసూన సంపత్తులతోన్ = అధికములైన యడవి పూలతో, ద్రుమోత్కరము = చెట్ల సమూహము, పర్వత కందర=కొండగుహలయందు, సంస్థ = ఉన్న సింహములు, చిత్తరపాటు = భయము.

తాత్పర్యము.

సముద్రముయొక్క యుత్తరపుగట్టు చేరు కోరికతో నా పర్వతశ్రేష్ఠమును కాళ్ళచే నదుమఁగా నడవి మృగములు తత్తఱలాడెను. పూల సమూహములతో చెట్లు నేలఁబడెను. కొండ గుహ లందున్న సింహములు బెదరి దిక్కులు పెల్లగిల్లునట్లు విశేషించి ధ్వనించెను.

క. కుసుమితతరుచయములు సరభసముగ, జను నతని తొడలపటువేగమునన్
జనచెడి వ్రజము తాఁకున, వసుమతిఁ గూలినవిధానఁ • బడె భగ్నములై.

అర్థములు. కుసుమితతరు చయములు = పూచిన చెట్ల సమూహములు, సరభసముగన్ = శీఘ్రముగ, భగ్నములై = విఱిగినవై.

తాత్పర్యము.

వేగముగఁ బోవు నతని తొడలు తాఁకి పూచిన పూలచెట్లు బిగువు చెడి పిడుగుపడిన విధమున విఱిగి నేలఁ బడెను.

క. గాఢపుపట్టి జవోద్ధతిఁ, బీడితలై గిరిమృగేంద్ర • బృందంబు గుహా
క్రోడంబులలోఁ దబ్బి, బ్బాడెను గగనంబు పగులు • నారవ మెసఁగన్. ౧౭౬

అర్థములు. జవోద్ధతిన్ = వేగాధిక్యముచే, పీడితలై = బాధింపఁబడినవై. గిరిమృగేంద్ర బృందంబు = కొండ సింహముల సమూహము, గుహాక్రోడంబులలో = గుహలందలి సందులలో, తబ్బిబ్బాడెను = తత్తఱపడెను.

తాత్పర్యము.

హనుమంతుని వేగాతిశయముచే బాధింపఁబడి కొండ సింహములు గుహలలో మూలల యందలి సందులలోఁ దబ్బిబ్బై దిక్కులు పగులునట్లు ధ్వనించెను.

క. నూలఁగఁ జీరలు పైఁటలు, ప్రేలఁగ మెఱయుభూషణములు • వీడ్పడఁ గలఁగన్
శైలంబున విద్యాధర, బాలామణు లెగసి చనిరి • పటుజవయుక్తిన్. ౧౭౮

తాత్పర్యము.

చీరలు జాఱిపోవుచుండఁగా పైఁటలు ప్రేలాడుచుండఁగా, ఆభరణము లొక దానితో నొకటి పెనచికొని మాఱ్పడుచుండఁగా కలఁతచెంది యా కొండయందలి విద్యాధర స్త్రీలు మిగుల వేగముగ నెగసి పోయిరి.

సీ. అధికప్రమాణమహావిషదీప్తజిహ్వాలు గొల్లఁ బాములు తలలు నలియఁ
గిన్నరోరగయక్షకింపురుషాదులు, గగనస్థులైరి తన్నగము విడిచి
సనగకూటోదగ్రశైలంబు దిగఁబడి, యారసాతల మేగె సమ్యగముగఁ
బదియోజనంబుల వెడల్పును ముప్పది, యోజనంబుల నొత్తు నొప్పుచున్న
తే. యా ధరాధర మొకత్రుటియంతలోన, నేలమట్టంబుగాఁ బోయె నీరనిధిఁ ద
రింప నుద్యుక్తుఁ డగుచు మహాకపివరుఁ, డిట్లు మింటికిఁ గుప్పించి యెగయుటయును.

అర్థములు. అధిక ప్రమాణ=మిక్కిలి గొప్పవగు=మహావిషదీప్తజిహ్వాలు= గొప్ప విషముచే జ్వలించు కోఱలు గలవి, నలియన్ = నలిగిపోఁగా, సనగకూటోదగ్రశైలంబు = చెట్లతో శిఖరములతోఁ గూడి పొడవైన పర్వతము, ఆరసాతలము= పాతాళము వఱకు, అవ్యయీభావ సమాసము. 'విభాషా అపపరిబహిరంచవః పంచమ్యాః' పాణి. II. I.-11-12 నేలమట్టంబుగాన్ = నేలతో సమముగా, ఉద్యుక్తుఁడు= ప్రయత్నించినవాఁడు.

తాత్పర్యము.

హనుమంతుఁడు సముద్రము దాఁటుటకై యాకాశమునకుఁ గుప్పించి యెగురఁగా మిగుల పెద్దవై చెడ్డ విషముచే జ్వలించు కోఱలు గల పాములు తలలు నలుగు నట్లు రాల సందుల జొచ్చెను. కిన్నరులు పన్నగులు యక్షులు కింపురుషులు లోనగు వారు ఆ పర్వతము విడిచి యాకాశమున కెగిరిరి, చెట్లతో శిఖరంబులతో ఎత్తైన పర్వతము పాతాళము వఱకు దిగఁబడెను. పదియోజనముల వెడల్పు, ముప్పది యోజనముల యొత్తుగల యా పర్వతము నిమిషములో నేలతో సమ మయ్యెను.

—* ౫౭-వ సర్గము. హనుమంతుఁడు మరల సముద్రము లంఘించుట *—

సీ. అర్కకారండవం బబ్జకువలయంబుఁ, దిష్యశ్రవణహంస దీపితంబు
జలధరశైవాల శాద్వలంబును బున, ర్వసుమహామీనవి రాజితంబు
నంగారక మహాగ్రహంబు నైరావత, ద్వీపంబు స్వాతిహం సోపచితము
వాతసంఘాతసం జాతోర్మిచంద్రాంశు, శిశిరాంబుమంతంబు సిద్ధయక్ష
తే. భుజగగంధర్వఫుల్లకరజము నైన, యంతరిక్షార్ణవమున మహాంబురాశి
నావ చరియించుచందాన నవ్యలీల, నంజనానందనుం డేగె నశ్రమముగ.

అర్థములు. ఆకాశమున హనుమంతుఁడు పోవుటను సముద్రమునందుఁ బోవు నావతోఁ బోల్చి చెప్పుచున్నాఁడు. అర్కకారండవము = సూర్యుఁడనెడు నీటికోడి కలది- అబ్జకువలయంబు = చంద్రుఁడనెడి కెల్లకలువ కలది- తిష్య = పుష్య నక్షత్రము- శ్రవణ = శ్రవణము అనెడి; హంస దీపితంబు = హంసలచేఁ బ్రకాశించునది- జలధర=మేఘ మనెడి- శైవాల=నాఁచు తీఁగె గలదియు- శాద్వలము=పచ్చిక ప్రదేశము కలదియు- పునర్వసు=పునర్వసునక్షత్రము లనెడి, మహామీన=పెద్ద చేఁపలచే

విరాజితంబు = ప్రకాశించునది - అంగారక = అంగారకుఁడను మహాగ్రహంబు లనెడి మొసలి గలదియు, గ్రహమే గ్రాహము - ఐరావత = ఐరావతము. అభ్రగజము కావున నది యాకాశమునందే తిరుగుచుండును, కావున నైరావత మనెడి, ద్వీపంబు= దీవి గలది - స్వాతి హంసవిలసితము = స్వాతి యనెడి హంసచేఁ బూరితము - వాత సంఘాత = వాయుసమూహముచే - సంజాత = పుట్టిన అల లనెడి, చంద్రాంశు = చల్లని కిరణములచే - శిశిర = చల్లనైన - అంబుమంతంబు = నీళ్లు గల మేఘము- ఫుల్లసరసిజము = వికసించిన కమలము - అంతరిక్షార్ణవమునన్ = ఆకాశ మనెడి సముద్రమందు - అశ్రమముగన్ = గాసిలేక.

తాత్పర్యము.

సూర్యుఁ డనెడి నీరుకోడి, చంద్రుఁ డనెడి తెల్ల కలువ, పుష్యశ్రవణ నక్షత్రము లనెడి హంసలు మేఘము లనెడి నాఁచి - పచ్చిక - పునర్వసు వనెడి మహామీనము, అంగారకుఁ డను మొసలి, ఐరావత మనెడి దీవి, స్వాతి యనెడి హంసము, గాలివలనఁ గలిగిన యల లనెడి మేఘము, సిద్ధులు యక్షులు సర్పములు గంధర్వులు ననెడి వికసించిన కమలములు నయి యాకాశ మనెడి సముద్రమున, సముద్రమును నావదాటు నట్లు హనుమంతుఁడు ఆకాశమునఁ బోవుచుండెను. సావయవ రూపకాలంకారము. రూపకోపమానములకు తిలతండుల న్యాయ సంసృష్టము.

తే. ఆకసంబును మ్రింగునో యబ్జవైరిఁ, బట్టి గీఁకునో సహతార•భాస్కరంబు
గగనము హరించునో యనఁ•గపివరుండు, చనియె మబ్బులఁ జీల్చెడి•చందమునను.

అర్థములు. అబ్జవైరిన్ = చంద్రుని, సహతార భాస్కరంబు = నక్షత్ర సూర్యులతోఁ గూడిన, గగనమున్ = ఆకాశమును.

తాత్పర్యము.

స్పష్టము.

తే. తెలుపు నెఱుపును బసుపును•నలుపునగుచుఁ, గృష్ణలోహిత వర్ణంబు•నెసఁగుచుండ
నమల తేజస్వి యగు మరు•దాత్మజాను దేహసంపర్కమున మొగుల్ • తేజరిల్లె.

అర్థములు. కృష్ణలోహిత వర్ణంబు = నలుపు ఎఱుపు గలసిన వన్నె.

తాత్పర్యము.

మిగులఁ దేజోవంతుఁడైన హనుమంతుని దేహమును దాఁకుటచే, మేఘములు కొన్ని తెలుపుగను కొన్ని నెఱుపుగను పసుపుగను నలుపుగను ఎఱుపు నలుపు గలసినవిగను నానావిధముల నొప్పుచుండెను.

క. మాటి మాటి లోనం జొచ్చుచు, మఱి మఱి వెలుపలను దోఁచి•మబ్బుల నడుమన్
మాటుఁగుచు మెఱయుచు నొప్పెసి, కఱకంఠుని శిరసుపూవు•గతిఁ గపి యొప్పెన్.

అర్థములు. మాటుఁగుచున్ = దాఁగుచున్, మెఱయుచున్ = వెలుపలఁ బ్రకాశించుచు, కఱకంఠుని = శివుని యొక్క, శిరసు పూవు = తలయందలి పువ్వును

అనఁగాఁ జంద్రుఁడు, కలకంఠుఁడు=కల్ల అనఁగా నలుపు, అది కంఠమునందుఁ గల వాఁడని బహువ్రీహి యని కొందఱి యభిప్రాయము. గరకంఠశబ్దభవ మని కొందఱి యభిప్రాయము.

తాత్పర్యము.

ఒక్కొక్కసారి మేఘముల నడుమఁ బ్రవేశించి కానరాక యొక్కొక్కసారి బయల వెలసి కానవచ్చుచు మబ్బులనడిమి చంద్రునివలె హనుమంతుఁ డొప్పెను.

తే. విశదవస్త్రంబు ధరియించి • వివిధమేఘ, కాండవృతుఁడయి కనఁబడి • కానఁబడక
యంబరంబునఁ జనియెడి • యాంజనేయుఁ డంబుజారి విధంబున • డంబు మీఱె.

అర్థములు. విశదవస్త్రంబు = తెల్లని వస్త్రంబు, దీనిచే నిందఱు రాక్షసులఁ బోరి వారిని చంపినను కట్టువస్త్రముపై నెత్తురు చుక్కలు పడలేదని సూచన, మేఘకాండవృతుఁడయి=మేఘసమూహములతోఁ జుట్టఁబడి, అంబుజారి=చంద్రుఁడు.

తాత్పర్యము.

తెల్లని వస్త్రము ధరించి నానావిధములైన మేఘసమూహములతోఁ జుట్టఁబడి కానవచ్చి కొంతసేపు కానరాక కొంతసేపు ఆకాశమునఁ బోవు హనుమంతుఁడు చంద్రునివలె నుండెను.

తే. వారిధరనికురుంబంబు • దారితముగ, మాటి మాటికిఁ జెలువుచు • మారుతాత్మ
భవుఁడు బయలను మెఱయుచు • వైనతేయుమాడ్కిఁ దవరారె నాకాశ • మార్గమునను.

అర్థములు. వారిధర నికురుంబంబు = మేఘసమూహము-దారితముగన్ = చీల్చఁబడినదిగా - వైనతేయు మాడ్కిన్ = గరుత్మంతునివలె - వినతా+ఏయ - వైనతేయు - అపత్యార్థక తద్ధితము.

తాత్పర్యము.

మేఘ సమూహము నడుమఁదూఱి చీల్చుచు నాంజనేయుఁడు బయల మెఱసి గరుత్మంతుని వలె నాకాశమున నొప్పుచుండెను.

సీ. జలదనిర్ఘోషుండు • చటుల మహారావమున దెస లెల్లను • బాధిర్యములుగ
రాక్షసప్రవరుల • రణమున వధియించి, తనపేరు నెల్లరు • వినఁగఁ జేసి
పట్టణం బంతయు • న్వ్యాకులపడఁ జల్చి, పంక్తికంఠుఁడు వ్యథ • పడ నొనర్చి
ఘోరబలం బెల్లఁ • గూఁపెట్టఁగాఁ గొట్టి, వైదేహికిని గడు • భక్తి మ్రొక్కి
ఆ. మహితతేజుఁ డైన • మారుతపుత్రుండు, మరలివచ్చి జలధి • మధ్యమునను
జనుచునుండె శైల • సత్తము మైనాకు, హస్తమున స్పృశించి • యతని దాఁటి.

అర్థములు. జలదనిర్ఘోషుండు = ఉఱుమునంటి కంఠధ్వని గలవాఁడు - చటుల మహారావమున = భయంకరమైన గొప్ప ధ్వనితో - కూఁపెట్టగాన్ =కుయ్యో కుయ్యో యనునట్లు.

తాత్పర్యము. స్పష్టము

హనుమంతుఁడు లంకయందుఁ జేసిన కృత్య మిందు సంగ్రహింపఁబడినది. ఇందు మైనాకు స్పృశించె ననుటచేతను శ్రీరామచంద్రమూర్తి సీతాదేవితో మరలి వచ్చునపుడు మైనాకుని జూడుమని చెప్పుటచేతను మైనాకుఁడు మరల నీళ్లలో మునుఁగ లేదనియుఁ బైన కానవచ్చుచుండెననియు గ్రహింపనగు.

తే. జ్యాలతాముక్తనారాచ • మనఁగ నరిగి, వారిదాభమహేంద్రంబు•నలను చూచి
దశదిశలు నిండ సింహనా•దంబు చేసె, మేఘనాదంబుఁబోలె న•మేయశక్తి.

అర్థములు. జ్యాలతాముక్తనారాచమనఁగన్ = తీఁగెవంటి యల్లెత్రాటి నుండి విడువఁ బడిన బాణమో యనునట్లు - వారిదాభమహేంద్రంబు = మేఘముతో సమానమైన మహేంద్రపర్వతము.

తాత్పర్యము.

పరిమితి చెప్పరాని శక్తిగల హనుమంతుఁడు నిండెనారినుండి విడువఁబడిన బాణమువలెఁ బోయి మేఘమువలె నుండు మహేంద్రపర్వతముఁ జూచి పది దిక్కులు నిండున ట్లురుమువలె సింహనాదము చేసెను.

క. హితదర్శనలాలసుఁడై, వితతంబుగ నార్చి తోఁక • విధుఁపఁగఁ గపి య
ద్భుతఘోషమున దివాకర,యుతగగనము బ్రద్దలైన•యొప్పుంగనిచెన్. ౧౬౯౮

అర్థములు. హితదర్శనలాలసుఁడై = మిత్రులను జూడవలయు నను కోరిక గలవాఁడై - వితతంబుగన్ = ధ్వని విస్తరించునట్లు - ఆర్చి = అడించి - విధుఁపఁగన్ = విదలింపఁగా - దివాకరయుత = సూర్యునితోఁ గూడిన - దీనివలన నిర్మలతయు పగటి చర్య యని సూచన.

తాత్పర్యము.

మిత్రులఁజూడఁ గోరిక కలవాఁడై తోఁక జాడించి విదళింపఁగా నా యద్భుత ధ్వనికి సూర్యునితోడి యాకాశము బ్రద్దలై నట్లుదోఁచెను.

—• హనుమంతుని సింహనాదము కపులు విని హర్షించుట •—

ఉ. ఆయులి వూరువేగమును • నావలితీరమునందు దీను లై
వాయుతనూజుఁ గాచు తరి • వర్తిలుక్రోఁతులు విన్న హృష్టు లై
రాయెడ ఋక్షరాజ జలరి • యందఱుఁ జేరఁగఁ జీరి యి ట్లనున్
జే యని వచ్చె వాయుజుఁడు • సిద్ధము కార్యము పండు చూడుఁడీ. ౧౬౯౯

అర్థములు. హనుమంతుఁడు కానవచ్చుటకు ముందే యాయన సింహనాదము వానరులకు వినవచ్చెను. ఉలివు = కంఠనాదము, ఊరువేగమును=తొడల వేగమునఁ బుట్టిన ధ్వని, దీనులై = ఏమో యేమో యను వ్యసనముచే ముఖములు వ్రేలవైచికొనినవారై, ఋక్షరాజ = జాంబవంతుఁడు, అలరి = సంతోషించి, చీరి= పిలిచి, జే =జయశబ్దభవము.

తాత్పర్యము.

హనుమంతుని సింహనాదము, తోకల కంపున దూరమున నెడలు గాని ధ్వనిని, అవలి నెదురుచూచున వ్యసనపడుచు నెప్పుడెప్పుడు హనుమంతుని జూతుమా యను కోరిక గల శ్రోతలు విని సంతోషించినవారైరి. అప్పుడు జాంబవంతుడు వారి సందడిఁ నిలిచి యిట్లనెను. వానరులారా! హనుమంతుడు జేయని వచ్చుచున్నవాఁడు. పోయిన కార్యము ఫలించినది చూడుడి.

ఉ. సందియ మేమి లేదు ధ్వని • చందము తెల్పెడిఁ గార్యసాధనం
బెందు నసాధితార్థులకు • నీ రవ మేటికిఁ గల్గు? నన్న న
య్యందఱు మిత్రదర్శనము • నాశ సముత్సుకులౌచు నంతటా
నందనురావమున్ విని చ • నంత ముదంబున గంతు లాడుచున్. ౧౩౦౦

అర్థములు. అసాధితార్థులకు = కార్యము సాధింపనివారికి, రవము=ధ్వని.
కీలివలన శుభవార్త తాను శోకముండే తన మిత్రులకుఁ దెలిపి వారి కుంకు మూన్ని సంతోషపెట్టవలయు నని సూచన - మనము పోయి చెప్పవచ్చులే యని యుండ రాదు. అంతవఱకు నిష్కారణముగా వారు వ్యసనపడునట్లు చేయుట మిత్రధర్మము గాదు.

తాత్పర్యము.

సందేహము లేదు. హనుమంతుడు కార్యము సాధించెను. అది నీ కెట్లు తెలిసె ననుచురా? ఆయన ధ్వనియె కార్యము సాధించె నని తెలుపుచున్నది. కార్యము సాధింపని వాఁ డింత యుత్సాహముగ సింహనాదము చేయుఁడు. అని చెప్పఁగా తక్కిన శ్రోతలు హనుమంతుడు వచ్చుచున్నాఁడని సంతోషించెను. జాంబవంతుడు కార్యము సఫలము చేసికొని వచ్చుచున్నాఁడని సకారణముగఁ జెప్పెను. ఇట్లు చెప్పఁగా వారందరు మిత్రుని దర్శించు నాశచే నాయన ధ్వని వినుచు గంతులు వేయుచుండిరి.

తే. ఒక్క శిఖరంబు నుండి వేఱొ • కొక్క శిఖర
మునకు నొక కొమ్మ నుండి స • మున్నతంపుఁ
జెట్టుకొనకొమ్మ కెగురుచు • నిట్టలంపుఁ
బ్రమ్మదంబునఁ గ్రాలుచు • సందడించి. ౧౩౦౧

అర్థములు. సమున్నతంపు = మిగుల నెత్తైన - నిట్టలంపు = అధికమైన, నిట్టలము రూ - ఇట్టలము.

తాత్పర్యము.

వచ్చుచున్న హనుమంతుని చూచుట కుతూహలముతో నొక శిఖరమునుండి యంతకంటె నెత్తైన శిఖరమునకు, నంతలో నొక చెట్టుకంటె నెత్తైన యింకొక చెట్టునకు, నింకొక కొమ్మకంటె నెత్తైన యింకొక కొమ్మకు వానరులు మిగుల సంతోషముతో నెగురుచు కిలకిలారవములు సందడి చేయుచు.

క. పట్టుగ దూరపు జనులను; బట్టముఁ జూపించురీతిఁ • బుష్పితతరులన్
గొట్టకొనకొమ్మలను జెస, బిట్టుగ నాడించి యూఁచి • పేర్చిరి క్రోఁతుల్. ౧౩౦౨

అర్థములు. పుష్పిత తరులన్ = పూచిన చెట్ల యందలి.

తాత్పర్యము.

తా మున్న స్థానము తెలుపుటకై దూరమున నుండు వారికి గుడ్డలను చేతులతో నాడించి విసరి చూపునట్లు వానరులు పూచిన కొమ్మల నాడించిరి. ఊఁగులాడించిరి.

క. గిరిగుహల దాఁగి మ్రోయుచు, నురువడి వెలివచ్చుగాలి • యొప్పున గర్జల్
పరఁగించుచుఁ జనుదెంచెను, సరభసముగ మారుతాత్మ • సంభవుఁ డంతన్. ౧౩౦౩

అర్థములు. మ్రోయుచున్ = ధ్వనించుచు, ఉరువడి = మిగుల వేగముతో, వెలివచ్చు = బయటికి వచ్చు- సరభసముగన్ = వేగముగ.

తాత్పర్యము.

కొండగుహలయందు దాఁగియుండి మిగుల వేగముతో ధ్వనించుచు వెలుపలికి వచ్చుగాలి విధమున సింహనాదములు చేయుచు వేగముగ నాంజనేయుఁడు వచ్చెను.

క. జలధరమార్గంబున నచ్చలియుఁడు జలదోత్కరంబు • పగిదిన్ రాఁగన్
వలిముఖు లందఱు ఘటితాంజలు లై నిలిచిరి నభంబు • చాయం గనుచున్.

అర్థములు. జలధర మార్గంబునన్ = మేఘమార్గమున ఆకాశమందు - జలదోత్కరంబు = మేఘ సమూహమువలె, వలిముఖులు = వానరులు - ఘటితాంజలులై = చేతులు జోడించినవారై - నభంబు = ఆకాశము.

తాత్పర్యము.

ఆకాశమార్గమున మేఘమువలె బలవంతుఁ డగు హనుమంతుఁడు రాఁగా వానరు లందఱు చేతులు జోడించుకొని యాకాశము వంకఁ జూచుచు నిలిచిరి.

—• హనుమంతుఁడు మహేంద్రాద్రిపై దిగుట. •—

క. గిరినిభుఁ డగు కపిఋషభుఁడు, తరునికరాకులమహేంద్ర • ధరకూటమునన్
త్వరితుఁ డయి వ్రాఁకి గిరినిర్ఝరమునఁ బడె నిహతపక్ష • శైలం బనఁగన్. ౧౩౦౫

అర్థములు. గిరినిభుఁడు = పర్వతముతో సమానుఁడు - కపిఋషభుఁడు = వానర శ్రేష్ఠుఁడు - తరునికర = చెట్ల గుంపులచే - ఆకుల = నిండి యుండు - గిరినిర్ఝరమునన్ = కొండవంక యందు - నిహత పక్షశైలంబు = రెక్కలు విఱిగిన పర్వతము.

తాత్పర్యము.

కొండవంటి దేహము గల హనుమంతుఁడు వృక్షములచే నిండియుండు మహేంద్ర పర్వత శిఖరము నందు వేగముతోఁ గూడిన వాఁడయి కాలు మీఁది దూఁకిన

గాయపడని కొండవంకయందు పిట్టలో ఱెక్కలు విఱిగిన పర్వతమువలె దబా లున బడెను.

శ్రీరామ దర్శనమునకై పోవుట యను నొక నిమిత్తమైన జాలు కారా దని గూఢముగ త్వర సూచించుచున్నది. లేని యెడల నూరకయుండియే వేగము తగ్గించి వచ్చియుండ వచ్చును.

క. ప్రీతమనంబునఁ గపివర,జాతంబులు గంధవాహ•సంభవుచుట్టున్
గౌతుకమున నిలుచుండిరి, యాతనిఁ గనుఁగొనుచు మెచ్చి • యూహను మిగులన్.

తాత్పర్యము.

సంతోషించిన మనస్సులతో వానర శ్రేష్ఠుల సమూహంబులు వాయునందను చుట్టుకొని యాయన యేమి చెప్పునో వినవలయు నను కోరికతో వానిని జూచుచు, మెచ్చుచు నుండిరి.

మానిని. అంతట వానరపుంగవు లెల్ల ని•రామయుతం గనుకట్టు హను
మంతునిఁ జూచి నితాంతముదంబున • మూ వగు మూలఫలాదిక మే
కాంతి ముపాయన మిచ్చి కుఱంగట • నందఱుఁ జేరి భజింప శుభ
స్వాంతుఁడు ఋక్షధవాంగదవృద్ధుల • కర్మిలిఁ జేసి నమస్కృతులన్. ౧౩౦౭

అర్థములు. నిరామయుతన్ = ఒక గాయమైన లేక - నితాంత ముదంబునన్ = మిగుల సంతోషముతో - మూలఫలాదికము = వేళ్ళు పండ్లు మొదలైనవి- ఉపాయనము = కానుక - కుఱంగటన్ = సమీపమందు, ఋక్షధవ + అంగద వృద్ధులకు = జాంబవంతునకు నంగదునకు పెద్దవారికి - అర్మిలి = ప్రేమతో - భక్తితో.

తాత్పర్యము.

ఆ పిమ్మట వానరశ్రేష్ఠు లందఱు గాయమైనను బడక దేహబాధ లేక యుండు హనుమంతుని జూచి మిగుల సంతోషించి మూలఫలంబులు కానుకగ నిచ్చి దగ్గఱఁ జేరి యుండఁగా హనుమంతుఁడందఱకు జ్ఞానవృద్ధుఁడు వయోవృద్ధుఁడు నగు జాంబవంతునకు ఆ పిమ్మట యువరాజగుటచే నంగదునకుఁ దరువాతఁ దనకంటె వయస్సునఁ బెద్దవారగు వారికి భక్తితో నమస్కరించెను. వృద్ధులనఁగా.

'దశాబ్దాఖ్యం పౌరసఖ్యం - పంచాబ్దాఖ్యం కలాభృతామ్।త్ర్యబ్దపూర్వం శ్రోత్రియాణా మల్పేనాపి స్వయోనిషు.' మను. ౨

ఒక గ్రామమందే యుండువారు తనకంటెఁ బదియేండ్లు పెద్దవారైనచో సఖు లగుదురు. అంతకుఁ బైబడినవారు పెద్దవా రనిపించుకొందురు. గీతాది విద్యలు నేర్చిన వారు తనకంటె నైదేండ్లు పెద్దవాఁడైనచో సఖుఁ డగును. అంతకుఁ బెద్దవాఁడు పెద్ద వాఁడనబడును. వేదములు చదివినవాఁడు మూఁడేండ్లు పెద్దవాఁడయినచో సఖుఁడగును. అంతకుఁ బెద్దవాఁడు పెద్దవాఁడనఁబడును. తనవంశేను వారిలో నన్నలు మొద

లగువారే మూర్తియు వయస్సున పెద్దవారైనను సఖులగుదురు. ఆ కారణమున నర్థము లందఱు నభివాదనార్హులు.

మాలిని— ఏడు భగణములు గురువు. పదునాఱవ స్థానంబున యతి. మాలిని యందలి మొదటిగురువు రెండు లఘువులు చేసిన కవిరాజ విరాజిత మగును. కవిరాజ విరాజితమునను వలె మాలినికిని తిక్కన యతులు రెండు విధములఁ గల్పించినాఁడు.

మాలిని. కూలియుఁ గాంచి యిూగున్నఁగఁ దేవను • గుందగ వహ్నులు • ప్రాలకెక్కా. స్త్రీ. ౨-౧౨౭.

ఇం దేడింట నేడింట నేడింట యతులు గూర్పఁబడినవి.

కావున నీ దెస నాలనికిన్ విమ•ఖత్వముగల్గను భక్తి మెయిన్ స్త్రీ-౧-౧౪.

ఇందు పదునాఱవ స్థానంబున యతి గూర్పఁబడెను.

—• హనుమ కపులతోఁ దాను సీతాదేవిని జూచితి నని చెప్పుట. •—

సీ. చూచితి సీత నం•దను సంగ్రహముగాఁగఁ, జెప్పి యుంగను కేలు • చేర్చి కేల
నా మహేంద్రాద్రిని•వ్యాప్తారామతలమున, నాసీనుఁడై వాన•రాళిఁ జూచి
రూక్షరాక్షసపతి•రక్షితసీతను, జూచితి సాధ్వి న•శోకవనిని
విధువర్ణనాసక్తిఁ • బెనఁగొన్న కురులతో, నుపవాసములఁ జిక్కి • యున్నదనిన

తే. నమృతతుల్య మహార్థ వా•క్యములఁ గ్రోలు
చెగువవారును మాఱువా • రింకు నందుఁ
గూయువారుఁ గిలార్చుచు • గ్రోయువారు
వాలముల నెత్తి నేలపై • బాఁదువారు. ౧౩౦౭

అర్థములు రూక్షరాక్షస పతిరక్షితన్ = కఠినచిత్తులైన రాక్షస స్త్రీలచేఁ గావలి కాఁచఁబడుచున్నదానిని, విధువర్ణనాసక్తిన్ = మగనిఁజూచు కోరికతో, అమృత తుల్య = అమృతముతో సమానమైన. మహార్థ = గొప్ప ప్రయోజనము గల, వాక్య ములన్ = మాటలను, సీత యుపవాస మున్నదని చెప్పుటచే కిష్కింధాకాండమున నింద్రుఁ డమృత పాయసము దినదినము దెచ్చి యిచ్చుచుండె నని కథ కల్పిత మని యేర్పడు చున్నది. చూచితి సీతన్ = ఇది సుగ్రీవుని వాక్యానుసారము. కిష్కింధ. ౧౦౭౭ వ పద్యము చూడునది.

తాత్పర్యము.

ఏమి చెప్పునో సీత కనఁబడె నని చెప్పునో, కానరాలేదని చెప్పునో యని తహ తహ లాడు వానరుల మనస్సు కుదుటఁబడఁ జూచితి సీత నని రెండుమాటలలో హనుమ కేముఁ దెలిపి యుంగరము చేతిని తనచేతఁ బట్టుకొని పోయి యా మహేంద్రపర్వత మున రమ్యమైన వనప్రదేశమందు నందఱుఁ గూర్చుండుటకు ననువైన చోట గూర్చుండి వానరుల నందఱుఁజూచి కఠినాత్ములైన రాక్షస స్త్రీలచేత రక్షింపఁబడు సీతను

జూచితివి. ఆ పతివ్రత యశోకవనమందు తన భర్తను బాసి శోకముతోఁ జిక్కి పోయిన వెంట్రుకలతో, ఆహారములేక కృశించి యున్నది అని చెప్పఁగానే యమృతముతో సమానమై, పోయిన తమ ప్రాణములను మరల రక్షించినవై, మహాప్రయోజనము గల వాక్యముల విని సంతోషాతిశయమున బాహ్యమును విను నోపికలేక కొంద ఱెగుర సాగిరి. కొందఱు మూలిగిరి. కొందఱు కిలకిలార్భటులు నించిరి. కొందఱు తోఁకలెత్తి నేలకు బాదిరి.

తే. ద్విరదతుల్యులు క్రోఁతులు • తరుల నుండి
దుమికి హనుమంతుఁ బరిరంభ•ణము నొనర్చి
రంత సర్వవనాటమ•ధ్యంబునందు
వాలితనయుండు పల్కె న•వ్వాయుతనయు. ౧౩౦౯

అర్థములు. ద్విరదతుల్యులు = ఏనుగులతో సమానులు, పరిరంభణము = కౌఁగిలింత, సర్వవనాట మధ్యంబునందు=క్రోఁతుల యందఱ నడుమ.

తాత్పర్యము.

అందఱు నేలఁ గూర్చుండి వినవలయు ననిరఁ గొందఱును హనుమంతుఁడు మూర ముగ నాపుఁ గొంద ఱేనుగుల వంటివారు హనుమంతునకు సమీపమున నుండు చెట్లపై నుండి వినుచుండిన వారు హనుమంతుని మాటలు చెవినిఁ బడఁగానే చెట్లనుండి దుమికి హనుమంతుఁ బ్రతికించితివి తండ్రీ! యని కౌఁగిలించిరి. అప్పు డా క్రోఁతులనడుమ నున్న యంగదుఁడు హనుమంతునితో నిట్లనెను.

క. విస్తారం బగు వారిధి, నిస్తరణ మొనర్చి మరలి • నెమ్మది రాఁగన్
శస్తగతి నెవ్వఁ డోపును, నిస్తులజవసత్త్వములను • నీ సముఁ డేఁడీ! ౧౩౧౦

అర్థములు. నిస్తరణ మొనర్చి = దాఁటిపోయి, నిస్తుల=అసమాన మైన - జవసత్త్వములను=వేగమునందు, బలమునందు.

తాత్పర్యము.

ఇంత పెద్ద సముద్రమును దాఁటి పోయి సుఖముగా మరలి యెవ్వఁడు రాఁ గలఁడు! వేగమునందు, బలమునందు నీతో సమానుఁడు లేఁడు.

క. ఔరా! నీ ప్రభుభక్తియు, నౌరా! నీ శక్తి ధైర్య • మరరే! హనుమా
భూరితరాదృష్టంబున, శ్రీరామునిరమణిఁ గంటి • సీతాసాధ్విన్. ౧౩౧౧

తాత్పర్యము.

ఔరా యేమి నీ ప్రభుభక్తి. నీ శక్తి యేమి. ధైర్యమేమి ఔరా! ఆశ్చర్యకరము. మా యందఱి భాగ్యవశమున నీవు శ్రీరాముని భార్యను, పతివ్రతయగు సీతాదేవిని జూచితివి.

ఆ. జానకీవియోగ•సంతాపమును భూప,వర్యుఁ డిపు డదృష్ట•వశతఁ బాసె
నీదు పోకరాక•నిటు మాకుఁ దెలియంగఁ,బలుక వయ్య కర్ణ•పర్వముగను. ౧౩౧౨

తాత్పర్యము.

సీతను విడిచి యుండుటవలనఁ గలిగిన శోకమును రామచంద్రమూర్తి యదృష్ట వశమున వదలెను. నీ వెట్లు పోయితివో, యేమి చేసితివో, యెట్లు చూచితివో యని యంతయు మాకుఁ బూర్ణముగ చెవుల పండువుగ వినిపింపుము.

తే. అనిన వానరులెల్ల వా◆తాత్మజాతు, జాంబవంతుని నంగదు ◆ సరసఁ జుట్టి
యుండి రమ్యంపుఁ బెద్దదౌ ◆ బండలందు, హనుమ చెప్పెడి వృత్తాంత◆మాలకింప.

అర్థములు. సరసన్ = సమీపమందు.

తాత్పర్యము.

స్పష్టము.

క. ఎటు దాఁటెనో వారిధి దా, నెటు సొచ్చెనో లంక సీత ◆ నెటు చూచెనో యు
త్కటిలుని దశకంఠుని దా, నెటుగాంచెనో యంచు వినఁగ ◆ నెసగిన వాంఛన్.

తాత్పర్యము.

సముద్రము నెట్లు దాఁటెనో, లంక నెట్లు ప్రవేశించెనో, యే విధముగ సీతా దేవిని జూచెనో, కుచ్చితుఁ డగు రావణు నెటులు చూచెనో యని యంతయు వినఁ గోరిక గలవారై.

తే. అంజలి ఘటించి భజియింప ◆ నగచరాళి, వాలిసుతుఁడును శిఖరాగ్ర◆భాగమందు
దిశలు వెలిగించు చుండెను◆ దేవవితతి, గొలువ రాజించు వాసవు◆కొమరుదోఁప.

అర్థములు. నగచరాళి = క్రోఁతుల గుంపు.

తాత్పర్యము.

వానరు లందఱుఁ జేతులు కట్టుకొని సేవింపఁగా నంగదుఁడు పర్వతశిఖరము గొన యందు దేవతలు గొలువఁ బ్రకాశించు నింద్రునివలె దిక్కులు ప్రకాశింపఁ జేయు చుండెను.

క. విలసితకీర్తియశస్సుల, నలరారెడు హనుమచేత ◆ నంగదములచే
జెలువారెడు నంగదుచే, జ్వలితం బయ్యెను మహీధ్ర ◆ వరకూటంబున్. ౧౩౧౯

అర్థములు. విలసిత కీర్తి యశస్సులన్ = ప్రకాశించు కీర్తిచేతను యశస్సు చేతను, అలరారెడు = సంతోషించు. (౧) కీర్తియశస్సులు రెండును హనుమంతునకు విశేషణము లైనపుడు కీర్తి-బుద్ధి యతిశయమువలన వచ్చినది, యశస్సు పరాక్రమము వలన వచ్చిన ప్రఖ్యాతి. (౨) కీర్తి హనుమంతునకు యశస్సు అంగదునకు నన్వయింప వచ్చును. చూ. ప. ౭౬౪.

తాత్పర్యము.

ప్రకాశించు కీర్తిచేతను యశస్సుచేతను సంతోషించు హనుమంతునిచే, భుజ కీర్తులు గల యంగదుచేఁ బర్వత శిఖరము ప్రకాశించెను.

కావున తోఁకాలు అనునది యుపశబ్దము. అశీతిసాహస్ర సంఖ్యాకంబు = ఎనుబది వేలు లెక్క గలవానిని - లాంకీ = గుదియ - పరిఘ - చైత్యప్రాసాదమున్ = 'త్య' లఘువేకాని యిచ్చట గురువుగా గ్రహింపరాదు. వైకల్పికము - పూర్వము చర్చితము. స్తంభ ఘాతంబులన్ = స్తంభము దెబ్బలచే, ఘోరాసుర వ్యూహసంయుక్తుఁడై = భయంకరులగు రాక్షసుల గుంపులతోఁ గూడిన వాఁడై - లాఁగి = లాడీ - మహామాత్యపుత్రాష్టకంబు = మంత్రులపుత్రుల నెనిమిది మందిని - కాలాలయావాసులన్ = యముని యింటఁ గాపుర ముండు వారు - చచ్చినవారు - హవ్యభుక్ + సాక్షికము = అగ్ని సాక్షిగాఁ గలది - వనాయుల్ = క్రోఁతులు-రుషాశోణితంబు = కోపముచే నెఱ్ఱనైనది-మాఁడునట్లు = కాల్చునట్లు - విభీషణ శబ్దము దండకమునఁ గురురదు - పోరు జేఁశా = రాక్షసరాజా - రాజశాస్త్రవ్యపేతంబు = రాజనీతికి విరుద్ధమైనది - వధ్యుండు = చంపఁ దగినవాఁడు-వాల్క-హారంబులన్ = నార చీరల సమూహములను - జీర్ణకార్పాస వస్త్రంబులన్ = నూలితో చేసిన ప్రాతవస్త్రములను, అభ్రమార్గంబునన్ = ఆకాశమున - ఆశ్రయాశుండు = అగ్ని - ఆశ్రయమును ఆహారముగాఁ గలవాఁడు-సంప్రహృష్టంబు=మిగుల సంతోషముతోఁ గూడినది - సౌరభ్య = మంచివాసన - గంధవహుండు=వాయువు - వీతిహోత్రుండు = అగ్ని - తత్రస్థహా = అందున్న - అరిష్టము = అరిష్టమను పర్వతము - సుగ్రీవ కార్యము = శ్రీరామచంద్రమూర్తికి సుగ్రీవుఁడు సీభార్యను వెదకి కాని వార్త చెప్పించెద నని చెప్పెను గావున యాయన కార్యము.

దండకము = ఈ దండకమున నన్నియు తగణంబులే కాని నేఁడు గణము లేదు. - కడపట గురువు. విద్వాంసులెల్లన్ హకారంబె కానీ నకారంబె కానీ సకారంబె కానీ పఠింపం దగు న్యూనముగా నిందుఁ గాదేని యాదిం దకారంబు కల్పించి యాఖరిదాఁక నెల్లం దకారంబులే యుండుగా నిచ్చలున్ వచ్చు సంధాన నిర్మించి గుర్వంతముం జేసినన్ దండకంబండ్రు-అప్ప.

తాత్పర్యము.

సుగమము.

ఓయీ యీ దండకమందు త్రిజటావాక్యముల నమ్మి రాక్షసస్త్రీలు సీతాదేవికి శరణాగతి చేసినట్లును, సీతాదేవి వారికి నభయ ప్రదానము గావించి నట్లున్నదికదా.

(౧) "స్వరక్షణే ప్యశక్తస్య కో హేతుః పరరక్షణే" తన్నుఁ దాను గాపాడు కొనలేని వాఁడు పరుల నెట్లు కాపాడఁగలఁ డను న్యాయ మనుసరించి తన చెఱ తాను దప్పించుకొనలేక యుండఁజేయూ నన్నెట్టులయిన రామచంద్రునితోఁ జెప్పి రక్షింపుమని హనుమంతుని ప్రార్థించునది యితరుల నెట్లు రక్షింపఁగలదు. ఏటివెంటఁ గొట్టుకొని పోవువాఁడు మఱియొకని రక్షింపఁగలఁడా?

చెనా రాముఁడు రక్షించెనా యను ప్రశ్నయు వట్టిదే. రాముఁడు లేని కరుణ రక్షింప జాలదు. కరుణ లేని రాముఁడు రక్షింపఁ జాలఁడు. కృపరక్షించె ననిన రామచంద్ర మూర్తి రక్షించె నన్నట్లే. రామచంద్రమూర్తి రక్షించె ననిన కరుణ రక్షించె నన్నట్లే. సీతా-లక్ష్మి-కరుణ - కృప - దయ - యివి పర్యాయపదములు. కావుననే భక్తులు లక్ష్మీవిశిష్ట నారాయణుని సీతావిశిష్టరాముని నుపాసింపవలయు నని శాస్త్రములు చెప్పుచున్నవి. ఒకరిపేరు చెప్పినను రెండవవారుకూడ నున్నట్లే భావింపవలయునుగాని రెండవవారి యందు విరసన భావము కూడదు. సీతతో నాకుఁ బనిలేదు, రాముఁడే చాలు ననరాదు. సీతయే చాలును, రామునితోఁ బనిలేదనరాదు. ఎండను విడిచి సూర్యుని, వెన్నెలను విడిచి చంద్రుని-అలల విడిచి సముద్రుని ననుభవించుటెట్లు? అట్లులే గుణమును విడిచి గుణిని గాని; గుణిని విడిచి గుణమునుగాని ననుభవించుటెట్లు? "మా మేకంచ శ్రియాయుక్తం భక్తియుక్తో నరోత్తమః స్వయమేవ మంత్రరత్నేన మత్ప్రియేణ భజేత్సదా । అచిరా న్మత్ప్రసాదేన మల్లోకంచ సగచ్ఛతి"। ఇత్యాది ప్రమాణము లనేకములు గలవు. 'యా సా భగవతశ్శక్తి రహంతా సర్వభావగా । అపృథక్చారిణీ సత్తా మహానందమయీ పరా ॥ భావాభావానుగా శక్తిస్సర్వకార్యకరీ విభోః । స్వాతంత్ర్యరూపా సా విష్ణోః ప్రస్ఫురత్తా జగన్మయీ అహంతా బ్రహ్మణ స్తస్య సాహ మస్మి సనాతని । ఆత్మా స సర్వభూతానా మహంభావో హరిః స్మృతః । అహంతయా వినాహంహి నిరుపాఖ్యో నసిధ్యతి। అహమర్థ వినాహంతా నిరాధారా న సిధ్యతి॥ అహం భగవంతుఁడగునేని అహంత లక్ష్మీదేవి యగును. ఈ ప్రకారము గుణగుణులను విశేషణవిశేష్యములను వాగర్థములను వలె లక్ష్మీనారాయణులను సీతారాముల కభేదము అవినాభావసంబంధము చెప్పినను ఎండయే సూర్యుఁడనచ్చును. సూర్యుఁడే యెండయనచ్చును. శక్తియే శక్తుఁడనచ్చును. శక్తుఁడే శక్తియనచ్చును. అర్థమే వాక్కు - వాక్కే యర్థము. అని యిట్లు స్వరూపైక్యము చెప్పరాదు. భార్యాభర్తృన్యాయముచే సీతాలక్ష్ములను స్త్రీ స్వరూపములుగనే పూజింపవలెను. రామనారాయణులను పురుషరూపములుగనే పూజింపవలెను. సీతకు దోవతి కట్టరాదు. రామునకుఁ జీర కట్టరాదు. విగ్రహములకుఁ [illegible] సీతను రామచంద్రమూర్తి మాత్రమే సేవ్యులు. ఎవరి సాంప్రదాయ మెట్లు లుండినను సీతాదేవి యనుగ్రహించిన కాక - గృధ్ర - సుగ్రీవ - విభీషణులను రామచంద్రమూర్తి యనుగ్రహించుటచే సీతాదేవి యం దుపాయత్వము గల దనియు, హనుమంతునిచేఁ జావఁబోవు రాక్షస స్త్రీలఁగాపాడుటచే నుపేయత్వము (స్వాతంత్ర్య రక్షణశక్తి) గలదనియు, రామాయణము వలన నెఱుఁగ వలసిన విషయము. రామచంద్రమూర్తి యందును నీ రెండు శక్తులు గలవు. ఇది సారాంశము.

( ౬౫-వ సర్గము. హనుమంతుఁడు సీతాదేవిని దోడ్కొని వచ్చి
శ్రీరాముని దర్శించుట యుక్తమని చెప్పుట. )

మ. అని సర్వంబు వచించి జానకి మహా • త్యర్థప్రశీలంబుచే
ఇనసంభూతుని సంభ్రమంబు రఘువం • శేశప్రయత్నంబు గాం
చిన సాఫల్యము, నాదు చిత్తము సదా • చింతించెడిన్ జానకీ
వనజాతాయతలోచనాప్రవణమై • భాషించితిన్ సత్యమున్. ౧౩౧౭

అర్థములు. మహా+అత్యర్థ+ప్ర+శీలంబుచే = మిక్కిలి గొప్పదై శ్రేష్ఠమైన పాతివ్రత్యముచే, ఉత్తశీలము కాదు. ప్రకృష్టశీలము కాదు-అత్యర్థప్రకృష్టశీలముగాదు. మహాత్యర్థప్రకృష్టశీలము - సంభ్రమము = త్వర, ఉత్సాహ మని భావము. జానకీ వనజాయతలోచనా = కమలములవలె దీర్ఘము లైన కన్నులు గల సీతాదేవియందు, ప్రవణమై=భక్తిగలదై, ఆసక్తిగలదై - మిట్టనీళ్ళు పల్లమునకుఁ బోవుచున్నట్లు పోవునదియై, వినయముతోఁ గూడినదై - ప్రవణశబ్దమున కిన్ని యర్థములు గలవు. అన్నియు నిచ్చట నన్వయించునవియై యున్నవి. సీతాదేవి విషయమున హనుమంతుని మనస్సు ఈ విధము గలదయ్యెను. అనఁగా సీతాదాసుఁ డయ్యె నని భావము.

తాత్పర్యము.

శ్రీరామచంద్రమూర్తి యనుగ్రహము చేతను, మీ తేజోవిశేషము చేతను నా వంతునకు మీరు పెట్టిన కార్యము సీతను జూచి వచ్చుట యను దానిని లంకలో నింతమాత్రము చేసివచ్చితిని. తక్కిన కార్యము మీవంతు సుగ్రీవుని సీతాన్వేషణమునందుఁగల యుత్సాహము, రామచంద్రుని ప్రయత్నము, ఈ రెండును సీతాదేవి యొక్క మహాపాతివ్రత్యమహిమాతిశయముచే ఫలించినవి. వారిరువురి కార్యములు నెఱవేఱినవి. నామనస్సు వికసించిన కమలమును విడిచి తుమ్మెద యెట్లు రాదో యట్లు సీతాదేవిని విడిచి రాక యక్కడికే పోవుచున్నది. ఇట్లు నా జన్మము సఫల మైనది. ఉన్న దంతయు యథార్థముగాఁ జెప్పితిని.

చ. అలఁతిగ నెంచఁ జాలఁడు సు • రారివిభున్ దశవక్త్రు నిం దపో
బలమున లోకముల్ నిలుప • బాఢతరాగ్రహ మొత్తి యున్నటిన్
వెలుచ దహింపఁ జాలెడి ప్ర • వృద్ధుఁడు సర్వవిధాల, జానకిన్
బలిమిని దాకియుం జెడమి • వానితపోగరిమంబునం జుమీ. ౧౩౧౮

అర్థములు. అలఁతిగన్ = అల్పముగ, బాఢతరాగ్రహ మొత్తి = మిక్కుటముగ కోపాతిశయము పూని, వెలుచన్ = త్వరగా, ప్రవృద్ధుఁడు = మిగుల గొప్పవాఁడు, తపోగరిమంబునన్ = తపస్సుయొక్క గొప్పతనముచే, 'గురు' శబ్దమునకు ఇమనిచ్ ప్రత్యయము చేర్పఁగా గరిమ యయ్యె.

తాత్పర్యము.

నేను చెప్పిన దానిని బట్టి రావణుఁడెట్టి దుర్లభ సాధ్యుఁడని తెలియవలెను. వాని తపోబలముచేత లోకముల నిలుపను, కోపించి సంహరింపను గూడ సర్వ విధాల గొప్పవాఁడు. జానకిని దాఁకి వాఁడు దగ్ధుఁడు కాక యుండుట వాని తపో బలము చేతనే సుమా.

క. జానకి కోపము పూనిన, మానక దహియించువాని ◆ మఱి దహనుండున్
బూని కరంబున నంటినఁ, దా నోపును జాలఁ డింత ◆ తథ్యము సుండీ! ౧౩౨౦

తాత్పర్యము.

ఓయీ యాంజనేయా! సీతాదేవి మహాపతివ్రత యంటివి. అట్టి పతివ్రతను బలవంతముగఁ దాఁకి రావణుఁడు తన తపోబలముచేఁ జెడక యున్నాఁ డంటివి. అట్లైన నామె తపోమహిమ కన్న, వాని తపోమహిమ గొప్ప దన్యోఁ గదా. అట్టి వానిని రాముఁ డేమి చేయఁగలఁడు ? సుగ్రీవుఁ డేమి చేయఁగలఁ డందు రేమో, అట్టి సందేహమునకుఁ బనిలేదు. రావణుని దురభిప్రాయము వంటి దురభిప్రాయము గలవాఁడై మఱి యొకఁడు బలాత్కారముగఁ దాఁకి యుండెనా యామె సంకల్పము చేతనే యగ్నిని దాఁకిన మిడుతవలె యుండును. వాని తపస్సుచే నట్లు గాలేదు. ఏలంకురా ? దాని విషయమున నప్పు డామె కోపించినది కాదు. ఆమె కోపమే తెచ్చుకొనినా యామె కోపముచేయు పనిని నగ్నిహోత్రుఁడు మన చేతితోఁ దాఁకినను జేయఁజాలఁడు. అగ్నిహోత్రుఁడు రావణాసురుని కొంపకాల్పఁ గలిగెను గాని సీతాదేవి యుండు చెట్టును గాల్పఁగలిగెనా ? సీతాదేవి రావణుని దాని ప్రత్యక్షముగఁ జెఱుపరాదని సంకల్పించి యున్నది. కావున వాఁడు జీవించి యున్నాఁడు.

చ. జరిగిన దేమొ చెప్పితిని ◆ జాంబవదాదుల సన్నుతిన్ నృపా
గ్రణము రామచంద్రుఁ గన ◆ భాగ్యము జానకిఁ దెచ్చి, రావణున్
బరిజనయుక్తు నే నొకఁడ ◆ పట్టి వధింపఁగఁ జాలుదున్ వనే
చరవరులార! మీరలును ◆ నాయము వచ్చినఁ జెప్ప నేటికిన్? ౧౩౨౧

తాత్పర్యము.

లంకలో జరిగిన వృత్తాంతము నంతయుఁ జెప్పితిని. ఇఁక జరుగవలసిన దేమో యాలోచింపుఁడు. నా యభిప్రాయమున జాంబవంతుఁడు మొదలగువా రంగీకరించిన గుండెల సీతాదేవిని దెచ్చి రాజశ్రేష్ఠుఁడగు రామచంద్రమూర్తిని మనము చూడఁ బోవుట బాగు. ఆమె యక్కడ దుఃఖించుచుండుట, ఆ వార్త చెప్పిన రామ చంద్రమూర్తి యక్కడ దుఃఖించుట, దానిని మనము చేసెలవలెఁ జూచుచుండుట సరిగాఁ దోఁపలేదు. రావణుని వాని పరివారమును నే నొకఁడనే చంపఁగలను. ఇఁక మీరందఱు తోడైనచో చెప్పవలసిన పనిలేదు. మీకుల సులభముగ

గార్య మగును. మనము రావణుని జంపి సీతను దెచ్చితిమని రామచంద్రునకపకీర్తి రాదా యుండునేమో - రాదు. సేవకులు కార్యము చేసిన ప్రభువు కీర్తి బొందును గాని, సేవకులు చేయవలసిన కార్యముకూడ ప్రభువు చేయవలయునా ? సేవకులకు సాధ్యము కానిది ప్రభువు చేయవలెను. అన్నియు బ్రభువే స్వయముగా జేసికొనునేని సేవకులలో బనియేమి ? ఈ కార్యము మనవలన నగునా యుండునేమో.

క. శూరులు గృతాస్త్రులును గను,ధీరులు గృతమతులు మఱియు♦ విజయైషులు దు
ర్వారబలయుతులు ప్లవగులు, మీరలు బాసటగ లంక ♦ మీటను దివికిన్ !

అర్థములు. కృతాస్త్రులు=అస్త్రములను దెలిసినవారు, కృతమతులు=చక్కని బుద్ధి యాలోచనము గలవారు-విజయైషులు=గెలువుకోవ గోరిక గలవారు దుర్వార బలయుతులు = వారింపరాని బలముతో గూడినవారు, ప్లవగులు = ఈ సముద్రమును దాటగలవారు, (అ) ప్లవగులారా యని సంబోధనముగనైన గ్రహింప వచ్చును. బాసటగ = తోడుపడగ.

తాత్పర్యము.

మీరందరు శూరులు, అస్త్రజ్ఞానము గలవారు, మిగుల ధీరులు, బుద్ధిమంతులు, జయము గొనగోరిక కలవారు, వారింపరాని బలముగలవారు, దాటు శక్తి గలవారు. ఇట్టి మీరు తోడై వచ్చిన లేని లంక నాకాశమున కెగరగ జిమ్మునా.

సీ. సహస్రయు సానుజ ♦ సైన్యసమేతుని, రావణు నొకడ సం♦గ్రామమునను
బొరిపున్న నేర్తును ♦ హరిహాయజిత్తున, బ్రాహ్మ మైంద్రంబును ♦ రౌద్రవారు
ణాద్యస్త్రములు నెల్ల ♦ హతవంబు జేసెద, నదియుగాని మ్మా♦టంటి లేని
నా పనికిపుకి నిరం♦తర శైలవృష్టికి, నమరులు సిగ్గుడు ♦ రసుర లెంతి

ఆ. వనధి నేల దాటి♦వచ్చిన వచ్చును, మఱియు వణకె వణకు ♦ మందరంబు
గాని జాంబవంతు ♦ గదలింపనేరదు, సంగరంబునందు ♦ శత్రుసమితి. ౧౩౨౩

తాత్పర్యము.

రావణుని కొడుకులతో దమ్ములతో సేనలతో నే నొకడనే యుద్ధమందు జంపగలను. ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రము - ఐంద్రాస్త్రము-రౌద్రాస్త్రము- వారుణాస్త్రము లోనగు వానినెల్ల నాశము చేసెదను. ఇట్లు చేయుటకు మీ సమ్మతి గావలెను. మీ యంగీకారము లేకుని గదా యూరక వచ్చితిని. నేను రాలవాన గురియించితి నేని దేవతలు చత్తురు. రాక్షసు లేమి లెక్క ? సముద్రము చెలియలి కట్ట దాటి వచ్చిన రావచ్చును. మందరము వణకిన వణకును గాని జాంబవంతుని శత్రుసమూహము యుద్ధమున గదలింప నేరదు.

సీ. అసురసంఘములు జే♦ర్చైనవారిని జంపు,జాలు నొక్కరుండ యా♦వాలిసుతుండు
ఘనసనిలుర జవ♦పటిమను నగ్గను, మందర మాశర♦బ్బంద మెంత

మైందద్వివిదులతో • మారొకకఁగలవారి, యట గంధర్వోరగ•గాలి నైన
బ్రేల్వించి యొక్కని • వెదకి చెప్పుము మారి, నుమెషేంగవ యుంతి•లోనలేఁడు
ఆ బ్రహ్మవరమునఁ గన్న•పరమబలాఢ్యు, లమృతము ద్రావినార • లాశ్వినేయ
గౌరవార్థముగను • గమలసంభవుఁ డమరత్వ మిచ్చె వీరి•కసఘులార! ౧౩౨౪

తాత్పర్యము.

ఆ రాక్షసుల సంఘములోఁ బ్రసిద్ధమైన వారి నెల్ల మీ యుంగరమునఁ జూపకఁడే చంపఁగలను. పనసుని, నీలుని, వేగాతిశయమునకు మందరమైనను జాగ్రత్తగాను. రాక్షసు లనుట చెప్పనేల! మైంద ద్వివిదులతో నెదిరించి పోరగల వానిని యక్షులందు గంధర్వులందు పన్నగులందుఁ గలరేమో వెదకి చెప్పుము. నాకుఁ దెలిసి నంతలో లేఁడు. వీరు బ్రహ్మవరముచే బలవంతులు. అమృతమును ద్రావినారు. అశ్వినీ దేవతల గౌరవార్థము వీరికి చావు లేకుండ బ్రహ్మ వర మిచ్చెను.

క. వరగర్వంబున వీరలు, సురవరసంఘముల గెల్చి • సురఁ గ్రోలిరి యా
శరనిధివముఁ జేరికి నొంపుదురె యెంత ఆటువంటి వీరు • దోర్దర్పఘనుల్. ౧౩౨౫

తాత్పర్యము.

ఎక్కువ బలవంతులమాట యటుండనిమ్ము. వీరు వరగర్వముచే దేవతా సమూహముల గెల్చి యమృతమును ద్రావిరి. ఇట్టి వీరు రాక్షసులను లక్ష్యపెట్టుదురా.

క. లంకాపురమెల్ల, నిరాతంకంబుగఁ గాల్చి బూడి•దం జేసితి ని
శ్శంకంబుగ నామంబుల, బింకంబుగ నెల్ల మొగిఁ • జెప్పంటిఁ జుమీ. ౧౩౨౬

అర్థములు. నిరాతంకంబుగన్ = నిర్భయముగ.

తాత్పర్యము.

నిర్భయముగ లంకాపట్టణ మంతయుఁ బూడిద యగునట్లుగఁ గాల్చితిని. సందేహము లేకుండ పేర్లను అన్ని తావులఁ జెప్పితిని. ఏమి చెప్పితి నందురా.

చ. జయము జయంబు రామునకు • సారపరాక్రమధన్యమూర్తికిన్
జయము జయంబు విక్రమద•సమ్యగరస్వి సుమిత్రపట్టికిన్
జయము జయంబు దాశరథి • సంపరిపాలిత కోశధర్త్రకా
ద్యయమతి సూర్యసూతికి మ•హాద్భుత విక్రమ కీర్తిశాలికిన్. ౧౩౨౭

తాత్పర్యము; చూడు, ౧౦౩౬౮—౧౦౩౬౯.

క. కోసలరాజేంద్రునకున్, దాసుండ హనుమదభిఖ్యుఁ • దనరినవాఁడన్
నే సుముఁడ మారుతుని కని, వాసిగ నెల్లరును వినఁగఁ • బలికినవాఁడన్. ౧౩౨౮

తాత్పర్యము.

నేను శ్రీరామచంద్రమూర్తికి దాసుండను. నా పేరు హనుమంతుఁడు. నేను వాయుపుత్రుఁడను అని యందఱు వినునట్లు చెప్పి వచ్చినాఁడను గాని రహస్య వ్యాపార మేమియు లేదు.

నాసను రక్కసుల్ బెదరు • లాడఁగ క్రేలెను నోంటిజేఁతతో
గాసిని గుండెడిం, దలపఁ • గాఁ గనువెల్లను మండిపోయెడిన్. ౧౩౩౨

అర్థములు. క్రుంగన్ = మునుఁగఁగ, దుఃఖభారవశతన్ = అధిక దుఃఖము నకు లోఁబడి, రక్కసుల్ = రాక్షసస్త్రీలు.

తాత్పర్యము.

మాసిన యొంటి కట్టుచీరతో నుత్తరీయమైన లేక, దుమ్ములో మునిఁగి దుఃఖాతిశయమునచేఁ దపించుచు సీతాదేవి భర్తను జూడఁగల నను నాశచే రాక్షస స్త్రీలు బెదరింపు మాటలను చెప్పినను క్రేలాడు నోంటి జడతో మిగుల శ్రమపడి దుఃఖించు చున్నది. అది తలఁపునకు వచ్చిన కడుపు మండు చున్నది.

ఉ. చూడఁగ గుండె ఝల్లు మను • దోసనెలంతలు భీతిగొల్పఁ ద
న్నాడఁగ, వల్లభా! యనుచు • నాతనిసేమముఁ గోరి దీన యై
వాడి దురంతశోకమున • బ్రాల ధరాస్థలి దుష్టరాక్షసా
క్రీడమునందుఁ గంటిఁ గలి • కిం జలికాలపు దమ్మిఁ బోలఁగన్. ౧౩౩౩

అర్థములు. దోసనెలంతలు = రాక్షసస్త్రీలు- ఆక్రీడము = ఉద్యాన వనము- చలికాలమున్ = మంచుకాలమందు- దమ్మిఁబోలఁగన్ = తామర తూఁడువలె.

తాత్పర్యము.

• చూచిన మాత్రమున చేతనే గుండెలు ఝల్లుమనిపించు వికారరూపములు గల రాక్షసస్త్రీలు తన్ను భయపెట్టు మాటలాడఁగా నాథా యనుచు నాతని సేమము గోరి దుఃఖించుచు వెలవెలఁ బాఱిన ముఖముతో తేజస్సు మాసి నేలఁబడియుండఁగా రాక్షసుని యుద్యానవనమందు సీతాదేవిని మంచుకాలమునాఁటి తామరతూఁడువలె నుండు దానిని జూచితిని.

ఉ. వచ్చెడిజాడ లేదు నృప • వల్లభుఁ డీయెడ, క్రూ సురారినిన్
నచ్చఁగ రాదు, వానివల • నం జెడ నొల్లను, గాన నిప్పుడే
చచ్చుట మే లటంచును దృ • ఢంబుగ నిశ్చితచిత్త యైన యా
పచ్చరితాగ్రగణ్య కొక • చందమున న్మది నమ్మఁ బల్కితిన్. ౧౩౩౪

తాత్పర్యము.

రామచంద్రమూర్తి యిచ్చటికి వచ్చుమార్గము కనఁబడలేదు. రావణాసురుని నమ్మ రాదు. ఎప్పుడు చంపునో యేమో. వానివలనఁ జచ్చుట నా కిష్టము గాదు. కావున నీ పాపాత్మునిచేతఁ జచ్చుటకంటె నా యంతట నేనే యిప్పుడే చచ్చుట మేలని దృఢ నిశ్చయముగల యాపతివ్రతా శిరోమణికి నే నేదో యొకవిధముగా నమ్మఁబలికితిని.

క. నుచ్చుటలను సత్యార్థము, లచ్చపలాక్షికిని జెప్ప • వనచరపతితో
వచ్చుపుడు జెప్పి హృదికిమన, వచ్చుపడుట కిజనేత్ర • హర్షం బందెన్. ౧౩౩౫

తాత్పర్యము.

సీతాదేవి యనెను. సంభాషించునప్పుడు అన్నివిషయము లామెకుఁ జెప్పఁగా వానరరాజుతో శ్రీరామచంద్రమూర్తికి మైత్రి కుదిరిన దానికి సీతాదేవి మిగుల సంతోషించెను.

ఉ. ఆమె మహానుభావతను • నామె యతుల్య పతివ్రతంబునం
దామసుఁడైన యా యసుర•నాయకుఁ డింతగఁ జాక తప్పుటన్
భూమి మహాత్ముఁడే యనఁగ•బోలును, వానిని రూపు మాపఁగా
రాముఁడు సంగరస్థలిని • గ్రాలఁ గలండు నిమిత్తమాత్రమై. ౧౩౩౬

అర్థములు. మహానుభావతను = మాహాత్మ్యముచేత, అతుల్య పతివ్రతంబునన్ = అసమాన మైన పాతివ్రత్యము చేతను-తామసుఁడు = విశేషముగఁ దమోగుణము కలవాఁడు, చాక = చావక, తప్పుటన్ = మిగిలి యుండుటచే. నిమిత్తమాత్రము-కుమ్మరవాఁడు కుండలఁ జేయుట యందు మన్ను ఉపాదానము, కుమ్మరి నిమిత్తము - అట్లుతే రావణవధయందు రామచంద్రమూర్తి నిమిత్త మగుచున్నాఁడు. ఆయనచే నా పని చేయించు కారణము సీతాదేవి యడుగుచున్నది. ఆమె స్వయముగా రావణుని జంపినచో వీరపత్ని యను పేరు రాదు. అగస్త్యభ్రాత యన్నట్లు లాయనకు సీతాపతి యని పేరు వచ్చును. అది యాయనకు నవమానకరము. కావున భర్త చేతనే రావణుని జంపించి యా కీర్తి యాయనకు వచ్చునట్లు చేసి యటువంటి వాని భార్య యనిపించుకొన వలె నని యా యమ వ్రతము. కావున నామె యేమీ చంపలేదు, గాని శక్తిలేక కాదు. దీనివలన స్త్రీలు శక్తిమతు లైనను బురుషులు చేయఁదగు కార్యములు తాము చేయఁగలిగి యున్నను మగలకుఁ దోడుపడి వారిచేఁ గార్యము చేయింప వలయును. గయ్యాళిగంగమ్మలై మగవారి కపకీర్తివచ్చు విధముగ వారి సమ్మతిలేక వ్యవహరింప రాదని చెప్పుచున్నది.

తాత్పర్యము.

ఆమె మాహాత్మ్యము చేతను అసమానపాతివ్రత్యము చేతను తామసుఁడైన రావణుఁడు చచ్చి నున్మరణము పాలుగాకుండుటచే మహానుభావుఁడే యనఁదగు. వానిని చంపుటయందు యుద్ధమున రామచంద్రమూర్తి నిమిత్తమై యున్న కార్యము లాయనచే చేయఁగలఁడు. ఆ కారణమున నామె వానిని శపింపక యూరకున్నది.

తే. సహజముగ సీత తన్వంగి • సాధులార !
యందుఁ దా భర్తృశోకతా • పార్దిత యయి
పాద్యమిని బరియించెడి•వాని చదువు
పసిగిఁ గృశియించి యున్నది • ప్రథమ కోలంగి. ౧౩౩౭

అర్థములు. తన్వంగి = తను+అంగి=సన్నని దేహముగలది, భర్తృశోక తాప+అర్దిత యయి=మగని విడిచిన శోకమువలనఁ గలిగిన తాపముచే బాధపడి.

తాత్పర్యము.

సాధులారా! సీతాదేవి సహజముగ సన్నని దేహము గలది. అందిప్పుడు మగని విడిచి యుండుట వలనఁ గలిగిన శోకబాధచేఁ బాడ్యమినాఁడు చదువువాని చదువువలె క్షీణించి యున్నది.

తే. సీత యీ రీతి లంకలోఁ • జిక్కిన వసి
గోడు గుడుచుచు నున్నది • పాడి యరసి
దానికిని మాఱు సేయంగఁ • దలఁప రయ్య
యనినఁ దారాతనూభవుఁ • డనియె నిట్లు. ౧౬౮

అర్థములు. పాడి = ధర్మము.

తాత్పర్యము.

సీతాదేవి యీ విధముగ లంకలో బాధపడుచు శుష్కించి యున్నది. దీనికి ప్రతిక్రియ యేమి చేయుట న్యాయ్యమో యాలోచింప వలసినది. అనఁగా నంగదుఁ డిట్లనియె.

—• { ౩౦-వ సర్గము. అంగదుఁడు సీతాదేవిని దోడ్కొని వచ్చుటకు సమ్మతించుట. } •—

ఉ. దంటలు మీరు శౌర్యమున • దానవదేవభుజంగ పాళులన్
జంటలు లేరు మీకుఁ బ్లవ•నంబున, నిట్టి కరత్త కేల వా
ల్గంటులమిన్న తేక చనఁ • గార్యమె! రాముని చేరి జానకిన్
గంటిమి, తోడితేర; మనఁ•గాఁ దగునా మిముబోంటివారికిన్! ౧౬౯

అర్థములు. దంటలు = సమర్థులు-జంటలు=సమానులు; ప్లవనంబునన్ = దాటుటయందు - కరత్తకేల = ఉత్తచేతులతో - వాల్గంటులమిన్న = స్త్రీరత్నము - తోడితేరము = పిలుచుకొని వచ్చినవారము గాము.

తాత్పర్యము.

శౌర్యము నందు మీరు సమర్థులు- దానవులందు దేవతలందుఁ బన్నగులందు దాటుటయందు మీకు సమానులు లేరు. ఇట్టి వారు ఉత్త చేతులతో సీతఁ దేక పోవుట తగునా యాలోచింపుఁడు. పోయి సీతను జూచితిమి, పిలుచుకొని రాలేదని మీ యంతటి వారనవచ్చునా!

ఉ. వీరుఁడు గాఢ్పుపట్టి హత•వీరముఁ జేసి సురారివారమున్
గారియ మవ్వ సేమి గలు•గం గల దుర్విజ యత్త మన్న నా
వీరుని జాంబవంతుఁడు సు•విశ్రుతశౌర్య! భవత్సమూహయున్
దీరగు, నైన రాఘవు మ•తిం జనఁగాఁ దలపోయుమీ యనన్. ౧౭౦

అర్థములు. హతవీరము = చచ్చినవీరులు గలది - కారియము = పని - భవత్సమూహయున్ = నీ యాలోచన కూడ - తీరగున్ = చక్కఁగానే యున్నది.

తా త్ప ర్య ము.

సీతను హనుమంతుఁడు లంకలోని సీతను జూచివచ్చెను. ఇఁక మన మచ్చటికిఁ బోయి చేయఁదగిన కార్యము సీతను దెచ్చుట తప్ప మఱి యేదియు లేదు. కావున మనము పోయి సీతను దెత్త మనఁగా జాంబవంతుఁడు ప్రసిద్ధకార్యము గల యంగదా! నీ యాలోచన బాగుగనే యున్నది. కాని రామచంద్రమూర్తి యభిప్రాయము తెలిసికొని యాయన చెప్పిన చొప్పున చేయవచ్చును. ఆ విధముగ నాలోచింపుమని చెప్పఁగా.

—♦ ౬౧-వ సర్గము. కపులు కిష్కింధకుఁ బోవుమార్గమున మధువనంబుఁ జూచుట. ♦—

క. సరి సరి యని యంగదకే,సరిసూనులు నున్న వారు ♦ శాఖామృగముల్
పరమమతి వాయుజపురస్సరము మహేంద్రాద్రిఁ బాసి ♦ దయ్యనఁ జనగన్.

అర్థములు. ఉన్నవారు = తక్కినవారు, వాయుజపురస్సరము = హనుమంతుని ముందుగాఁ గలది.

తా త్ప ర్య ము.

అంగదుఁడు హనుమంతుఁడు తక్కిన వానరులు ఈ యాలోచన బాగున్నది, బాగున్నదని యొప్పి యంగీకరించిరి. అంతట వారలు హనుమంతుని ముందుంచుకొని మహేంద్ర పర్వతము విడిచి పోఁగా.

సీ. మేరుమందరసముల్ ♦ భూరిగజాభులు, మూర్త్యంబరపథ మెల్ల ♦ మూటుపఱచు
నట్టులు వ్యాపించి ♦ యాంజనేయునిఁ దమ, దృష్టులచే వహి♦యించుచున్నట్లు
కను ఱెప్ప వాల్చక ♦ కాంచుచు నాతనిఁ, గొనియాడుచును స్వామి♦పనిని దీర్చి
నార మ్మమోదమున ♦ వారక ప్రియభాషణంబును జేయు చ♦నన్యచిత్త
ఆ. వృత్తి యుద్ధమునకు ♦ వేడుక సేయుచు, రామసాహాయ్యమునకు ♦ రాగపడుచు
మింటనేఁగి కనిరి ♦ కంటికిఁ బండువౌ,మధువనంబు మిగుల ♦ మంజులంబు. ౧౩౨౭

అర్థములు. భూరిగజాభులు = పెద్ద యేనుఁగులతో సమానులు - అనన్యచిత్తవృత్తి=ఇతరాలోచన లేక - మంజులంబు = అందమైనది.

తా త్ప ర్య ము.

మేరు పర్వతముతోను మందరపర్వతముతోను,సమానమైన పొడవుగలవారును, పెద్ద యేనుఁగులవలె బలసినవారును నగు వానరులు ఆకాశమును మూఁటుఁగు పఱచు నట్టులు వ్యాపించి యాంజనేయుని తమ దృష్టులచే మోచికొని పోవుచున్నారా యను నట్లు ఱెప్పలార్పక తమ చూపు లాయనమీఁదనే యుంచి యాయనను బొగడుచు స్వామికార్యమును నెఱవేర్చితి మను నధిక సంతోషమున ప్రియములైన మాటలాడుచు యుద్ధము చేయుటయందే తమ మనస్సులు నిలిపి దానికై యుత్సాహపడుచు రామచంద్రమూర్తికి నెప్పుడు సాహాయ్యము చేయుదుమా

చేయుదుమా యని దాని యందాసక్తి గలవారై యాకాశమునఁ బోవుచు మార్గమునఁ గంటి కింపై యందమైన మధువనముఁ జూచిరి. మహేంద్రపర్వతమునకు లంకకుఁ గల దూరమునకంటె మహేంద్రపర్వతమునకుఁ గిష్కింధకు నెక్కువ దూరము గలదు. అట్లు ఉండియు వందలు వానరు లాకాశమున నెగిరి వచ్చినవారే. సముద్రము దాటు విషయమున వందలు వెనుకంజ వేసినారే. ఈ విషయము కిష్కింధా కాండమునఁ జర్చితము.

ఉ. నందనసన్నిభం బలఘు యు•నంత ముదావహమై ద్రుమావళీ
సుందరవల్లరీనికర•శోభితమై సకలాప్రధృష్యమై
యుందము మీఱఁగా దధిము•ఖాఖ్యుఁడు సూర్యజు మేనమామ దా
నందు వసించి కాచు నెపు•డర్కజముత్కర మద్ది గావునన్. ౧౩౪౩

అర్థములు. నందన సన్నిభము = ఇంద్రుని నందనోద్యానముతో సమానము- అనంత ముదావహము = అపరిమిత సంతోషమును గలిగించునది. ద్రుమావళీ = చెట్లవరుసల చేతను- సుందర వల్లరీనికర = అందమైన తీగల సమూహము చేతను- శోభితమై = ప్రకాశించునదియై - సకలాప్రధృష్యమై = ఎట్టివారికిఁ జెఱుప నసాధ్యమై- అర్కజముత్కరము = సుగ్రీవునకు సంతోషకరము.

తా త్ప ర్య ము.

ఇంద్రుని నందనవనముతో సమానమై - యపరిమిత సంతోషము గలిగించు నదియై, చెట్లవరుసలచేతను, అందమైన తీగల గుంపులచేతను బ్రకాశించునదియై యెట్టివారికిని జెఱుపరాని దైన యా మధువనమును సుగ్రీవుని మేనమామ దధిముఖుఁ డనువాఁడు అందే కాఁపుర ముండి సుగ్రీవున కది సంతోషకరము గావునఁ గావలి కాచుచుండును.

క. దానిం గని క్రోఁతులు మధు, వానం దమకించి కొమరు•నంగదు వేఁడన్
లోనం జన నిమ్మన యతఁ, డానతి గపివృద్ధవిభుల•నామోదింపన్. ౧౩౪౪

అర్థములు. మధువు = తేనె - ఆనన్ = త్రాగుటకు - తమకించి= త్వరపడి - కొమరున్ = కుమారుని - కపివృద్ధవిభులు = వానరులందుఁ బెద్దవారు జాంబవంతుఁడు; ఆమోదింపన్ = అంగీకరింపఁగా.

తా త్ప ర్య ము.

ఆ వనమును జూచి క్రోఁతులు తేనెఁ ద్రావఁ దొందర గలవారై యువరాజగు నంగదుని మమ్ములోపలికిఁ బో నిమ్మని ప్రార్థింపఁగా దానిని పెద్దవానరులు, జాంబవంతుఁడు నంగీకరింపఁగా నాయన సరి పొమ్మని చెప్పెను.

—• కపులు మధువనంబుఁ జొచ్చుట. •—

క. యువరా జనుమతి సేయఁగ, వనచరసంఘాతము లెల్ల•హర్షరసాతి
శయవశులై నృత్యంబుల, వివిధంబులుగాఁగ సలిపి•వనముఁ జొచ్చె వడిన్. ౧౩౪౫

అర్థములు. అవనీరుహచారులు = వానరులు - హర్షరసావేశవివశులై = సంతోషరసము ఆవేశించుటచే దేహములు తెలియనివారై.

తాత్పర్యము.

లోపలికిఁబొం డని యువరా జంగీకరింపఁగా వానరు లందఱు సంతోషముచే దేహములు తెలియక నానావిధముల నృత్యములు చేసి లోపలఁ బ్రవేశించిరి.

మానిని. ఆడెడువారును వేఁడెడువారును • హాయిగఁ బాడెడివారును నై
పీడెడివారును గూడెడువారును • వేడుక లాఁగులు వేసెడు వా
రోడెడువారును గూలెడివారును • నూఁగెడివారును విూసములన్
దీడెడువారును దాఁటెడువారును • దేఁకెడివారును నైరి కపుల్. ౧౩౪౬

తాత్పర్యము.

స్పష్టము.

సీ. కొనకొమ్మనొక్కఁటి • క్రోఁతియొక్కండూఁచి, పెఱకొమ్మవిూఁదఁగు • ప్పించి మొగపె
శాఖ యొక్కటినుండి • సరగున నిల దూఁకి, గొబ్బున వేఱొక్క • కొమ్మ కెగిరెఁ
బైకొమ్మపై నుండి • పడుచుఁ గ్రిఁగొమ్మను, నొకకేలఁ గ్రహియించి • యూఁగు నొకఁడు
కొమ్మలలోఁ డాఁగి • క్రోఁతియొక్కఁడు సేదఁ, దటుకునఁ బైపడి • తఱుము నొకఁడు
ఆ. ఒకఁడు దెక్కరించు • నొక్కరుఁ డిగిలించు
నొకఁడు కొక్కరించు • నొకఁడు కూయు
నొకఁడు కిచకిచ మను • నొక్కఁడు గికురించు
నొకఁడు లాఁగు వేయు • నొకఁడు లాగు. ౧౩౪౭

అర్థములు. కికురించు = మోసగించు - ఇగిలించు = పండ్లు వెళ్ళఁబెట్టు.

తాత్పర్యము.

స్పష్టము.

ఉ. పాడుచు నుండ నొక్కరుఁడు • పైపడి నవ్వ నొకండు నవ్వుచో
నేడుచు చేసె వే ఱొకఁడు • నేడుప నొక్కఁడు వెక్కిరించుచున్
జూడఁగఁబోవు నాతనిని • సొంపు బలే యని కొక్కిరించుచున్
గూడఁగఁ బోవు నాతనిని • క్రోఁతి మ ఱొక్కఁడు నవ్వుటాలకై. ౧౩౪౮

అర్థములు. నవ్వుటాలకై = నవ్వులాటకై.

తాత్పర్యము.

స్పష్టము-

క. ఈ విధి నిచ్చఁ జరించుచుఁ, ద్రావఁగఁ దేనియలు తృప్తి • దనరనివాఁడున్
వావిరి మత్తెక్కనివాఁ, డా వనచరసైన్యసమితి • యం దరిది గనన్. ౧౩౪౯

అర్థములు. సమితిన్ = సమూహమందు.

తా త్ప ర్య ము.

ఈ ప్రకారము యథేచ్ఛముగాఁ దినుచునుఁ దేనెలు త్రాగి తృప్తిపడినవాఁడు, బాగుగ మత్తెక్కినవాఁడు ఆ వానర సేనలలో నొక్కఁడైన లేఁడు.

క. ఈ రీతి భాతి దీఁటఁగ, వారామమునుఁ గలఁచి సుల్చి • యచ్చటిపంటల్
గోరంబుగఁ గూల్చి ద్రుమసం,హారంబులఁ జెల్లు రేఁగి • వానరు లున్నన్. ౧౩౫౦

అర్థములు. భాతి = కాంతి. సుల్చి = పడఁగొట్టి. ద్రుమసంహారంబులన్ = చెట్ల సమూహములను, గోరంబుగన్ = కనులకు వెగటు పుట్టునట్లు-ఘోరశబ్దభవము.

తా త్ప ర్య ము.

ఈ విధముగఁ గాంతి చెడునట్లు వనమును గలియఁబెట్టి, పండ్లు రాలఁగొట్టి చెట్ల సమూహములను చూచుటకు ఘోరముగ నుండునట్లు పడఁద్రోచి వానరులు చెల రేఁగి యుండఁగా.

— • దధిముఖుఁడు కపుల వారించుట. • —

క. ఇంతకు దధిముఖవానరుఁ, డెంతయుఁ గోపించి వనము • నెటులేఁ గావన్
జింతించి వానరావళి, యంతికమున కేగి వారి • నాఁపఁ గడంగెన్. ౧౩౫౧

అర్థములు. ఇంతకు = ఇంతపని చేసిన దానికి- ఎటులేన్ = ఏ విధముగనైనను- ఇట్లు చెప్పుటచే ముందు మంచిమాటల చేతను దరువాత బెదరింపుమాటల చేతను జెప్పిచూచెను గాని యది ప్రయోజనపడమిని దండోపాయము నాలోచించె నని భావము. అంతికమునకున్ = సమీపమునకు - ఆఁపన్ = అడ్డగింప - కడంగెన్ = ప్రయత్నించెను.

తా త్ప ర్య ము.

వానరు లింత పనిచేసిన దానికై దధిముఖుఁడు నయభయములఁజెప్పి వ్యర్థము కాఁగాఁ గోపించి బలాత్కారముగ నైన వనమును రక్షింపఁ దలఁచి వారియొద్దకుఁ బోయి నివారింప యత్నించెను.

ఇంతవఱకు దూరముగా నుండి మాటలు చెప్పి పంపె నని భావము.

క. తిట్టెను గొందఱ వెలికి, న్నెట్టెను గొందఱకుఁ బలికె • నీతులు కేలన్
గొట్టెను గొందఱఁ గొందఱ, మొట్టెను బిడికిటఁ గినిసి • మునుకొని కపులన్.

అర్థములు. నెట్టెను = మెడపట్టి త్రోచెను.

తా త్ప ర్య ము.

కొందఱఁ దిట్టెను. కొందఱ మెడపట్టుకొని తోఁటకు వెలుపలఁ ద్రోచెను. పెద్దవారికి నీతులు తెలిపెను. కొందఱను చేతితోఁ గొట్టెను కొందఱఁ బిడికిలితో కోపించి మొట్టెను.

క. కొఱికిరి కొందఱు కోఱల, బఱికిరి గోళ్లలను గాళ్ళ • బడ నడిచి ధరన్
బఱబఱ యీడ్చిరి కరముల, నఱిముఱి మర్దించి విడిచి•రా వనపాలున్. ౧౩౫౩

అర్థములు. అతిముతేన్ = త్వరతో.

తాత్పర్యము.

స్పష్టము.

క. కొందఱు ద్రోచిరి నానిని, కొందఱు దూషించి రధిక • కోపంబున ని
ట్లందఱు బాధించుచు నా,నిం దరుచరు లా వనంబు • నిర్మూలింపన్. ౧౩౪౪

తాత్పర్యము.

స్పష్టము.

— • { ౬౨-వ సర్గము. అంగద హనుమంతుల ప్రాపునఁ గపులు మధు వనంబున నిచ్చకొలఁది సంచరించుట } • —

క. అంతట హనుమంతుఁడు కపి,కాంతులతో మీరు తృప్తి • గన నవ్యగ్ర
స్వాంతంబుల మధు వానుఁడు, చెంతలఁ జేరంగ నీను • సిద్ధము పగతున్. ౧౩౪౫

అర్థములు. కపికాంతులతో = ముఖ్యవానరులతో - అవ్యగ్ర స్వాంతంబులన్ = చలింపని మనస్సులతో - పగతున్ = పగవానిని - తమకార్యమునకు నడ్డము వచ్చుటచే పగవాఁ డని చెప్పఁబడెను.

తాత్పర్యము.

దధిముఖుఁ డిట్లు వానరుల కడ్డము వచ్చుటయు వారికి వీరికిఁ గలహమందుఁ గాలము పోవుటయుఁ జూచి హనుమంతుఁడు వానరముఖ్యులతో మీ రీ కలహమునకు కాలము గడుపవలసిన పని కాదు. ఈ పగవానిని మీ యొద్దకు రానీను. మీ రేకాగ్రచిత్తముల తేనె త్రాగుఁడు.

సీ. హనుమంతుఁ డాడిన • యా మాట లాలించి, యంగదుం డిట్లను • హరివరేణ్యు
లార! యవశ్యకా • ర్యం బకార్యంబైనఁ, గృతకృత్యుఁ డగు వాయు • సుతుని పలుకు
ఇప్పుడుఁగూర్చి నేఁ • జెప్పంగవలయునే, తేని గ్రోలుం డాన • తీర ననిన
బళీ బళీ యని మెచ్చి • బలిముఖుల్ సెల్లున,పోలేఁ జొచ్చిరి వన • పాలకులను
తే. మొదలఁ దాఁచిరి త్రోచిరి • మొగము పగుల
ద్రోణమాత్రము మధువు సం • తోషముగను
నెల్లవారలుఁ ద్రావిరి • కొల్లగాఁగఁ
గొన్నిటిని నేలఁ బగులంగఁ • గొట్టి రపుడు. ౧౩౪౬

అర్థములు. అకార్యంబైనన్ = చేయరాని పనియైనను - అవశ్యకార్యము = తప్పక చేయవలసినపని, తాఁచిరి = కొట్టిరి - ద్రోణమాత్రము = తూము కొలఁది - ద్రోణశబ్దము దేశవ్యవహారానుసారముగ తూమునకు - ఇద్దుమునకు-నలుతుమునకుఁ బేరు. 'అస్త్రియా మానకే ద్రోణా' యని యమరము.

తాత్పర్యము.

హనుమంతుఁ డీ ప్రకారము చెప్పఁగా నాయన మాటలు విని యంగదుఁడు

ప్రమమృదుః - ప్రసేహుః - దూషించి యనుటకు వానరాళి కర్త. మహాత్మమహాపోర్థక శబ్దం బుమహాశాస్త్ర్య యుక్తం బయ్యెఁ దద్విశేషణ ప్రియులు మహాశాస్త్ర్య సౌభాగ్యంబులు విభాష నగు. (ప్రౌ. వ్యా. శబ్ద. ౧౭ వ. సూ) "పస నమునకు నిన్నుఁ గన్నుఁ బ్రమథ గణంబుల్" - నిర్వచన ర ఆ.

శా. దండీ వానరులన్ బలాంధులను దర్పోర్త్యం బార మర్దించి ము
చ్చండత్వంబున నంత నాతఁ డొక భూజ ప్రశ్లేషముం గొంచు రాఁ
గొండల్ గుండులు తాలుఁ జెట్లుఁ గొని సక్రోధాంతరంగంబునన్
దండన్ డాసిరి తత్ప్రక్రోధులు వెసన్ దండింపఁ గీశేశులన్. ౧౩౬౧

అర్థములు. బలాంధులను = బలముచేఁ గన్నులు గానని వారిని, ఉచ్చండత్వంబునన్ = మిగులఁ గోపముచే - సక్రోధ + అంతరంగంబులన్ = కోపముతోఁ గూడిన మనస్సులతో, దండన్ = ప్రక్కకు - డాసిరి = సమీపించిరి.

తాత్పర్యము.

బలముచేఁ గన్నులు గానని క్రోధులను దధిముఖుఁడు కోపముతోఁ జక్కఁగఁ గొట్టుచుండఁ, బోద నున్న దధిముఖుఁడు చెట్టు నొకటి పీకికొనిరాఁగా, తక్కిన క్రోధులుఁ గోపముతోఁ గూడిన మనస్సులు గలవారై కొండలు, గుండులు, తాలు, చెట్లు తీసికొని వానరుల దండింప వచ్చిరి.

—* అంగదుండు దధిముఖునిఁ దన్నుట. *—

సీ. వానరవరు లిట్లు వచ్చి నేలను జెట్లఁ, బ్రమ్మను క్రోధుల గుంపుమీఁదఁ
గవిసిన వారిని గడఁకఁ గనుంగొని, పావని మొదలగు ప్రముఖు లెల్ల
నచటికిఁ బఱతెంచి రంగదుఁ డంతటఁ, దరుహస్తుఁ డైన యా దధిముఖుండు
మనకుఁ బూజ్యుం డని మత్తత నెఱుఁగక, కోపించి కేలిచేఁ గూలఁ ద్రోచి
ఆ. వలియు ప్రసద్ది విడువ వెలవెలఁ బోవుచు, దొఱఁగొనుచు నెత్తుటను దొరంగ
నంగసంధి శ్లథముల నరనావు వచ్చియు, లేచి యాఁచెఁ బెఱ వలీముఖములు.

అర్థములు. కడఁక = ప్రయత్నము - తరుహస్తుఁడు = చేతఁ జెట్టుగల వాఁడు - పూజ్యుం డని = తాత గాన్పుశ గౌరవింపఁదగిన వాఁడని - మత్తతన్ = మదముచేత - అంగసంధి = అవయవముల సంధి బంధము - శ్లథములన్ = శిథిలము కాఁగా -విరుగ్వచెడి పదులు పడఁగా - అరనావు వచ్చియు = మూర్ఛపోయి - పెఱ వలీముఖములన్ = ఇతర వానరులను.

తాత్పర్యము.

వనపాలకు లగు వానరు లిట్లు వచ్చి భూమిమీఁదఁ జెట్లమీఁదఁ దిరుగుచున్న క్రోధి గుంపులమీఁదఁ బడఁగా వారు బలవంతముగఁ గొట్టి వానరులఁ దఱుమఁ జూచుచున్నారని తెలిసి హనుమంతుఁడు మొదలగు వానర ప్రముఖు లచ్చటికి వచ్చిరి. అం దంగదుఁడు చేతఁ జెట్టు పట్టుకొనియున్న దధిముఖుఁడు తనకుఁ దాతయని,

గౌరవింపఁబడఁ దగిన వాఁడని, తెలిసి ప్రాణివనమత్తుచే నెఱుఁగక కోపించి నేలతోఁబడఁ
గొట్టి నలియ గ్రుద్ది వదలిపెట్టఁగా వాఁడు నేలనెలఁబోయి కోఁజుచు నెత్తురు కాఱు
చుండ నవయవసంధులు నలుగుబాఱ మూర్ఛపోయి లేచి యితరవానరుల నడ్డ
గించెను. అరసావు - సగము చచ్చుట-మూర్ఛ

"ముగ్ధేఽర్ధసంపత్తిః పరిశేషాత్" బ్రహ్మసూ. ౩-౨-౧౦ అను బ్రహ్మసూత్రమున
మూర్ఛను సగము చావుగా వ్యాసమహర్షి చెప్పెను. ఇది స్వప్న - జాగర- సుషుప్తి
మరణావస్థలకంటె వేఱైనది. సర్వ ప్రాణములతోను,శరీరముతోను సంబంధము వదలి
పోవుట మరణ. మనఁబడును. సూక్ష్మప్రాణ దేహములతో సంబంధమును గలిగి
యుండుట మూర్ఛయనఁబడును. శ్రీభాష్యము. "అరిందు నీ మఱంది కరసావౌనర్చె"
భార. ద్రోణ - ౫ ఆ - అరసావు చచ్చె - ఇది 'పాకం పచతి' - వంట వండు
చున్నాఁడు అను ప్రయోగమువంటిది. అర. రూ. అఱ.

తే. ఎట్టులో వారు విడువంగ • నెట్టుకొంచి, యేకతంబునఁ దనవారి • కెల్లఁ జూచ్చి
దధిముఖుం డిట్టు లను పెదు•మధువనంబు,నంద యుండఁగ నున వెల్ల•నరిగి నే.

అర్థములు. ఏకతంబునన్ = ఒంటరిపాటున - ఏకాంత ప్రదేశమున.

తాత్పర్యము.

స్పష్టము.

ఉ. రామునితోడ నున్న కపి•రాజును గన్గొని రొక్కయుంగనుం
డే మునుకొంచు దోసముల • నెల్ల ఘటించె నటంచుఁ జెప్పఁ బై
తామహమున్ దురాపద ము•దాత్తము నిష్టవనంబు గావునన్
తామస మేది కీశపతి • దండనముల్ ఘటియించు వీరికిన్. ౧౩౬౪

అర్థములు. మునుకొంచు = ముందుపడి- ముందుగా వచ్చి- పైతామహమున్ = బ్రహ్మ ఋతురజస్సున కిచ్చినది. దురాపదము = సులభముగ దేవతలకును బొందరానిది- ఉదాత్తము = గొప్పది- ఇష్టవనంబు = ప్రియమైన వనము - తామస మేది = అలస్యము లేక.

తాత్పర్యము.

రామచంద్రమూర్తితోఁ గూడియున్నయమయమున సుగ్రీవునితో నంగదుఁడే ముఖ్యుఁడై
ముందుగను నిలిచి దోషము లన్నియును - వనములోఁ జొచ్చుట, తేనెలు త్రాగుట,
చెట్లు పాడుచేయుట,తమ్ము కొట్టుట, యివి యన్నియుఁ జేసె నని చెప్పితినేని బ్రహ్మ
ఋతురజస్సున కిచ్చినదనియు, నెట్టివారలైనను బ్రవేశింపరానిదియు, గొప్పదియు, ప్రియ
మైనదియుఁ గావున సుగ్రీవుఁ డాలస్యములేక వీరి కందఱ దండించును.

క. భూవల్లభ శాసనపరి, భావులు దుర్మతులు వీరిఁ • బరిమార్చింపం
గా వలయు నంత వీరల, జీవితమును గోలుడు మనమఁ • గపియుం డీఱున్.

అర్థములు. భూవల్లభ శాసన పరిభావులు = రాజాజ్ఞ నుల్లంఘించినవారు-

దుర్మతులు = దుష్ట మనస్సుగలవారు, పరిమార్పింపంగాన్ = చంపింపగా, శావ
రము=పొగరు, కసియున్ = పగయును.

తాత్పర్యము.

రాజాజ్ఞ మీరిన చెడుమనస్సు గల వీరిని చంపింప వలయును. అట్లు చేసితి మేని వీరి పొగరణఁగును. మన పగ దీఱును.

క. అని తనబడిఁ దక్షిణ మధువనపాలకు లేగుదేర • బాసరపతిపు
త్రునిఁ జూడ నాకసంబునఁ, జని దధిముఖుఁ డొక్కక్షణమున • సత్వరుఁ డగుచున్.

అర్థములు. తనబడిన్ = తనవెంబడి, సత్వరుఁడు = త్వరగలవాఁడు.

తాత్పర్యము.

తనవెంటఁ దక్షిణ వనపాలకులు రాఁగా సుగ్రీవునిఁజూడ దధిముఖుఁడు ఆకాశమున నిమిషములోఁ ద్వరగాఁబోయి.

ఆ. రామచంద్రవిభుని • సౌమిత్రి సుగ్రీవుఁ, గాంచి యచట డిగ్గి • కపికులాభ
రణము జేర నేగి • ప్రణతిఁ గావించె న,త్యంత మూర్తి మొగము•నందు ప్రేల.

తాత్పర్యము.

రామలక్ష్మణ సుగ్రీవులఁ జూచి యచట దిగి సుగ్రీవు నొద్దకుఁ బోయి భూమిపై బొట్టు మొగముతో నమస్కరించెను. మేనమామ యల్లునికి నమస్కరించుట ప్రభుత్వ గౌరవమును బట్టి యని తెలియవలయును.

—• ౬౩-వ సర్గము. దధిముఖాదివనపాలకులు సుగ్రీవునితోఁ
గపుల దుశ్చేష్టలు దెల్పుట •—

క. ఇట్లొయి దీనతఁ దనపాదమ్ములఁ బడ సూర్యసుతుఁడు • దధిముఖుఁ గని లే
లెమ్మా భయపడకుము విష,యమ్మును వినిపింపు మంచు • నాశ్వాసింపన్.

అర్థములు. దీనతన్ = భయమున, లెమ్మా లెమ్మా = లేలెమ్మా, ఆశ్వాసింపన్ = ఓదార్చంగా.

తాత్పర్యము.

ఈ ప్రకారము భయముచే దన కాళ్ళమీఁదఁబడిన దధిముఖునిఁ జూచి సుగ్రీవుఁడు లేలెమ్ము. భయపడకుము. ఏమి జరగెను. చెప్పుము. అని సమాధాన పఱుపఁగా.

ఆ. అతఁడు లేచిపల్కె • నధిప! నీ జనకుని,తరమునందు నన్న•తరమునందు
నీ తరంబునన్ న•నేచరు లావంక,మలయరాని రమ్య•మధువనంబు. ౧౬౯

అర్థములు. నీ జనకుని తరమునందు, నన్నతరమునందు – నీ యన్న తరంబునం దని యర్థము. "కొన్నిచోటుల సంబంధంబునం బూర్వ వాక్యంబు నందలి పదం బధ్యాహార్యంబగు ప్రౌ - వ్యా - వాక్య - ౧౨ సూ. 'పంక్తి ముఖు నాతని తమ్ముని గుంభకర్ణుని - దనయుని మేఘనాదుని, దాననేశ్వరునకుఁ దమ్ముని' విర్వ - అఱ.

తాత్పర్యము.

ఈ ప్రకారము సుగ్రీవుఁడు ధైర్యము చెప్పఁగా వాఁడు లేచి యిట్లు చెప్పెను. నీ తండ్రి తరమునందుఁగాని, నీ యన్నతరమునందుఁగాని, నీ తరమునందుఁగాని వానరు లా ప్రక్కఁగూడఁ దిరుగరాని మధువనమును.

ఉ. ఆ వనచారు లెల్ల వి॰లయం బొనరించిరి పాడు పాడుగా
ద్రావిరి తేనె, లెల్ల ఫల॰రాశి భుసంగిరి, తక్కు తేనెలన్
భూవివరంబులం బొలుకఁ॰బోసి, రిదే మని పీర లడ్డ మై
పోవఁగఁ గొక్కిరించి కను॰బొమ్మలు చూపిరి గుబ్బుగొట్టుచున్. ౧౩౬౦

అర్థములు. భూ వివరంబులన్ = నేల బొక్కలందు, ఒలుకఁబోసిరి = పారఁబోసిరి.

తాత్పర్యము.

నీవు దక్షిణమునకుఁ బంపిన క్రోఁతులు పాడుపాడు చేసిరి. తేన ద్రావిరి. పండ్లన్నియుఁ దినిరి. త్రాఁగఁగా మిగిలిన తేనెను నేల బొక్కలలోఁ బోసిరి. కొంత నేల కొరవలించిరి. ఇదియేమి యీ యాగడ మని మీరడ్డము పోఁగా వెక్కిరించిరి. గుబ్బు కొట్టిరి. కన్నుబొమ్మలు చూపిరి- స్వభావోక్తి.

ఉ. ఏపున పీర లొక్కటిగ ॰ నేగి వని న్వెడలం దటం చనన్
గోపముతోడ ముష్టులను ॰ గ్రుద్దిరి, గ్రుమ్మిరి కాలుసేతులన్
జూపిరి దేవమార్గముల ॰ శంకలేనాన యశేచ్ఛ యిట్లు నీ
భూపతితం జెలంగి పలు॰పోకలఁ బోయిరి తోఁట పాడుగన్. ౧౩౬౧

అర్థములు. ఏపున=బలముగ, నీ భూపతితన్=నీవు రాజుగా నుండఁగా.

తాత్పర్యము.

బలముగా నీ రంకలు గుంపుగాఁ బోయి తోఁటలో నుండి వెడలి పొండనఁగా వారు కోపించి పిడికళ్ళ గ్రుద్దిరి. కాలుసేతులఁ గ్రుమ్మిరి. ముద్దులఁ జూపిరి. శంకలే యిట్లు నీవు రాజై యుండఁగానే వీరు పలు పోకలఁ బోయిరి. తోఁట పాడుచేసిరి.

క. అని విన్నవించు చుండఁగ, విని లక్ష్మణుఁ డనియె నో రవిప్రభవా! యే
మనిమొడి నీ వనపాలుఁడు, వనరెడి నిటు లేల యనిన ॰ వాక్యజ్ఞుఁ డనున్. ౧౩౬౨

తాత్పర్యము.

అని విన్నపముచేయు సమయంబున వారి మాటలు లక్ష్మణుఁడు విని సుగ్రీవా యీ వనపాలుఁ డేమనుచున్నాఁడు. ఏల దుఃఖపడుచున్నాఁడు? అనిన మాటల యందలి నేర్పరియగు సుగ్రీవుఁ డిట్లు చెప్పెను.

—॰ { సుగ్రీవుఁడు లక్ష్మణునితో హనుమదాదులు మధువనంబున విహరించుటఁ దెల్పుట } ॰—

సీ. అర్య! సౌమిత్రి! యు॰ద్యానపాలుఁడు వీఁడు, దధిముఖుం డనినొడి॰తరుచరుండు
దక్షిణదిశ కోయఁ ॰ దరలి పోయిన యంగ,దాదులు చనుదెంచి ॰ కోపమునను

మధువనంబునఁ జొచ్చి • మధువంతయుం ద్రావి, యిచ్ఛావిహారంబు • నెలమిఁజలుపు
చున్న వారట యంచు • నూహింప నివి యెల్ల,నకృతకృత్యులచేఁత • లవఁగ రాదు
తే. వనముఁ జొచ్చినయప్పుడె • వారు కార్య,సాధకతఁ గ్రాలు చుండుట • సత్యమయ్యె
చూడఁబడె దేవి, సత్యంబు • సుమ్ము హనుమ,చేతనే యది యితరుల • చేతఁగాదు.

అర్థములు. అకృతకృత్యుల చేఁతలు = పనిసాధింపని వారిచేష్టలు - కార్య సాధకత = కార్యము సాధించుటచేత.

తా త్ప ర్య ము.

స్పష్టము.

క. ఈ కార్యము సాధింపఁగఁ జేయుటఁ బావనికె యొప్పుఁ • జే నిదియానే
యా కపివరునకె శక్తియు, ధీకలిమియు శ్రుతము తెంపు • తేఁకువ గలుగున్. ౧౩౭౪

అర్థములు. ధీకలిమియు = బుద్ధి సంపద - శ్రుతము = శాస్త్రజ్ఞానము, తెంపు = సాహసము, తేఁకువ = ధైర్యము.

తా త్ప ర్య ము.

స్పష్టము.

ఉ. మంత్రి జాంబవంతుఁ డట • మానుగ వానరకోటికిన్ హనూ
మంతుఁడు రక్షకుం డట, స • మానవిహీనబలాఢ్యుఁ డంగదుం
డింతకు నేలినాతఁ డట • యిట్టిరు పూనిన కార్య మొక్క యా
వంతయు మొక్కపోనె? ఫల • వంతము గూ టది యేమి చోద్యమో! ౧౩౭౫

అర్థములు. సమాన విహీన బలాఢ్యుఁడు = బలమునందు సమానులు లేని వాఁడు, ఏలినాతఁడు = ప్రభువు, మొక్కపోనె = భంగమగునా.

ఈ దక్షిణదిశ పోయిన వానరులకు నాలోచన చెప్పువాఁడు జాంబవంతుఁడు.

అఁట=మహాత్వమును దెలుపును.

ఉ. రాజఁట ధర్మజుండు సుర • రాజసుతుండఁట ధన్వి శాత్రవో
ద్వేజకమైన గాండివము • విల్లఁట యుగ్రగదాధరుండైన భీముఁడ
య్యాజికిఁ దోడు వచ్చునఁట • యాపదగల్గుట కేమి చోద్యమోఁ
............................................................... భాగ.

తా త్ప ర్య ము.

దక్షిణమున బోయిన వానరసేనకు నాలోచన చెప్పువాఁ డా జాంబవంతుఁడు. రక్షకుఁడా హనుమంతుఁడుఁ బ్రభువా యసమాన బలుఁ డగు నంగదుఁడు- ఇట్టి వారు పూనిన కార్యము భంగమగునా? ఫలవంత మగుట యేమి యాశ్చర్యము ?

క. అంగదుఁ డాదిగఁ బ్రముఖులు, భంగించిరి మధువనంబు • వారింపంగాఁ
జెంగటి కేగిన జానుల, నంగంబుల నలియ దంచి • రఁట యీ కపులన్. ౧౩౭౬

అర్థములు. భంగించిరి = విఱిచిరి. అఁట—ఇచ్చట అఁట యనునది వృత్తాం

తెమును దెలుపును, అనుట సంగ్రహరూపము. అంట. చెంగటికిన్ = సమీపము నకు, జానులన్ = మోఁకాళ్ళతో.

తా త్ప ర్య ము.

అంగదుఁడు మొదలయిన వానర ప్రముఖులు మధువనమును విఱిచి తప్పు పెట్టి రఁట. వలదని అడ్డము పోయిన వీరిని వరియు దంచి రఁట.

చ. వనజదళాయతాక్షిఁ గని • వచ్చినవారలు వారు కానిచో
వనమును బ్రహ్మదత్తమును • వారలు కన్నుల నైనఁ జూడఁగాఁ
జనియెడివారు? నాఁగ శ్రుతి • సౌఖ్యదవాక్యము లాలకించి యా
మనుజకులదీపకుల్ పరమ • హృష్టతఁ దుష్టి వహించి రంతటన్. ౧౩౭౪

అర్థములు. వారలు = వారా! ఆశ్చర్యమును దెలుపును. శ్రుతి సౌఖ్యద వాక్యములు=చెవులకు సుఖము గలిగించు మాటలు, వినుట కింపయిన మాటలు.

తా త్ప ర్య ము.

ఆ వానరులు సీతాదేవిని జూచి వచ్చిన వారు కానిచో బ్రహ్మ దత్తమైన వనమును వారికిఁ గన్నుల నైనఁ జూడ ధైర్యము గలదా? అనఁగా విన నింపైన యా మాటలు విని రామలక్ష్మణులు మిక్కిలి సంతోషించి గగుర్పాటు చెందిన వారైరి.

—• సుగ్రీవుఁడు కపులను ద్వరగ రం డని దధిముఖుచే వార్త బంపుట. •—

చ. ఇనజుఁడు తోఁటవాని కని • యెం గపివల్లభ! నీదు వాక్యముల్
వనచరులా వనంబునను • వారక గ్రుమ్మరి రంచు వింటచే
ఘనముద మయ్యె, సాధితసు • కార్యులు మన్నన కర్హులే కదా?
గనుక క్షమించితిం గపులఁ • గానఁగ నేఁగుము పల్కు మిమ్మిధిన్. ౧౩౭౫

అర్థములు. సాధిత సుకార్యులు=మంచికార్యము నెఱవేర్చినవారు, ఇనజుఁడు= సుగ్రీవుఁడు.

తా త్ప ర్య ము.

సుగ్రీవుఁ డిట్లు రామలక్ష్మణులకుఁ జెప్పి తోఁట వానితో నిట్లనెను. వానర శ్రేష్ఠా! వానరులు మధువనమునందు స్వేచ్ఛావిహారము చేసిరని నీవు చెప్పుటచే మిగుల సంతోషించితిని. వారు మంచి కార్యమును సాధించిన వారు కావున మన్న నకు యోగ్యులు కదా! కావున క్షమించితిని. నీవు పోయి యా వానరులఁ జూచి యిట్లు చెప్పుము.

కిష్కింధాకాండము ౧౦౨౨ వ పద్యము చూడుఁడు. అందు సీతాదేవిని జూచితి నని చెప్పువాఁడు "సత్ప్రమాణుఁడై, వాసి చెలంగు దుండు-ఎక్కుడు దోషియుఁ జట్ట మొచ్చుకొన్" అని చెప్పెను గదా! కావున వానిని క్షమించెను.

క. హనుమంతుఁడు లోనుగఁ గల, వనచరవర్యుల దధిశ • వసుధాతనయం
గనుటను వార్తప్రియులమ్ము, వినఁగోరితి నృపులతోడ • వే రండనుమా. ౧౩౭౬

రాఘవాంతికమునకు = రామసుగ్రీవుల సమీపమునకు - నియతా = పాతివ్రత్య నియమముగలది - ప్రాణయుక్తా = జీవించియున్నది - దేవీ = సీతాదేవి - సీత ప్రాణముతో నుండియు శీలము చెడిన దన్నచో దాని చచ్చినదానితో సమానమే కావున శీలము గల దని మొదటఁ జెప్పెను. ప్రాణయుక్తా=శీలము గలది నిజమే, చచ్చియుండిన శీలవతి యన్నచో నేమి లాభము. కావున జీవించి యున్నదని చెప్పెను. తరువాత దేవి యని చెప్పెను. దేవిశబ్దమును సీతాదేవియందుఁ దనకుఁగల భక్తియు గౌరవము తెలుప నుపయోగించెను. దేవుని భార్య దేవి. దేవ ఏకో నారాయణ యన్నట్లు దేవశబ్దము ముఖ్యార్థమున నారాయణునందే యున్నయది. తక్కినవారియందు గౌణము. అట్టివాని భార్య లక్ష్మి. 'శాశ్వత్యై ధ్యాయామి దేవీం సర్వోపద్రవ వారిణీ' మ్మని దేవిశబ్దము లక్ష్మీ పర్యాయముగ అష్టోత్తర శతనామములందుఁ బఠితము.

రామశబ్దము 'రము క్రీడాయా'మ్మను ధాతువువలనఁ గలిగినది. దేవ శబ్దము 'దివు క్రీడాయా'మ్మను ధాతువువలన నిష్పన్నమైనది. కావున రామ దేవ శబ్దములు సమానార్థకములు. దేవి శబ్దము 'దివు క్రీడాయా'మ్మను ధాతువువలనఁ గలిగినదే. దేవ విభుఁడైన సీత ఆతని యన్ని విధములఁ దగియున్నదని భావము. అనఁగా తన కాంతి సాటిలేనిగాఁ దోఁచెను గాని సామాన్య స్త్రీగాఁ దోఁచదే యని భావము. ముందు దేవియని చెప్పిన భ్రష్టురాలన్యో యని చెప్పునో - మరణించెనని చెప్పునో యని కొంతవరకు చెప్పినంతలో రామచంద్రమూర్తి యెంత సంతాప పడునో యని ప్రాణమునకంటె శీల మెక్కువ కావున ముందు శీలవతి యని చెప్పి యావల ప్రాణవతియని చెప్పి యావల దేవి యని చెప్పెను. ప్రాణయుక్త యనుటచే దేహము నందుఁ బ్రాణము మాత్ర మున్నది. జీవించినవారి కుండవలసిన లక్షణములు మఱి యేవి లే వని భావము.

తాత్పర్యము.

ఈ ప్రకారము రామ సుగ్రీవులు సంభాషించు సమయమునఁ గార్యము సఫల మని తెలుపునట్లు సింహనాదములు చేయుచు వచ్చుచున్న వానరుల కిలకిలార్భటులు ఆకాశమున దగ్గఱగా వినరాఁగా సుగ్రీవుఁడు ప్రభువు కూర్చుండవలసిన విధముగా తోఁక పొడుగుగాఁ జాఁచి కూర్చుండెను. అంగదుఁడు అంజనేయుని మఱియుం దుంచు కొని వానరులు రామసుగ్రీవులను సమీపమున దిగిరి. అప్పుడు శ్రీరామచంద్ర మూర్తికి హనుమంతుఁడు - నియతా - ప్రాణయుక్తా - దేవి యని సర్వము మూఁడు మాటలలోఁ దెలిపెను. అది విని సుగ్రీవుఁడు రామచంద్రమూర్తి కార్యము ఫలించె నని సంతోషించెను.

సీతాదేవిని వెదకించి వార్త తెప్పించెద నని చెప్పినమాట చెల్లించుకొంటి నను సంతోషముకంటె రామకార్యము ఫలించెఁ గదా యని సంతోషించె ననుటచే మిత్రలక్షణము స్పష్టీకరింపఁబడెను.

ఆ. ప్రీతియుక్తు లగుచు • శ్రీరామలక్ష్మణుల్, కపుల్ ప్రియంబుఁ దెలుపు • గంధవాహ
బాత్మజాతుఁ గనిరి • సాదరాలోకన, సంస్తు లతనిమీఁదఁ • బరఁగఁ జేసి. ౧౬౯౪

అర్థములు. సాదర+ఆలోకన+సంస్తులు=ప్రేమతోఁ గూడిన చూపులవరుసలు.

తాత్పర్యము.

శ్రీరామ లక్ష్మణులు ప్రీతిగలవారై మిగులఁ బ్రియములైన మాటల చెప్పు హనుమంతుని ప్రేమతోఁ గూడిన చూపులచే చాలసేపు చూచుచుండిరి.

౬౫-వ సర్గము.

ఉ. రాముని లక్ష్మణుం బ్లవగ • రాజును జేరి నమస్కరించి శా
ఖామృగపాళి భూమిసుత • గాథ వచించెను లంక నామె సు
త్రామవిరోధిమందిరధ • రం జెఱ నుండుట, రాక్షసాంగనా
భీమవిభీషికల్ గడువు • పెట్టుట, తత్పతిభక్తియున్. ౧౬౯౫

అర్థములు. సుత్రామ విరోధి = ఇంద్రునకు బగవాఁడైన రావణుని యొక్క - మందిర ధరన్ = గృహప్రదేశమందు - భీమ విభీషికల్ = భయంకరములైన బెదరింపు మాటలు.

తాత్పర్యము.

వానరు లందఱు రామలక్ష్మణ సుగ్రీవుల యొద్దకుఁ బోయి నమస్కరించి రావణాసురుని యింట సీతాదేవి యుండుటయు, రాక్షస స్త్రీ లామెను బెదరించుచుండుటయు, రావణుఁడు గడువు పెట్టుటయు, ఆమె పతిభక్తి నుతించియుఁ జెప్పిరి.

ఉ. జానకి సేమ మంచుఁ గపి • సత్తము లాడఁగ రాఘవుం డనున్
వానరులార! సీత యెట • వర్తిలు చున్నది? నా యెడాటమం
దే నియమిం జరించు! నిది • యెల్లను జెప్పుఁ డటన్న నంజనా
సూనుని నీవు పల్కు సతిఁ • జూచిన వాఁడ వటన్న వానరుల్. ౧౬౯౬

అర్థములు. నా యెడాటమందున్ = నా విషయమందు.

తాత్పర్యము.

సీతాదేవి క్షేమముగా నున్నదని వానరు లందఱుఁ జెప్పఁగా విని రామచంద్రమూర్తి యుబ్బెను. వానరులారా! సీతాదేవి యెం దున్నది! ఏమి చేయు చున్నది? నా విషయమం దే నియమము గలదై యున్నది? ఇదంతయుఁ జెప్పుఁడని యడుగఁగా వానరులు హనుమంతా! చూచివచ్చిన వాఁడవు నీవే చెప్పు మనిరి.

క. హనుమంతుండును వసుధా,తనయామణి యుండు దెసకుఁ • దన్వంగికిన్
వినయంబున శిరమున వం,దన మొనరిచి యిట్టు లనియె • దశరథసుతుతోన్.

తాత్పర్యము.

హనుమంతుఁడు సీతాదేవి యున్న దిక్కునకు, సీతాదేవికిని వినయముతో శిరస్సు వంచి నమస్కరించి శ్రీరామచంద్రమూర్తితో నిట్టు లనెను.

ఆ. నిశ్చయించి యున్న • నెలఁత నెట్టులైనఁ, దేను గాంచి యామె • కెలుకఁ బడఁగ
నెలమిఁ బొగడినాఁడ • నిక్ష్వాకువంశని, ఖ్యాతి దేవి నమ్మఁ • గలుగుటకును.

అర్థములు. వేసవి = జడ - వేశీ శబ్ద భవము - అనవరతంబు=ఎల్లప్పుడు - త్వత్ + ధ్యాన + రతాత్మయై = నిన్ను ధ్యానించుట యందే ప్రీతిగల మనస్సు గలదై - అడఁకడిన్=దుఃఖముచే - నళిని = తామరతీఁగ - నవసి = చిక్కి.

తాత్పర్యము.

రావణుని యంతఃపురమందుఁ జెఱలోఁ జిక్కికొని రాక్షసస్త్రీల గుంపులు తనపైఁ గాపలి యుండఁగా వెంట్రుక లన్నియు నొక్కటిగఁ జేసుకొని పోయిన జడతో గొన్ని నేలపైఁ గూర్చుండుటకును శక్తిలేక బండుకొని బాధపడుచు సర్వకాల సర్వావస్థల యందు నిన్ను ధ్యానించుటయందే ప్రీతి గల మనస్సు గలదై బాధపడుటచే మంచుకాలమునాఁటి తామర తీఁగవలె కాంతిచెడి (తపించి, రావణు కోరిక నెఱవేరు లైన వ్యర్థము చేయువలయునను కోరికతో నిఁకాని బ్రదుకు రోసి గాదు) దేహంబు వదల నాలోచించి నిశ్చయించి యున్న యామెను నట్టి సమయంబున నేను నతిప్రయాసము మీఁదఁ జూచి నారాక యామెకుఁ దెలియునట్లు ఇక్ష్వాకు వంశరాజుల యొక్క కీర్తిని నామెను నమ్మించుటకై పొగడితిని.

క. ముచ్చటలను సర్వార్థము, లచ్చపలాక్షికిని జెప్ప • నగచరపతితో
నచ్చపుస్నేహము మీఁకిట, నచ్చుపడుట కబ్జనేత్ర • హర్షం బందెన్. ౧౪౦౧

• తా. చూడు—౧౩౩౫ ప.

—• హనుమంతుఁడు శ్రీరామునితో సీతాదేవి వాక్యంబులు దెల్పుట. •—

ఉ. నిన్ను మహానుభావ ! కను • నిర్మలచిత్తమునన్ స్మరించుచున్
సన్నుతభక్తిశీలములు • సాధ్విగుణంబుఁ దపంబుఁ బాయకం
దున్నది, నేను జూచితి, ర • ఘూత్తమ! నీవు నఖిష్ఠ చిత్రకూ
టోన్నతసీమఁ గాకికథ • నొయ్యన వచించియు నాకు నిట్లనెన్. ౧౪౦౨

అర్థములు. మహానుభావ = ఓ మహానుభావుఁడా యని సంబోధనముగ నైనఁ జెప్పవచ్చును. మహానుభావురాలగు సీతాదేవి యని యైనఁ జెప్పవచ్చును. రెండవదియె ప్రశస్తము, ప్రస్తుతము.

తాత్పర్యము.

మహామహిమగల యా సీతాదేవి నిన్ను మిగుల నిర్మలమైన మనస్సుతో స్మరించుచు సత్పురుషులచేత స్తోత్రము చేయఁబడిన భక్తి-స్వభావము-పాతివ్రత్యము-తపస్సు (ఉపవాసాది) వదలక యా యశోక వనమునం దున్నది. ఇది యితరులు నాకుఁ జెప్పఁగా నేను నీకుఁ జెప్పుట లేదు. నేను కన్నులారఁ జూచి చెప్పుచున్నాను. నీవు చూచి యుండిన నీతో నేనైనఁ జెప్పినా యంకువా నీకు గుర్తుగా చిత్రకూట పర్వతమున నెత్తగు ప్రదేశమందు జరిగిన కాకి కథ చెప్పి మఱియు నిట్లనియె.

క. హనుమా! యిచ్చటఁ జూచిన, దనుమా నర్వంబుఁ బురుష • హర్యక్షునితో
సినకులదీపకుఁడో నని, నను నాజ్ఞాపించెఁ గంజ•నయన నృపాలా. ౧౪౦౩

అర్థములు. పురుష హర్యక్షునితో = పురుష సింహముతో.

తాత్పర్యము.

స్పష్టము.

క. మిక్కిలియత్నముతో నే, నక్కఱ రక్షించితిని మ•హామణి యిది నీ
వ క్కాఱనున్న కిమ్మా, యక్కపినాథుండు వినఁగ • ననుమా యిట్లుల్. ౧౪౦౪

అర్థములు. మిక్కిలి యత్నముతో = మిగులఁ గష్టపడి- రాక్షసులపాలు గాకుండునట్లు.

తాత్పర్యము.

స్పష్టము.

ఆ. గంధభాగమునను • గరఁగిపోఁ దిలకంబు, స్వేదబిందువులను • జిత్రకీర్తి
మణిశిలను నొకంట•మనమరిమాఁగ నీవు, తిలకముంచుటయును • దలఁపవలయు.

తాత్పర్యము.

చూ. వ. ౯౯౩.

ఉ. చూచితి నీజలోద్భవము • దాశరథీ! యిది నీ మనోంబుజం
బౌచి కొనంగఁ జాలుట మ•హాత్మ! భవద్విరహానలంబు నన్
గ్రాఁచెడివేళ నిన్గనిన•ట్లై వడి దీనిని గాంచి పొంగుదున్
సైఁచుట దోఁప దింక రఘు•చంద్రమ! యియ్యది నీకుఁ బంచితిన్. ౧౪౦౫

తాత్పర్యము. చూ. వ. ౯౯౪.

క. నెల యొక్కటి మొలు లేనియు, నిలుపుకుఁ బ్రాణంబు మేన • నీరజనయనా!
నెల కావల బ్రదుకను పోఁతులచేతికిఁ జిక్కి నిజము • కువలయనాథా! ౧౪౦౬

అర్థములు. పోఁతులు = రాక్షసులు.

తాత్పర్యము.

స్పష్టము.

చ. అనుచుఁ గృశాంగి ధర్మరత • యాశరసౌధనిరుద్ధ భూమిజా
తనయ మృగాక్షి పల్కెను య•థాస్థితి సర్వము నీకుఁ జెప్పితిన్
వనధిఁ దరింప బూనుము ది•వాకరవంశమణీ! నమ్ము లేని యం
చును రతనంబుఁ జేరనిడె • సొంపుగ వానలు విశ్వసింపఁగన్. ౧౪౦౭

అర్థములు. కృశాంగి = బక్కచిక్కిన దేహము గలది - ధర్మరత = అట్లుండియు పతివ్రతా ధర్మమందే ప్రీతిగలది, ఆశర = రాక్షసుని - సౌధ=అంతఃపురము, మేడయందు - నిరుద్ధ = నిర్బంధింపఁబడినది - యథాస్థితి = ఉన్నదున్నట్లు.

తాత్పర్యము.

ఈ ప్రకారము తానెంతయో శుష్కించి వసుగై యున్నను పతివ్రతా ధర్మమునఁ బ్రీతి మాత్రము వదలక రావణు నింత నిర్బంధమునఁ జిక్కి సీతాదేవి చెప్పెను. ఉన్నది యున్నట్లు సర్వము నీకుఁ దెలిపితిని. సూర్యవంశ రత్నమా! నీవు సముద్రము నెటులైన దాటు నాలోచన సేయుము. అని చెప్పి వారందఱు నమ్మునట్లు రత్నమును రామచంద్రమూర్తి చేతిలో నుంచెను.

—• ౬౬—వ సర్గము. శ్రీరాముఁడు సీతాదేవిచూడామణినిఁజూచి దుఃఖించుట. •—

క. రాముఁడు తన్మణిఁ గైకొని, ప్రేమంబున నక్కునఁ జేర్చి • ప్రియసోదరుతో
భామినిఁ దలంచి దుఃఖో,ద్దామతఁ బలవించి సూర్య•తనయున కనియెన్. ౧౮౦౯

అర్థములు. అక్కున్ = ఱొమ్ము, దుఃఖోద్దామతన్ = దుఃఖాతిశయముచే, పలవించి = ఏడ్చి.

తాత్పర్యము.

ఆ మణిని రామచంద్రమూర్తి దీసికొని సీతాదేవియే వచ్చినట్లు తలంచి దానిని కౌఁగిలించుకొనునట్లు ఱొమ్మున కొత్తుకొని సీతను దలంచి దుఃఖాతిశయముచే లక్ష్మణునితోను సుగ్రీవునితోను నిట్లనెను.

ప్రియసోదరుతోఁ దలంచి పలవించి యనుటచే దానిని జూడఁగానే లక్ష్మణుఁడును దుఃఖించెనని భావము.

సీ. సుగ్రీవ! యీ దివ్య•చూడామణిని జూడఁ, జూడ నామనము లే•గూడఁ గన్న
ధేనువు చేఁపెడు• తీరునఁ గరఁగెడి• సొమ్మిది నాధవను మా•మామగారు
వలఁబ్రేమమున న•ద్వాహవేళను శిర, మున దీని గూర్ప న•త్యంత కాంతిఁ
దేజరిల్లును నుండె • దివ్యంబు సజ్జన, పూజితం బంబుసం•భూత మైన
ఆ. దీని నధ్వరమునఁ • దృప్తుఁడై శక్రుండు, జనకునకు నొసంగె • సాదరమున
మణిని జూచినంత • మా మామ జనకుని, నాత్మజనకుఁ గన్న • యట్లు లయ్యె.

అర్థములు. ఉద్వాహవేళను = పెండ్లిసమయమున, దివ్యంబు = దేవతాసంబంధమైనది, అంబుసంభూతంబు = జలములందుఁ బుట్టినది, అధ్వరమునన్ = యజ్ఞసమయమున, శక్రుండు=ఇంద్రుడు.

తాత్పర్యము.

సుగ్రీవా! మనుష్య దుర్లభమై దేవతలు ధరించు నీ చూడామణిని జూడఁగా నామనస్సు లేఁగదూడను జూచినంతనె యావు చేఁపు విధముఁగా గరఁగుచున్నది. దీనిని మా మామగారు సీతాదేవికి బెండ్లికాలమందు శిరంబున ధరింపఁ జేయఁగా నామె మిగులఁ గాంతిగలదై ప్రకాశించెను. ఇది దివ్యము. సత్పురుషపూజితము. జలములందుఁ బుట్టినది. దీనిని మామామగారు యజ్ఞము చేయు సమయంబున సంతోషించి

యిచ్చినట్టు నాయనకిచ్చెను. దీనిని జూడఁగానే మా మామ జనకరాజును, మా తండ్రిని జూచినట్టులైనది. ౧౪౧౧ వ పద్యముచూడనగును. మా మామగారునునటుచే నాయన ప్రక్కనుండిన యత్తగారును స్మృతికి వచ్చినదియే. సుతార మీ యర్థ మిచ్చుచున్నది.

క. ఆ తరుణీమణిశిరమున, భాతిం దెలువారు దీనిఁ • బరికింపఁగ నా
కో తరణిజ ! భూసుతయే, ప్రీతిం జనుదెంచినట్టి•రీతిగఁ దోఁచెన్. ౧౪౧౧

అర్థములు. భాతిన్ = కాంతిచే, పరికింపఁగన్=చూడఁగా. ప్ర-పగీత్రించు.

తాత్పర్యము.

ఆ సీతాదేవి శిరస్సునందుఁ బ్రకాశించు దీనిని జూడఁగానే సీతాదేవియే వచ్చిన దని తోఁచెను.

ఉ. దారక దప్పిచే నలఁగు•వానికి నీరము పోయుకీతిగా
నా కెను శీతవాక్యముల • సౌమ్యగుణా! వచియింపవయ్యా, యా
వారిజనేత్ర లేకయును • వారిజ మీ రతనంబుఁ గంటి, నా
కారయ నింతకంటెను మ•హాత్తరదుఃఖము లున్నె లక్ష్మణా ! ౧౪౧౨

తాత్పర్యము.

మిగుల దాహముచేఁ దపించు వానికిఁ ద్రావ నీళ్ళు పోసినట్లు లాంజనేయా ! నాకు సీతాదేవి వాక్యముల వినిపింపుము. లక్ష్మణా ! సీతాదేవి లేక యీ చూడా మణిని జూచితిని. నా కింతకంటె గొప్ప దుఃఖము గలదా ?

చ. ఒకనెలదాఁకఁ బ్రాణమున • నుండఁగఁ జాలినయోని యింక జా
నకి చిరజీవ, నే నొకక్ష•ణం బసితేక్షణ లేక మనిపొం
దిక బ్రతుకంగ నేర, సుమ•తీ! నను దోడ్కొని పోఁగదే ప్రియా
నికటముఁ జేర, వార్తను వి•నిన్ వశమా యిట నాకు నిల్వఁగన్ ? ౧౪౧౩

అర్థములు. అసితేక్షణ = నల్లని కలువలవంటి కన్నులు గలది - ప్రియానికటము = ప్రియురాలి సమీపము - వినిన్ = వినియును, వినియున్ అను పదములో సముచ్చయము లోపింపఁగా మిగిలిన రూపము. సుతార మర్థ విశేషంబును దెలుపును.

తాత్పర్యము.

నన్ను విడిచి సీతాదేవి యింక నొకనెల జీవించి యుండఁగలదేని యామెకు మరణమే లేదు. ఎన్ని దినాలైనను బ్రతికి యుండఁగలదు. నేనో యీ కాముక కంటిని విడిచి యొకక్షణమైన బ్రతికి యుండలేను. కావున నేను బ్రతికి యుండవలె నని మీకుఁ గోరిక గలదేని నన్నామె సమీపమునకుఁ దీసికొని పొండు. ఏలన సీత యీ విధముగ నున్నదని విని కూడ నిచ్చటఁ బ్రాణముతో నుండ నాకు సాధ్యమా?

ఇంతటి దుఃఖమందును రామచంద్రమూర్తి నన్ను సీతాదేవి యొద్దకుఁ దీసికొని పొమ్మనెనే కాని యామె నిచ్చటికే తేలేదని కాని, యిప్పుడైనఁ దీసికొని రండని కాని యనలేదు.

వానినే చెప్పు మని భావము. మచ్ఛ్రుతైః=నాచే వినఁబడినవై. మధుర=సుందరి, సుందరి మాటలు సుందరముగానే యుండును.

తా త్ప ర్య ము.

హనుమా! సీతాదేవి నేను వచ్చి తన దుఃఖము బాప లేదని కోపించినదా చెప్పుము. రోగి యౌషధము దిని బ్రతుకునట్లు నీ మాటలు విని బ్రతుకువాఁడను. తేనెవంటి మాటలు, తేనెవంటి గుణము స్వభావము గల యామె నేను వినుచుటచే నన్నుద్దేశించి యేమి చెప్పెనో యా మాటలే చెప్పుము.

—• ౬౭-వ సర్గము. హనుమంతుఁడు శ్రీరామునకుఁ గాకాసుర వృత్తాంతం బభిజ్ఞానంబుఁ దెలుపుట. •—

క. అని రామచంద్రుఁ డడిగిన, హనుమంతుఁడు భూమికన్య • యాడిన వెల్లన్
వినిచె నతి చిత్రకూటంబున వృత్తము గుఱుతుఁ జెప్పెఁ • బురుషవరేణ్యా! ౧౪౧౬

అర్థములు. వినిచెన్=వినునట్లుఁ జేసెను, వినిపించెను ప్రేరణార్థకము వినిచెన్; చిత్రకూటంబున వృత్తము=చిత్రకూటము నందలి చర్య.

తా త్ప ర్య ము.

అని రామచంద్రమూర్తి యడుగఁగా హనుమంతుఁడు సీతాదేవి చెప్పిన మాట లెల్ల వినిపించి పురుషశ్రేష్ఠుఁడా! చిత్రకూట పర్వతమున జరిగిన వృత్తాంతము గుఱుతు గాఁ జెప్పెను.

క. నీతో డంత నిద్రించుచు, సీతాసతి మున్న లేవఁ • జెచ్చెరఁ గాకం
బా రమణీ స్తనమధ్యము, శాతనఖాగ్రమునఁ జీరె • సహసోద్గతమై. ౧౪౧౭

అర్థములు. శాతనఖాగ్రమునన్ = పదునైన గోటికొనచే- చీరెన్=గీచెను, సహసోద్గతమై=లటాలున నెగిరి వచ్చినదై - సుప్సుపేతి సమాసము.

తా త్ప ర్య ము.

నీతోడ నిద్దుర పోవుచు సీతాదేవి ముందుగా లేవఁగా లటాలునఁ గాకి యొకటి యెగిరి వచ్చి యామె స్తనమధ్యమునందుఁ దన వాఁడి గోళ్ళకొనలచే గీఁచెను.

క. ఆర్యజనోత్తమ! నీవును, బర్యాయంబునను నీవు • పడఁతుకతోడ సౌ
కర్యంబుగ నిద్దుర గొన, ధైర్యంబునఁ బక్షి మఱలఁ • దద్దయు నేఁచెన్. ౧౪౧౮

అర్థములు. పర్యాయంబునను = క్రమముగా, ఆమె లేచిన తరువాత నీవు - ఏఁచెన్=బాధించెను.

తా త్ప ర్య ము.

నిద్దురపోవుచుండినది యామె లేచి కూర్చుండఁగా నీ వామె తొడపై దల పెట్టి నిద్రించితివి. ఇట్లు నీవు సుఖముగా నిద్రించు సమయమున నా కాకి మఱల వచ్చి యామెను బాధించెను.

ఉ. రాముఁ డెఱుంగు నట్టిదొకటి • రాజసుతా! యిడు మంతె చాలు నా
భామిని నాల్గు దిక్కులను • బాఱఁగఁ జూచి నిజప్రవేణికా
సీమను గూర్చినైన మణిఁ • జీరచెఱంగున నుండి విప్పి స
ప్రేమను నాదు చేత నిడ • దేవిరొ నే నిటఁ దోయి వత్తునే. ౧౮౩౨

అర్థములు. నిజప్రవేణికాసీమను = తన జడయందు-కూర్పనైన మణిన్ = కూర్పఁ దగిన రత్నమును - సీతాదేవి కొన్ని సొమ్ములను బాఱవైచి, కొన్ని చెట్ల కొమ్మలకుఁ దగిలించెను గాని యీ జడబిళ్ళ సముద్రమునందుఁ బుట్టి యింద్రునిచే నీయఁబడిన దివ్యరత్న మగుటచే బయటఁ గానవచ్చిన రావణుఁడు హరించు నేమో యని దానిని మాత్రము తలనుండి తీసి రాక్షస స్త్రీలకుఁ గూడఁ దెలియకుండ చీర కొంగున ముడివైచి చీర బొడ్డులో దోపుకొని యుండెను. దీని వలన సీతాదేవి ద్రావిడుల వలె గూడకట్టు కాక యుత్తరాహిక స్త్రీలవలెఁ గుచ్చిళ్ళు జాఱవిడిచి దోఁచి పెట్టి చీర కట్టి యుండెనని తోఁచు చున్నది. ఈ విధముగనే కదా చీరలు కట్టుకొను స్త్రీలు ధనమును సొమ్ములను నేఁటికిని దాఁచు చున్నారు.

తాత్పర్యము.

అమ్మా! రాజపుత్రీ! రామచంద్రమూర్తి తెలిసికొనఁ గలిగిన గుర్తు నేదైన నొకటి యిమ్ము. అంతమాత్రము చేసినఁ జాలును. అని నేను చెప్పఁగా సమీపంబున రాక్షసస్త్రీలు లేకుండునట్టు లీప్రక్క నాప్రక్క నాలుగు వైపులఁజూచి వారుచూచిన రావణుతోఁ జెప్పుదురేమో యను భయముచే వారికిఁ దెలియకుండఁ దలలో ధరింప యోగ్యమైన యీ చూడామణిని చీరకొంగు ముడిలోనుండి తీసి నాయందలి ప్రేమచే నా చేత నుంచెను. అది తీసికొని యిటకేఁ దోయివత్తునా యంటిని.

చ. అని నమితోత్తమాంగమున • నామె పదంబుల వ్రాలి లేవ న
య్యనఘయు నాదు వర్తనము • నంబుధి దాటఁగ నుత్సహించుటల్
గని కనుదోయి బాష్పములు • గ్రమ్మఁగ గద్గదకంఠ యై ధరా
తనయ మదాస్యముం గనుచు • దైన్యము దోఁపఁగఁ బల్కె నీగతిన్. ౧౮౩౩

అర్థములు. నమిత+ఉత్తమాంగమునన్ = వంపఁబడిన శిరస్సుచే, అనఘ= పాపమెట్టిదో యెఱుఁగనిది, గద్గదకంఠయై = డగ్గుత్తిక పడుచున్న కంఠము గలదై, మదాస్యమున్ =నా ముఖమును.

తాత్పర్యము.

ఇట్లు చెప్పి తల నామె పాదములపై వ్రాల్చి లేవఁగా నా పుణ్యాత్మురాలు నా ప్రయాణ సన్నాహమును, సముద్రముదాఁట నుత్సహించుట చూచి రెండు కన్నుల నీళ్ళుగాఱ, మాట తడబడ సీతాదేవి నా ముఖముఁజూచి శోకముతో నిట్లు పలికెను.

—• సీతాదేవి సందేశవాక్యములు హనుమంతుఁడు శ్రీరామునకుఁ దెలుపుట •—

క. హనుమా! కుశలం బడిగితి, వనుమా శ్రీరాము వతని • యనుజు సుమిత్రా
తనయు సహామాత్యుని నిక, తనుజానుని నంతు నున్న•తక్షణవాణిన్. ౧౪౩౪

తాత్పర్యము. చూ. ప. ౧౦౦౨

క. అన్నా! రాఘవుఁ డెట్టులు, నన్ను విపత్సాగరంబు•నం జెఱ కుంచన్
కన్నారఁ బ్రోచు నా గతి, మన్ననమెయిఁ బలుక వన్న•మఱవకు మన్నా!

తాత్పర్యము. చూ. ప. ౧౦౦౩

క. ఇన్నిచరాచరావళి, నన్ను భయము పఱుచు విధము • నానావ్యసనా
పన్నత నేఁ గుందెడి గతి, విన్నప మొనరింపు ప్రోవ • నెలయుత శుభముల్.

తాత్పర్యము. చూ. ప. ౧౦౦౪

క. ఈ విధి మిగా యార్యామణి, భూవల్లభ! భృశవిషాద•పూర్వంబుగ నీ
తావరవర్ణిని పలికెను, నీ నా సతి కుశల యనుచు•నెఱినమ్మ మదిన్. ౧౪౩౬

అర్థములు. ఈ విధిన్ = ఈప్రకారముగ, ఆర్యామణి = ఆర్యస్త్రీలయందు శ్రేష్ఠురాలగు సీతాదేవి, భృశవిషాదపూర్వంబుగ = అతిశయించిన దుఃఖముతో - వరవర్ణిని = ఉత్తమస్త్రీ "శీతే సుఖోష్ణసర్వాంగీ గ్రీష్మే యా సుఖశీతలా-భర్తృభక్తా చ యా నారీ సా తు స్యా ద్వరవర్ణినీ"-న్యాయము. ఎవతె దేహము చలికాలము సుఖోష్ణముగను, ఎండకాలమందు సుఖశీతముగను నుండి భర్తయం దనురాగము గలదో యట్టి స్త్రీ వరవర్ణిని యనఁబడును. 'ఉత్తమా వరవర్ణినీ' యని యమరుఁడు.

తాత్పర్యము.

ఈ విధముగ మీ యార్యామణియు, వరవర్ణిని యగు సీతాదేవి మిగుల విషాద పడుచుఁ జెప్పెను. ఆమె జీవించి యున్న దని నమ్ముము.

—• ౬౮-వ సర్గము. హనుమంతుఁడు సీతాదేవితోఁ దనకైన
సంభాషణముఁ దెలుపుట •—

క. నా పయి నీ స్నేహమునుచే, నీ పంపిన వాఁడ ననెడి•నెఱనమ్మకచే
భూపాలోత్తమ! యానకి, యాపోవని రక్తి నిట్టు • లనియెన్ నాతోన్. ౧౪౩౫

అర్థములు. ఆపోవని = తృప్తిలేని.

తాత్పర్యము.

నాయందు నీకుఁగల స్నేహభావము చేతను నీవు పంపిన వాఁడనెడి నమ్మకము చేతను తృప్తిలేని యనురాగముతో నాతో నిట్లు లనెను.

ఓయి ! సీత శీలవతి యంటివే పరపురుషుఁడనైన నీతో నింత చనవుగ నెట్లు మాట్లాడినదందువా? ఆమె నాతో మాట్లాడుటకుఁ గారణము నా యోగ్యత కాదు. నా యందు నీకు స్నేహభావము గలదనియు నీవు పంపిన దూతననియు నమ్మి నాతో నీ మాటలు చెప్పెను. నాయందు నీకుఁ బ్రేమ లే దనియు ఏదో కార్యార్థముగ వచ్చిన

యెట్లుండవలెను. వాఁడు తెలిసికొనవలసిన విషయమేది ? యను విషయము కాండము స్పష్టముగాఁ దెలుపుచున్నది. దానిని వ్యాఖ్యానమూలమునఁ దెలియ వచ్చును. మరలఁ గ్రోడీకరించుటకు గ్రంథవిస్తరభీతి బాధించుచున్నది.

ఈ విధముగ నీ కాండము ముముక్షువులకు బుభుక్షువులకు నిష్కాములకు సకాములకు స్త్రీలకుఁ బురుషులకు సేవ్యమై సార్థకనామము వహించుచున్నది. సీతారామానుగ్రహంబున నాంజనేయుఁడు సముద్రము దాఁటి రామకైంకర్యము గావించినట్లు శ్రీ సీతారామాంజనేయానుగ్రహంబున నీ వ్యాఖ్యాతయు నీ కాండ మును బూర్వపుణ్యవశమున దాఁటఁగలిగెను.

—• సుందరకాండాంతపద్యములు •—

క. యతిమానసబిసజాలయ ! యతమాన జనార్థ నిర్వ•హణ సుసమర్థా !
నత సర్వభూతచయ ! యిం,గితవిజ్జనవర్య ! విబుధ•కీర్తితచర్యా ! ౧౫౪౯

అర్థములు. యతిమానసబిసజ + ఆలయ = జితేంద్రియుల హృదయపద్మ మును స్థానముగాఁగలవాఁడు, జితేంద్రియులచేత ధ్యానింపఁబడువాఁడా ! "యే నిర్జి తేంద్రియ గ్రామా యతినో యతయశ్చ తే" యని యమరుఁడు. యతమాన=ఒక్క కార్యార్థమై ప్రయత్నించు, జన = జనులయొక్క, అర్థ=కోరికను, ప్రయోజనమును, నిర్వహణ = నిర్వహించుటయందు, నెఱవేర్చుటయందు - సుసమర్థా = మిగుల సమర్థుఁడా, నత = నమస్కరించిన, సర్వభూతచయ = సమస్తప్రాణిసమూహములు గలవాఁడా, ఇంగితవిద్ + జనవర్య = ఇంగితము నెఱుఁగు వారిలో శ్రేష్ఠుఁడా, ఇంగిత మనఁగా ముఖనయనాది బాహ్యవికారములచే భావము తెలుపుట. 'ఆకార స్త్వింగ ఇంగిత'మ్మని యమరుఁడు. ఆకారశబ్దమునకు రెండర్థములు గలవు. ఆకృతి యని - ఇంగిత మనిఁ అభిప్రాయమును బ్రకటించుచేష్ట యింగితము. ఇది బుద్ధిపూర్వకమై యుండవలెను. అబుద్ధిపూర్వకములైన ముఖరాగాదులు వైవర్ణ్యాది శరీరవికారము. ఆకృతి - ఈ యుభయ విధచేష్టలు లేనివాఁడు కావున భగవంతుఁడు నిరాకారుఁడు. 'ఇంగితజ్ఞాశ్చ కోసలా' యని ప్రసిద్ధికదా. విబుధ = దేవతలచేతను, పండితుల చేతను, కీర్తిత = పొగడఁబడిన- చర్యా = నడవడి కలవాఁడా.

ఇట్లు చెప్పుటచే నీ గ్రంథకర్తయొక్క యభిప్రాయమును దెలిసికొని దాని నెఱవేర్పఁ జేసె నని భావము.

—• పద్మనాభ వృత్తము •—

రామా! నతాంహోవిరామా! మునీంద్రాత్మ•రామా! దయాసత్యధామా! నిశాట
స్తోమావళీభీమసంగ్రామసీమా! వి•ధూమాగ్నిధామాభ తేజస్సుధామా !
రామాంబుముగ్ధామ! నీలోత్పలశ్యామ• రాకేందుకామాభ సౌందర్యధామా !
సోమాదిముఖ్యామరారాధ్యనామా! వి•శుద్ధాత్మ భక్తావనోద్దామకామా! ౧౫౬౦

నతాంహస్ + విరామా = నమస్కరించువారి పాపములు నశింపఁజేయువాఁడా; 'అంహో దురితమస్కతేఽమ్మని' యమరుఁడు విరామశబ్దము కరణార్థక ఘఞన్తము. కర్తయే కరణముగా వివక్షితము. ఉరతమాదేశ మనెడి సద్విద్యాప్రకరణ శ్రుతి లోని యాదేశశబ్దము కరణార్థక ఘఞంతముగా శ్రుత ప్రకాశిక. మునీంద్రాత్మ రామా = మునిశ్రేష్ఠుల యాత్మలయందుఁ గ్రీడించువాఁడా, దయాసత్యధామా = దయకు సత్యమునకు నునికి పట్టయిన వాఁడా; నిశాట స్తోమావళీ = రాక్షసుల గుంపుల వరుసలకు- భీమ = భయంకరమైన-సంగ్రామ సీమా = యుద్ధప్రదేశము గలవాఁడా; విధూమ = పొగలేని- చక్కఁగా మండెడి- త్రిధామాభ = అగ్నిహోత్రమునితో సమాన మైన- తేజస్ = కాంతికి- సుధామా = మంచిగృహమైనవాఁడా; రామాంబుముక్ = నల్లనిమేఘమువంటి- ధామా = కాంతిగలవాఁడా; ఆశ్రితార్థ ప్రదానార్థ మిది విశేషణము. 'బలే రామో నీల చారు సితే త్రిషు' అని యమరము. నీలోత్పలశ్యామ = నల్లకలువవలె చామని చాయ కలవాఁడా, ఇది యాకారవర్ణ ప్రతిపాదకము. రాకేందు కామాభ = పూర్ణచంద్రునితోను, మన్మథునితోను సమానమైన-సౌందర్య=చక్కఁదనమునకు- ధామా = స్థానమైనవాఁడా, సోమాదిముఖ్య=స+ఉమ=సోమ=శివుఁడు మొదలగు ప్రముఖు లయిన-అమర=దేవతలచే, ఆరాధ్య=కొనియాడఁదగిన, నామా=పేరుగలవాఁడా!, విశుద్ధాత్మ = నిర్మల మనస్సుగల, భక్త = భక్తులను, అవన = రక్షించుటయందు, ఉద్దామకామా = అధికాపేక్షకలవాఁడా, రాగల యుద్ధకాండార్థ మిందు సూచితము. నతాంహో విరామా = సముద్ర గర్వభంగము, దయాసత్యధామా = శరణాగత విభీషణ రక్షణము, నిశాట........సీమా = రాక్షసులతోడి యుద్ధము, రావణాది శత్రు మారణము, మృతవానర జీవనము, సీతాహృదయానందకరత్వము, బ్రహ్మరుద్రేంద్రాది స్తోత్రము, విభీషణ పట్టాభిషేకము సూచితము.

పద్మనాభవృత్తము - ఏడు తగణములు, గగము-పదమూఁడింట యతి. ఈ వృత్తము గ్రంథకర్తకుఁ బ్రాణతుల్య మిత్రుఁడగు క్రొత్తపల్లె పద్మనాభశాస్త్రిలవారి. పేర వారి జీవితకాలమందే వ్రాయఁబడినది. ఆయన మరణించి యిరువది సంవత్సరము లయినను ఎన్నఁడు కనఁబడినవాఁడు కాఁడు. దీని కర్థము వ్రాసిన రెండు దినముల కావల నాయన స్వప్నములోఁ గనబడుటచే నీ విషయము వ్రాయవలసి వచ్చెను. అటువంటి మిత్రుఁడు దుర్లభుఁడు. ఈ గ్రంథకర్తకుఁ గష్టకాలమం దనేక విధముల నాదరించెను. భగవంతుఁ డాయనకు శాశ్వతశాంతి యొసంగుఁగాత.

—• అంబురుహవృత్తము •—

శ్రీరమణీశరజాబ్జ భవానన • సారసహిత పద్యసం
వారసుశంసి నిజార్థ మహాద్భుత • శౌర్యధైర్య పరాక్రమా!

భూరిపయోనిధితారణ కారణ • భూతనిర్జరయానవ
చ్చారుతరాత్మ సమాఖ్యః నిజాశ్రిత • సర్వసౌఖ్య విధాయకా! ౧౪౬౧

అర్థములు. తన్మారమణీ=భూమి - ఇది యొకటికి సంజ్ఞ, శరజ = కుమార స్వామియొక్కయు 'శరజన్మా షడానన'యని యమరుఁడు. అబ్జభవ=బ్రహ్మయొక్క ఆనన = ముఖములు - కుమారస్వామికి నాఱుముఖములు, బ్రహ్మకు నాలుగుముఖములు; సారసాహిత = చంద్రుఁడు - ఇది యొకటి సంజ్ఞ. ఇట్లు విలోమముగాఁ జూచిన 1461 యగును. వేయి నాలుగునూర్ల యఱువది యొకటి - ఈ సంఖ్య గల - పద్యసంవార = పద్యసమూహముచే, సుశంసి = బాగుగాఁ గొనియాడఁబడు, నిజార్థ = తన యాశ్రితులయొక్క, మహాద్భుత శాథ ధైర్య పరాక్రమ = మిక్కిలి యాశ్చర్యకరమైన, మిగుల ధైర్యముతోఁ గూడిన పరాక్రమము గలవాఁడా. ఇట్లు చెప్పుటచేఁ దన యాశ్రితుఁడైన హనుమంతుఁ డన్ని పద్యముల నింపుఁ గొనియాడఁ బడె నని భావము. భూరిపయోనిధి = గొప్పసముద్రమును, తారణ = దాఁటుటయందు, కారణభూత = సాధనమైనఁ భూరిపయోనిధి యనుటచేఁ దక్కిన సముద్రములు సంసారసాగరము నంత పెద్దవి కావని భావము. నిర్జరయానవత్ = దేవయానమైన విమానములవలె, చారుతర = మిగుల రమ్యమైన, ఆత్మసమాఖ్యా = తనపేరు గలవాఁడా, రామనామోచ్చారణముచే సాగరజలము నంటకయే సుఖముగ విమానమునీఁదఁ బోయినట్లు, (హనుమంతుఁడు సముద్రము దాఁటినట్లు) సంసారము సుఖముగ దాఁటవచ్చునని భావము. నిజాశ్రిత = తన్నాశ్రయించిన వారికి, సర్వసౌఖ్య విధాయకా = సమస్తసౌఖ్యములు గలిగించువాఁడా, ఇట్లనుటచే రామనామోచ్చారణముచే ముక్తు లగు వారికి భగవంతునితో సమానమైన సమస్త భోగములు కలుగునని భావము. "భోగమాత్ర సామ్యలింగాత్" అని బ్రహ్మసూత్రము చెప్పుచున్నది కదా. తారణ శబ్ద స్వారస్యముచేఁ దారక నామము వివక్షితము.

సీ. జానకీ రఘురామ•చరణ సేవాసక్త, చిత్తుఁడై తత్కృపా•సత్తి కతన
వామలూరూద్భవు•పాదముల్ దలఁదాల్చి, ప్రత్యక్ష బ్రహ్మాత్మ•భవుని కెరఁగి
యభివాదనము సల్పి యాచార్యులకునెల్ల, వ్యాఖ్యాతలకును సా•ష్టాంగ మెరఁగి
పరమభక్తులును•బ్రపన్నులు సుదమొంద స్వాంధ్రవాల్మీకి రా•మాయణమున
గీ. ఘన మహార్థంబు సుందర కాండమునకు, వాసుదాసుండు రచియించి•వ్యాఖ్య దీని
సుందర మనంగ శ్రీరామ•చంద్ర విభున, కర్పణము చేసె జన్మంబు•సార్థకముగ.

ఈ కాండమువలన నేర్చుకొనవలసిన విషయములు.

౧. జీవాత్మ పరమాత్మల సంబంధ మెట్టిది ?

౨. జీవాత్మ శరణోపాయ మెట్టిది ?

3. జీవాత్మలకు సేవ్యుఁడు నిర్విశిష్టరాముఁడా? సీతా విశిష్ట శ్రీరాముఁడా?
౪. శిష్యాచార్య లక్షణములు.
౫. ఆత్మావలోకన పరుఁడైన యోగి లక్షణము.
౬. బద్ధ జీవ తారతమ్యము.
౭. యోగికి భక్తప్రపన్నునకు భేదము.

—• గద్యము •—

ఇది శ్రీమద్రామచంద్రచరణారవింద మిళిందాయమాన
మానసశ్రీ మహావైభవాంధ్ర వాల్మీకి కవిసార్వభౌమాది బిరుదాంచిత
వావిలికొలను రామచంద్రరాయ తనూభవ సుజనవిధేయ
సుబ్బరాయ నామధేయప్రణీతం బైన మందరాఖ్య వ్యాఖ్యానసమేత
శ్రీమదాంధ్ర వాల్మీకిరామాయణ మను నిర్వచన
మహాకావ్యంబునందు సుందరకాండము.

శ్రీ రా మా ర్ప ణ మ స్తు.

శ్రీ శ్రీ శ్రీ

శ్లో. నమోస్తు రామాయ సలక్ష్మణాయ, నమోస్తు దేవ్యై జనకాత్మజాయై
నమోస్తు వాతాత్మభువే వరాయ, నమోస్తు వల్మీకభవాయ తస్మై.

